# భారతి

సాహిత్య మాసపత్రిక

మార్చి 1982



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మార్చి 1982

సంపుటము : 59 సంచిక : 3

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

1

# విషయానుక్రమణిక

## మార్చి 1982


| | | |
|---|---|---|
| ఓ జగన్నటరాజ !! | శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం | 3 |
| శివారాత్రికము | ,, | 4 |
| ఎంతంత దూరం...... | శ్రీ నాగాభట్ల మార్కండేయశర్మ | 4 |
| డా. విలియమ్స్ కెరే | శ్రీ డి. రామలింగం | 5 |
| అహం — యిదం | ఉదయభాను<br>శ్రీ కోడూరు నరసింహమూర్తి | 7 |
| ప్రసవ వేదన | శ్రీ మేకా సుధాకరరావు | 8 |
| శాస్త్రీయ దృక్పథం- ఒక అవగాహన | డా. గుమ్మనూరు రమేష్‌బాబు | 9 |
| నిస్పృహలో స్పృహ | శ్రీ రత్నశీకర విశ్వనాథ్ | 15 |
| భువనతారలు | శ్రీ వేంపాటి సోమరాజు | 16 |
| నేటి తెలుగులో సమాస నిర్మాణం | డా. యన్. శివరామమూర్తి | 17 |
| ఉగాది ఎందుకు ? | శ్రీ పులికంటి కృష్ణారెడ్డి | 24 |
| దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు | శ్రీ అవటపల్లి నారాయణరావు | 26 |
| శివరాత్రి | శ్రీ శనగన నరసింహస్వామి | 33 |
| ఈ చీకటి ... | శ్రీ వి. సంపత్కుమారాచార్య | 33 |
| పారిజాతాపహరణం—విభిన్న కథనాలు | శ్రీ బులుసు వేంకటరమణయ్య | 34 |
| నా నువ్వు | "కన్న" | 37 |
| గుడ్‌మార్నింగ్ ! | శ్రీ రంధి సోమరాజు | 38 |
| శీర్షిక నెత్తుకునే వరకు ... | శ్రీ కందాళై రాఘవాచార్య | 39 |
| మేఘావతారాలు | ,, | 40 |
| ద్వైవిధ్యం | శ్రీ తిరునగరి | 41 |
| భావనా పల్లవం | శ్రీ సడ్లపల్లె చిదంబర రెడ్డి | 41 |
| ప్రభుత్వరంగంలో ఉద్యోగి బృందపాలనా నిర్వహణ- ఒక నూతన మార్గ ఆవశ్యకత | శ్రీ టి. నరసింహారావు<br>శ్రీ జి రామేశ్వరము | 42 |
| రజనీ ముఖము | శ్రీ వజ్ఝల కాళిదాసు | 47 |
| రాహుకేతువులు | శ్రీ యస్. యస్. రెడ్డి | 47 |
| పాటు | శ్రీ వి. వి. బి. రామారావు | 48 |
| మధ్యతరగతి మనిషి | శ్రీ కె అంజయ్య | 52 |
| ఆంధ్రమహాభారత నిఘంటువు | శ్రీ నడుదవోలు వేంకటరావు | 53 |
| ఈ పక్షి ... | శ్రీ జనజ్వాల | 55 |
| ఆ గుడిసె ముందు దీపం<br>కృష్ణబాంధవి | శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి | 56 |
| విశ్వబ్రాహ్మణ కవులు | శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి | 57 |
| ఆహ్వానం | శ్రీ వేముగంటి నరసింహాచార్యులు | 63 |
| ఆగామి శతాబ్దానికి సాహిత్య పురోగమనం | శ్రీ సోమసుందర్ | 64 |
| నిరీక్షణ<br>కదలనిది | శ్రీ పి. యస్. రెడ్డి | 67 |
| కలగూరగంప | | 68 |
| గ్రంథవిమర్శలు | | 73 |

# ఓ జగన్నటరాజ!!

నటరాజ! నటరాజ!!
ఓ జగన్నటరాజ!
నటియించు మా యెదల
ఘటియించి చిత్కళల — నటరాజ

నీ చరణ విన్యాస
నృత్య భంగిమలందు
గోచరించును మాకు
ఆచరణ మార్గమ్ము ॥ — నటరాజ

నీవు తాండవ మాడ
దేవి లాస్య మొనర్ప
పారవశ్యమ్ములో
తారాడు భావాలు — నటరాజ

నీ ఢమరుక ధ్వనులు
గూఢ శాస్త్రార్థముల్
రూఢ మ్మొనర్చెడి ప్ర
గాఢ సూత్ర ప్రతతి ॥ — నటరాజ

నీ ధీర గంభీర
తాండవార్భటులచే
నా జీవనాడీ స
మస్తమ్ము కంపించు ॥ — నటరాజ

మాతృదేవీ చరణ
లాస్యాళి నాలోని
మృదు మనోహర దివ్య
భావాళి ప్రేరేచు ॥ — నటరాజ

నీ త్రిశూలమ్ముచే
మాలోని తామసము
మూల విచ్ఛేదమ్ము
గావింపుమో దేవ !! — నటరాజ

నీ త్రినేత్రాగ్నిచ్ఛ
టా విస్ఫులింగముల
మా దుష్ట కామనము
దహియింపుమో దేవ !! — నటరాజ

నీ గళాలంకరణ
నాగ ఫూత్కారముల్
మాలోని విషయ సీ
త్కారములుగా చెలగు ॥ — నటరాజ

నీ పాప సరులచే
మా పాప చింతనల
పోకార్చి సుఖశాంతి
దాంతు లిమ్మోదేవ !! — నటరాజ

నీ జటాజూటమున
నుప్పొంగు గంగమ్మ
పండించు మాగుండె
లను భావసస్యముల్ ॥ — నటరాజ

నీ కృపా దృష్టిచే
నీ కళారాధకులు
లోకముల మేల్కొల్పి
కూర్తు రాహ్లాదమ్ము ॥ — నటరాజ

నవరసమ్ములతోడ
నవగతుల నొనగూర్చి
నవనవోన్మేషంపు
జీవనము సమకూర్చు ॥ — నటరాజ

అందుకో మా హృదయ
భావ నీరాజనము
అందిమ్ము నీ హృదయ
సౌందర్య భాండమ్ము — నటరాజ

ఏడాది కొకమారు
గా కాదు శివరాత్రి
నిత్య శివరాత్రి వ్ర
తాసక్తి సమకూర్చు ॥ — నటరాజ

# శివరాత్రికము

జయము జయము నాట్యకళా స్థాపక !
జయము జయము త్రిభువన పరిపోషక !!
జయము జయము దుష్కృతజన శిక్షక !!!
జయము జయము సాధు జగద్రక్షక !!

జయము జగజ్జన నాటక సూత్రా !
జయము పరిష్కృత భావ పవిత్రా !!
జయము నిత్య పరిశుద్ధ చరిత్రా !!!
జయము సత్య శివ సుందర గాత్రా !!

జటా జూటమున జాహ్నవి ఘోషము
కలువలరాయని కిరణ ప్రసారము
అఇఉణ్ .... హల్లితి ఢమరుక నాదము
నిశిత కాంతు లెగజిమ్ము త్రిశూలము

సర్వజ్ఞాంకిత తృతీయ నేత్రము
విరాగ సూచక. కపాల దండము
జ్యోతిర్మయమగు మంగళ రూపము
ప్రళయ భయంకర తాండవ భంగిమ

నిత్యము మా హృదయమ్ముల నెలకొని
సత్యవ్రత సంసక్తుల జేయుత ॥

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం



# ఎంతంత దూరం... ...

శ్రీ నాగాభట్ల మార్కండేయ శర్మ

హోరు హోరనే కడలి పొంగు
ఎంత దూరం వినిపిస్తుంది
ఎగిరెగిరి పడే కెరటాల జోరు
ఎంతలో అణగారిపోతోంది
కొండా కోనా దాటితే గాని
సముద్రం కనబడదు వినబడదు.



శ్రీ డి. రామలింగం

# డా. విలియమ్ కెరే

తెలుగుభాషకు 'ఎ గ్రామర్ ఆవ్ ది తెలింగ లాంగ్వేజ్' అనే పేరుతో 1814 లో ఇంగ్లీషులో వ్యాకరణం రచించిన వ్యక్తి డా. విలియమ్ కెరే. ఇతడు బహుభాషా కోవిదుడు, విద్యావేత్త, పండితపోషకుడు.

విలియమ్ కెరే జీవితచరిత్రను జె. సి. మార్ష్‌మన్ రచించాడు. 1885 లో జార్జిస్మిత్ అనే అతను మరొక జీవితచరిత్ర రచించాడు. కాని ఇప్పుడవి లభ్యంకావడం కష్టం.

కెరే మొదట వృత్తిరీత్యా బూట్లు తయారుచేసేవాడు.

క్రైస్తవ పత్నులు కాని వారికి క్రీస్తు చరిత్రను తెలియ జెప్పడానికీ, క్రైస్తవ సువార్తను ప్రచారం చేయడానికీ ఇంగ్లండులో 1792 లో బాప్టిస్టు మిషనరీ సొసైటీ స్థాపింపబడింది. ఆ మిషన్ తరఫున బెంగాలులో పనిచేయడానికి ముందుకు వచ్చినవాడు కెరే. ఇతను 1793 లో కలకత్తా చేరుకున్నాడు.

1800 సంవత్సరంలో కలకత్తా సమీపాన శ్రీ రామ్‌పూర్‌లో బాప్టిస్టు మిషన్ నెలకొల్ప బడింది. దీనినే పాశ్చాత్యులు సెరామ్‌పూరు అని అనేవారు. ఇది బెంగాలు సాంస్కృతిక చరిత్రలో ఒక ముఖ్య సంఘటన అని బెంగాలీ సాహిత్య చరిత్రకారుడు డా. సుకుమార్ సెన్ వ్రాశాడు. ఈ మిషన్‌కు విలియం కెరే, జాషువా మార్ష్‌మన్, విలియం వార్డ్ మూర్తిత్రయం వంటివారు. మిషన్‌తోపాటు ఒక ముద్రాక్షరశాలను కూడా పెట్టారు. ఈ మిషన్ వారు స్కూళ్ళు పెట్టి భారతీయులకు ఇంగ్లీషునేర్పారు. ఒకప్పుడు సతీసహగమనముల సంఖ్య అధికంకాగా ఆ విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చి వాటిని ఆపమని కోరారు. రాజారామమోహన రాయ్ శ్రీరాంపూరు సందర్శించగా కెరే ఆయనకు సగౌరవంగా స్వాగతం చెప్పి, బైబిల్ ప్రతిని ఆయనకు కానుకగా ఇచ్చాడు. రామమోహనరాయ్ ఈ మిషన్ విద్యావ్యాప్తికి చేస్తూ ఉన్నకృషికి సంతృప్తిజెంది వారికి ఒక స్కూలు నిమిత్తం స్థలం ఉచితంగా ఇచ్చినట్లు రాయ్ జీవితచరిత్ర వ్రాసిన సౌమ్యేంద్రనాధ టాగూరు వ్రాశాడు.

ఏసుక్రీస్తుకు ఆవిష్కృతమైన దైవప్రేమ జ్ఞానమును ఇండియా దేశీయులకు బోధించడం కెరే లక్ష్యం. అతడు 1801 లో కలకత్తాలోని ఫోర్ట్ విలియం కాలేజిలో బెంగాలీ సంస్కృతశాఖల అధికారిగా నియమితుడైనాడు. ఆ రోజులలో ఆ కాలేజీ యూరపు పండితులూ, భారతీయ విద్వాంసులూ కలుసుకునే విద్యాకేంద్రంగా వాసికెక్కింది. ఆ కాలేజీలో వివిధ దేశభాషల పండితులు కెరేకు సహోద్యోగులుగా ఉండేవారు. వారి సహకారంతో క్రైస్తవమత గ్రంథాలను ప్రధానమైన భారతీయ భాషలలోకి అనువదించి ప్రకటించాలని కెరే తలపెట్టాడు.

కెరే ఎనిమిది మంది పండితులను ఈ పనికి నియమించాడు. వారిలో ముఖ్యుడు మృత్యుంజయ్ విద్యాలంకార్. అతని మాతృభాష ఒరియా. సాహిత్యంలో ఉద్దండుడు. మనిషి స్ఫురద్రూపి. ఎంతో వైదుష్యం ఆర్జించినవాడు. సంస్కృత కావ్యాలు క్షుణ్ణంగా చదువుకున్నవాడేకాక, ఉత్తమ విమర్శకుడు కూడా.

క్రైస్తవమత గ్రంథాలను మొదట సంస్కృతంలో తెచ్చినట్లయితే అవి భారత ప్రజల గౌరవానికి పాత్రం కాగలవనీ, సంస్కృత బైబిల్‌ను ఇతర భారతీయ భాషలలోకి అనువదించడం సులభతరమనీ కెరే ఆశించాడు. అట్లాగే మృత్యుంజయ్ విద్యాలంకార్ తోడ్పాటుతో న్యూటెస్టామెంట్ సంస్కృత ప్రతిని సిద్ధం చేసి 1808 లో ముద్రించాడు. పండితులు మెచ్చుకున్నారు.

1833 సంవత్సరం నాటికల్లా (అంటే కెరే చనిపోవడానికి సంవత్సరం ముందుగానే) బైబిలు 34 భాషలలోకి అనువదింపబడింది. బెంగాలీ, ఒరియా, హిందీ, మరాఠీ, సంస్కృతం, అస్సామీ భాషలలో మొత్తం బైబిలు లభ్యమైంది. న్యూటెస్టామెంట్ తెలుగు, కన్నడ, గుజరాతీ, పుష్తు, కాశ్మీర్, ఖాసి వంటి 23 భాషలలో వచ్చేసింది.

అయితే కెరే బెంగాలీ అనువాదం చదవడానికి అంతబాగా ఉండదని అంటారు. కారణమేమిటంటే అతని అనువాద విధానం మక్కీకి మక్కీగా ఉండేది. మూలంలో ఉన్న పదమే తర్జుమాలో కూడా రావాలి. కాబట్టి అది మూలానికి సన్నిహితంగా ఉండేదికాని పాఠకునికి ఇంపుగా సుబోధకంగా ఎట్లా ఉంటుంది? ఒక్కొక్క

భాషలోకి అనువాదం విషయంలో కెరే ఆ భాషలో నిష్ణాతుడై సంస్కృతంకూడా బాగా వచ్చి ఇతరదేశ భాషలలో ప్రవేశమున్న పండితునిపై ఆధారపడేవాడు. ఒకాయన వెళ్ళిపోతే మరొకరు లభించడం కష్టంగా ఉండేది. కాని చిత్రమేమిటంటే ఒక భాషలో పనిపూర్తి అయ్యేప్పటికి కెరే ఆ భాషలో చక్కని ప్రవేశంపొందేవాడు. అంతేకాక దాని అనువాద పాఠంలో తగు సవరణలు చేసి మెరుగులు దిద్దగలస్థితిలో ఉండేవాడు. అంటే అనువాదాలు కొంతమంది పండితుల కృషి ఫలితం.

తన అనువాద పద్ధతినిగూర్చి కెరే ఇట్లా చెప్పుకున్నాడు. “నా అనువాదం శైలినీ, వాక్య విన్యాసాన్నీ నా పండితుడు పరిశీలించేవాడు. మూలమునకు వ్యత్యాసం లేకుండా సరిగా ఉన్నదా లేదా చూచేవాడు. నా అనువాదాన్ని నాకు చదివి వినిపించేవాడు. అతడు వత్తిపలుకు విధమును నేను గమనించి, అతనికి పూర్తిగా అర్థమైనదీ లేనిదీ గ్రహించగలిగేవాడిని. అతను సరిగా చదవలేక పోతే నా అనువాదమునుగూర్చి శంక కలిగేది. బెంగాలీలో ఒక్క ఫుల్‌స్టాప్ తప్ప, ఇతర విరామస్థానముల గుర్తులు లేకుండుటచేత ఎక్కడ నొక్కి చదవవలెనో పాఠకునికి అంత సులభమైన పని కాదు.” అయినా బెంగాలీ వచన రచనకు మంచో చెడో ఒక బాట వేసిన వారు కెరే, అతని సహచరులూనూ. ఆ బాట ననుసరించే ఆ తరువాత ఉత్తమ వచన రచన వచ్చింది.

అయితే కెరే ఇన్ని భాషల అనువాదాల అజమాయిషీ ఎట్లా చేసేవాడా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. అందుకు ఆయన చెప్పిన సమాధానం: “సంస్కృతం, హిందీ, బెంగాలీ, మరాఠీ, పర్షియన్, పంజాబీ, తెలుగుభాషలతో పూర్తి పరిచయం కలిగిందంటే ఇతర దేశ భాషలలో ప్రావీణ్యం సంపాదించడం కష్టమేమీకాదు.”

ఈ కెరే యే తెలుగు సంస్కృతభాషా జన్యమన్నట్లు వ్రాయగా కాంబెల్, విలియంబ్రౌన్ అతనిని విమర్శించిరని డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు వారి ‘సి. పి. బ్రౌన్ చరిత్రము’ లో వ్రాశారు. ఇతర భాషలను సంస్కృతమయం చేసే ధోరణి అతనిలో వుండేదట.

కెరే మృత్యుంజయ్ విద్యాలంకార్ సహకారంతో బెంగాలీ భాషలో శిక్షణ పొందవలసిన సివిలియన్ ఉద్యోగుల ఉపయోగం కొరకై పాఠ్యపుస్తకాలుకూడా రచించాడు. సంస్కృతం, మరాఠీ, పంజాబీ భాషలకు వ్యాకరణములు నిర్మించాడు. సంస్కృత వ్యాకరణం ప్రసిద్ధికెక్కింది.

కెరే నిర్వహించింది ఒక బ్రహ్మాండమైన కార్యక్రమం. 1806లో కలకత్తాలో ఉండగా ఆయన దినచర్య ఇట్లా ఉండేది. “ఉదయం 5-45 గం. లకు నిద్రలేచేవాడు. హీబ్రూ బైబిలునుంచి ఒక అధ్యాయం చదివేవాడు. తరువాత ఏకాంతంగా కొంతసేపు ధ్యానం. ఏడు గంటలకు నౌకర్లు బెంగాలీలో కుటుంబ ప్రార్థనలకు వచ్చేవారు. ఉపాహారం కోసం నిరీక్షిస్తూనే ఒక మున్షీవద్ద పారసీ చదువుకునేవాడు. ఉపాహారం అవగానే రామాయణమును సంస్కృతం నుండి ఇంగ్లీషులోకి అనువదించే పనిని ముందు వేసుకు కూర్చునేవాడు. పది గం. లకు కాలేజీకి వెళ్ళి తన తరగతులకు బోధించడం, ఇతర పనులు పూర్తి చేసుకొని 2గం. లకు తన బసకు తిరిగి వచ్చేవాడు. వెంటనే జెరిమైయా బెంగాలీ అనువాదం ప్రూఫులు దిద్దేవాడు. భోజనం ముగించి కాలేజీ ప్రధాన పండితుని సహాయంతో సెయింట్ మాథ్యూ సువార్త ఎనిమిదవ అధ్యాయాన్ని సంస్కృతంలోకి అనువదించేవాడు. సాయంకాలం 6 కాగానే తెలుగు పండితుడు వచ్చేవాడు. ఆయనతో కూర్చొని ఆ భాషను అభ్యసించేవాడు. ఏడున్నరకు ఒక సమావేశంలో క్రైస్తవ మతబోధ చేసేవాడు. రాత్రి 9గం. లకు ఎజెకియల్‌ను రెండు గంటలపాటు బెంగాలీలోకి అనువదించేవాడు. ఆ పిమ్మట ఇంగ్లండులోని మిత్రునికి ఉత్తరంవ్రాసి, గ్రీకు టెస్టామెంట్‌లో ఒక అధ్యాయం ఒక్కడే సభక్తికంగా చదువుకొని, అప్పుడు నిద్రపోయేవాడు.” భాషా సాహిత్యాలకు సేవచేసేవారికి ఈ నిర్విరామకృషి తప్పదు. కాబట్టే మృత్యుంజయ్ విద్యాలంకార్‌గారు “కెరే సాహెబుగారి శరీరమెటువంటిదబ్బా! ఆకలి అయినట్లుగాని, అలసట చెందినట్లుగాని కన్పించేవాడేకాదు. ముందున్న పని పూర్తి అయ్యేదాకా దానిని వదిలిపోడు” అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

అయినా కెరేకూ, అతని సహచరులకూ ఇంగ్లండులో మెప్పు లభించలేదు. హీనులు అని దూషించారు. క్రైస్తవ మతప్రచారం చేయమని పంపితే కెరే చేసింది, బెంగాలులో విద్యావ్యాప్తి, భారతీయ భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ. పూర్తిగా మత ప్రచారం చేయక, భాషలలో పడి తన కర్తవ్యం మరిచాడని విమర్శ. కాని సమకాలిక ఆంగ్లకవి రాబర్ట్ సదే (1774-1843) కెరేనుగూర్చి చెబుతూ “ప్రపంచంలోని రాజులూ ప్రభువులూ విశ్వవిద్యాలయాలూ

ఇతర సంస్థలూ చేసిన, చేయ యత్నించినదానికన్న కెరే క్రైస్తవ మత గ్రంథాలలోని జ్ఞానమును వ్యాప్తి చేయడానికి ఎక్కువ కృషి చేశాడు." అన్నాడు. ఇంతకన్న ప్రశంస మరేమి కావాలి?

1761 లో జన్మించిన విలియంకెరే 1834 లో దివంగతుడై భారతీయ భాషల చరిత్రలో శాశ్వత స్థానం పొందగలిగాడు. "ప్రాచ్య ప్రపంచానికి కెరే, జాన్ వైక్లిఫ్ వంటివాడని" జార్జిస్మిత్ కొనియాడాడు. వైక్లిఫ్ 14 వ శతాబ్దికి చెందిన ఆంగ్లేయుడు, సంస్కర్త, వేదాంతి. బైబిల్‌ను లాటిన్ భాషనుండి ఇంగ్లీషులోకి మొట్టమొదట అనువదించినవాడు వైక్లిఫ్. ఇంగ్లీషు చదివే ప్రజల ఉపయోగంకోసం ఆపని చేశానని ఆయన చెప్పుకున్నాడు. అట్లాగే విలియమ్ కెరే క్రైస్తవుల పవిత్ర గ్రంథాన్ని తూర్పు ఆసియా ప్రజలకిచ్చాడు.

******

# అహం - యిదం

## ఉదయభాను - శ్రీ కోడూరు నరసింహమూర్తి

హసించని ఉదయరాగంలో
అస్తాద్రిని రేపటి 'పూయనిపూలు' కోస్తూ
నవ్యరాగ కవనంలో-చల దూర్మిల పవనంలా
రుదనంలో హసిస్తూ-ఆత్మ గతంగా పరిహసిస్తూ
చేరుకొంటూ మరుఛాయల దూర తీరాన్ని
ఆత్మ చైతన్యం జ్వాలాముఖీ విస్ఫులింగంకాగా
అందందే పేరుకుపోయిన సాలెగూళ్ళు
చేత్తో తీసేసేకొద్దీ దట్టంగా పేరుకుపోతున్నాయి
నా అస్తిత్వాన్ని ప్రశ్నిసూ చైతన్యాన్ని ప్రహసిస్తుంది
చీకటి మింగిన మేను ఆత్మవలయంలోకి చేరుకోవాలని
"ఆక్టోపస్"లా హవన కవనాన్ని జ్వలింపచేస్తూ
చొచ్చుకుపోతోంది
లయ విచలత్తురంగ తరంగ వేగంతో
తుహినాచల, మహిమామయ, మదనాహవ స్వరజతులతో
అవనీ తలంనుంచీ అభ్రంకషం దాకా
అలముకొన్న తిమిరంలో
"మిథ్యాపాదం"లా ప్రచ్ఛన్న రూపంలో
కాలం కొలవలేని కైవారం కొరకు చేతులు చాస్తూ
హేమంతంలో వసంతాన్ని వెతుకుతుంటాను
లయ ప్రళయ ఝుం ఝూనిలంలో విషపాయి నీలకంఠుడనై
భుగ భుగల గరళాన్ని ఆత్మగతం చేసుకొంటూ
పీయూష మధుర సుధాస్రవంతుల్ని అవనీతలాని కందిస్తా
గర్జా నిర్ఘోషాల కైటభాలను నిర్జిస్తూ
ధూమ్రాచ్ఛన్న భాగ్యాకాశంలో "ఉదయతారిక" నవుతాను
'శ్వేతపర్ణుడనై' విలయ లయ ఘోషలతో
శోకంనిండిన నాకంలో మైనాకంలా విస్తరించి విస్మయిస్తాను
మలయ పవన చేలాంచలం సోకనంత వరకూ
వలయ విసర్జిత పృథువ్యోమమండల పరీవ్యాప్తం
కానంతవరకూ
కాల కుబుసం "విస్మయాస్థాల" వల్మీకం చేరనంతవరకూ
నిరీక్షణాల అన్వేషణ "అహం - యిదం" అంటూ
ఆక్రోశిస్తూంటుంది
అజ్ఞాన తిమిరం బధిరించిన ధ్వాంతంలో
నిరంతరం అలమటిస్తూనే వుంటుంది
అసత్యాన్ని సత్యంగా పోల్చుకొంటూనే వుంటుంది!

# ప్రసవ వేదన

## శ్రీ మేకా సుధాకరరావు

కడలి కౌగిట కరిగిపోవాలని
నురుగులు కక్కుకుంటూ పరుగులెత్తే
సరిత్ప్రవాహాలలో—
ఆకాశకాసారం లో
అలవోకగా యానంచేసే
అంబుద నౌకా పంక్తులలో—
విరబూసిన గున్నమామిడి గుబురులలో
కురిసే సూర్యకిరణాల కవోష్ణకాంతులలో—
ఏదో అవ్యక్త చైతన్యం
యెదను కదిలిస్తుంది!

హిమ బిందువులు చిందిన
మృదుల శాద్వలాలలో—
కల్హారాలు కనులపండువుగా నవ్వే
వెన్నెల సరస్సులలో—
సృష్ట్యాలంకృత వసంత వనాలలో—
ఏదో అనిర్వచనీయమైన
సౌందర్యం, ఆనందం విరియిస్తుంది!

కనులు చొచ్చుకుపోలేని
నీలిమ లోతులలో—
గంభీరోన్నతమైన
పర్వత పంక్తులలో—
నీల గగనాన తళతళలాడే
తారకా తతిలో—
ఏదో అనధ్యయన పాఠం
ఆలోచనలు రగిలిస్తుంది!

అన్యాయాక్రమాల విజయోత్సవాలూ
మానవతా విలువల పరాజయాల పరాభవాలూ
ధనాధికారాల దౌర్జన్యాలూ
స్వార్థాహంకారాల దోపిడీ చర్యలూ—
అసూయా ద్వేషాల
అవాంఛనీయ కార్యకలాపాలూ
కష్టలూ, కార్పణ్యాలూ—
సజావుగా సాగిపోతున్న
సామాజిక జీవన స్రవంతి
ఒదేపనిగా యెదను కోరేస్తూ
ఏదో బాధను
నెత్తురుగా స్రవింపచేస్తుంది
మంటలుగా జ్వలింపచేస్తుంది!
ఆవేశం ఉప్పొంగజేస్తుంది!

వీటి పరిశీలనా జనితమైన
అవ్యక్తాను భూతిలో—
ఆ భావదేహాలను
హృద్యంగా ఆవిష్కరించే
భాషాదుస్తుల నెన్నుకొనే ఆరాటం
ప్రసవ వేదనలో నిండుచూలాలి పోరాటం.

ఆ రసార్ద్రక్షణాలలో నేను
ఒకోసారి
చేతులు కదలని చిత్రకారుణ్ణి!
గొంతు పలుకని గాయకుణ్ణి!



డాక్టర్ గుమ్మనూరు రమేష్ బాబు

# శాస్త్రీయ దృక్పథం - ఒక అవగాహన

శాస్త్రీయత అనేపదం చాల సున్నితమైనది. అత్యంత జాగరూకతతో ఎంతో జాగురతతో తూచి చూచి వాడవలసిన అతి ముఖ్యమైన పదం. నేటి విజ్ఞాన శాస్త్రంలో ఈ పదానికున్న విలువ ఏమాత్రం వెలకట్టి చెప్పలేనిది. ముఖ్యంగా ఈ నవీన యుగంలో ఈ పదానికున్న విశిష్టత శ్లాఘనీయమైనది. ఏకచక్రాధిపత్యంగా వెలుగుతున్న మకుటంలేని మహారాజులా ప్రజాశ్రేయస్సనే కర్తవ్యాన్ని నిర్వహించే యజమానిలా నభూతో నభవిష్యతి అని అనిపించుకొంటోంది. ఆ విధంగా ఈ క్షణంవరకు అనిపించవచ్చని ఈ క్షణం తరువాత అనిపించకుండా పోవడానికి తగిన అవకాశాలున్న కారణం స్ఫురించవచ్చని అనుకోవడం నిజమైన శాస్త్రీయత అనిపించుకొంటుంది. ఈ అవగాహన కొరవడడం ఒక విధంగా దురదృష్టకరం!

విజ్ఞానం అనేది ఎప్పటి కప్పుడు మారుతూ ఉంటుంది. క్షణక్షణం అందులో కలిగే మార్పులు కొన్ని సంవత్సరాలకు ఊహించలేనంతగా ఎదిగి సొంతం మౌలిక భావనకే భిన్నంగా ప్రాథమిక ప్రాతిపదికకే విరుద్ధంగా రూపొందవచ్చు. ఇందుకు కల అవకాశాన్ని గురించి కూలం కషంగా చర్చ జరపడం శాస్త్రీయ విధానాల్లో ఉత్తమమైనదిగా భావించాలి. అంతేకాని కొన్ని సంవత్సరాలకు పూర్వం రూపొందించుకొన్న సిద్ధాంతీకరణలు తప్పు అని భావించడం లేదా ఆ అర్థం వచ్చేలా ధ్వనించడం వివేకవంతమైన చర్యకాబోదు. అంటే విజ్ఞాన తృష్ణలో ఉండవలసింది యథార్థానికి ప్రాసస్త్యీకరణముకాని పిడివాదానికిపట్టాభిషేకముకాదు. ఉన్న అన్ని పరధులను అతి నిశితంగా పరిశీలించిన పిమ్మట ఎన్నో ప్రమాణాత్మకమైన అంశాలను క్రోడీకరించిన తరువాత ఏ విధమైన లోపాలకూ అవకాశం లేకుండా ఎటువంటి బలహీనతలకూ చోటివ్వకుండా అందరికీ ఆమోదయోగ్యమైన ఆచరణా సమ్మతమైన అతి నిర్దుష్టమైన శ్రేష్ఠమనదగిన సిద్ధాంతాన్ని లేదా సూత్రాన్ని ఏర్పరచుకోవడం శాస్త్రీయమనే పిలవబడుతుంది. అయితే ఈ సిద్ధాంతం అన్నింటికీ వర్తించాలనీ వర్తించినప్పుడే అది హేతుబద్ధమైన సిద్ధాంతమనీ విశ్వజనీన సర్వకాలీన భావాన్ని ప్రతిక్షేపించుకోవడం పూర్తిగా అశాస్త్రీయం. అంతేకాదు ఒక సిద్ధాంతం సర్వకాల సర్వావస్థలయందూ ఒకే విధంగా ప్రతిపాదించబడాలని ఊహించడంకూడ పూర్తిగా అనుచితం. ఒక సిద్ధాంతానికి విజయావకాశాలు నూటికి నూరు శాతము ఉంటాయి, ఉండాలి అని అనడం లేదా అనుకోవడం మూర్ఖత్వమనిపించుకొంటుంది. ఎందుకా సిద్ధాంతం ఆ నియమిత వ్యవధిలో పరిమిత ధోరణిలో నిలువలేకపోయింది. అనే విషయాన్ని ఆలోచించి దానికి కారణాలను వివరించి ఆ వివరణలకు తగిన విధంగా ఎన్నో సవరణలను ఆ సిద్ధాంతంలో జొప్పించి తదనుగుణంగా వెలువడిన ఆ నూతన సిద్ధాంతరీత్యా తగిన విశదీకరణను సాధించుకోవడం తప్పనిసరిగా శాస్త్రలక్షణమే ఔతుంది కాని మరొకటి కాదు. అయితే ఈ సవరణలు అనేవి సాధ్యమైనంత తక్కువగా ఉపయోగించబడే విధంగా సిద్ధాంతం అనేది రూపొందించబడి ఉండాలి.

డార్విన్ వెలువరించిన ప్రకృతి వరణ సిద్ధాంతముంది. ప్రకృతి అనేది కీలకమైన పాత్రధారి అని దాని సారాంశము. ప్రకృతికి నిర్దేశించే శక్తి ఉంది అని సూత్రీకరించినట్లుగా భావించడానికి తగిన అవకాశం ఆ సిద్ధాంతంలో ఉంది. అంటే ప్రకృతి శక్తివంతమైనదని శాస్త్రం చెబుతోందన్నమాట. అయితే దానికాశక్తి ఎలా వచ్చింది?– అంటే జవాబు దొరకదు. వానరుడు నరుడిగా ఆవిర్భవించాడని చెప్పినట్లు వానరుడు ఎందుండి ఉద్భవించాడన్న ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పలేదు. ఈశ్వరుని నుంచి వానరుడొచ్చాడా? శక్తి కలిగిన ప్రకృతిని ఈశ్వరునిగా మార్చుకొంటే వచ్చేనష్టమేమిటి? ఈ మార్పువల్ల డార్విన్ సిద్ధాంతము ఈశ్వరవాదాన్ని బలపరచినట్లౌతుంది. అప్పుడదెలా శాస్త్రీయమనిపించుకొంటుంది? అందుకని ఈశ్వరవాదాన్ని రద్దుచేసుకొంటే ప్రకృతికి స్వయం సిద్ధంగా అలవడిన శక్తికి తగిన కారణాలు చూపడం కష్టసాధ్యమౌతుంది. స్పష్టమైన ఆధారాలు లేకుండా సిద్ధాంతీకరించడం అశాస్త్రీయ మౌతుంది. మరి దీనికి దారేది? ఎలా ఎదుర్కోవాలి? తత్పర్యవసానమే ఎన్నో సవరణలు. మరెన్నో వివరణలు. ఆ భావ పరిణామమే నియోడార్వినిజమ్! ఇలా సిద్ధాంతంపైన సిద్ధాంతం. ఎన్నో మార్పులలో పుట్టుకొంటూ రావడం శాస్త్రీయత అనిపించుకొంటుందే కాని అశాస్త్రీయత అనిపించుకోదు. దీన్ని గుర్తించడం మళ్ళీ శాస్త్రీయతే! గుర్తించికూడ కాదూ కూడదనడం నిస్సంశయంగా మూర్ఖతే!

పరిణామ సిద్ధాంతముంది. ఏకకణ జీవినుంచి మానవుడు పరిణితి చెందాడని ఒక పరి కల్పన. అలా కాదు మానవుని నుంచే ఏకకణజీవి దిగజారడం సంభవించిందని మరో రూప కల్పన. అయితే మొదటి భావనకే ఎక్కువ వోట్లు లభించడం కేవలం శాస్త్రీయ దృక్పథంవల్లే సాధ్యమైంది. అయినా ఇందులోకూడ మళ్ళీ ఎన్నో సందేహాలు ఉన్నాయి. క్రమానుగతంగా జరిగే చర్యగా పరిణామాన్ని వర్ణించి ఉండడంవల్ల ఏకకణ జీవులనుంచి మానవుడెదిగే స్థాయినాటికి ఏకకణజీవులు పూర్తిగా నశించిపోయి వుండాలి. అయితే ఈ ఏకకణజీవులు మరణాన్ని జయించడం వల్ల (?) ఏనాటికీ నశించిపోయే అవకాశంలేదు. పోనీ ఏకకణజీవుల సంగతి అలా ఉంచినా మిగతా జీవుల్లో సైతం ఏవీ ఏకాస్తాకూడా తరిగిపోవడం లేదు. ఏవో అరాకొరీగా కొన్ని జంతువులనుగురించి బాధపడుతున్నా పరిణామ ప్రక్రియను దృష్టిలో పెట్టుకొని చూస్తే అదేమంత చెప్పుకోదగిన మార్పుగా భావించవలసిన అవసరం ఉండదు. వానరుని నుంచి నరుడు పుట్టాక ఇక వానరుని అవసర మేమిటి? ముందు వానరాలే ఉండి ఉండాలి. ఆ తరువాత వానరాల నుంచి నరులు క్రమ క్రమంగా పుట్టుకొచ్చి ఉండాలి. కొంత కాలానికి నరులే ఉండాలి. వానరులు ఈ నాటికీ ఉండడాన్నిబట్టి చూస్తే మానవ పరిణామం ఇంకా అసంపూర్ణంగానే ఉంది అని అనిపిస్తుంది. ఎన్నో ఏళ్ళక్రిందటే వెలువడ్డ మనిషి నుంచి రూపొందే పరిణామంలో ఇప్పటి మనిషి ఎంతో ఎత్తుకు ఎదిగి ఉండాలి. కాని ఆ విధంగా జరగడం లేదు. జరిగినట్లు ఎక్కడా దాఖలాలులేవు. ఇటువంటి పరిస్థితులలో వానరుని నుంచి నరుడొచ్చాడనడానికి ఏ మాత్రం మనసొప్పుతుంది? ఆ విధంగా ఒప్పడం ఎంతవరకు శాస్త్రీయమనిపించుకొంటుంది? అలా అని పరిణామ వాదాన్ని త్రోసివేయడమా? అలా కాదనడం ఎంతవరకు శాస్త్రీయ మనిపించుకొంటుంది?

కొన్ని సిద్ధాంతాలను పరీక్షలద్వారా ప్రయోగాలద్వారా నిరూపించడానికి తగిన అవకాశాలుంటాయి. కొన్నింటికి ఆ అవకాశాలు ఉండవు. ఆ అవకాశాలు లేనివాటిని కొందరు సిద్ధాంతాలుగా పరిగణించరు. అది సబబుకాదు. నిర్ధారీకరించడానికి తగిన అవకాశం లేనంత మాత్రాన సిద్ధాంతాన్ని తీసి పారేయకూడదు. ఈ విషయ విశదీకరణలోనే మెటాఫిజికల్ సిద్ధాంతాలు బయలుదేరాయని కారల్ పాపర్ భావించడం సమంజసంగానే ఉంది. ఎప్పుడైతే సిద్ధాంతానికీ యదార్థానికీ సామీప్యం కొరవడుతుందో అప్పుడు ఆ రెండింటిని అనుసంధిస్తూ వాస్తవదృక్పథాన్ని బోధపరచే మరో భావన అవసరమౌతుంది. అంటే "సైంటిఫిక్ ఎప్రోచ్"కు అప్పుడప్పుడు "ఫిలసాఫిక్ టెన్షన్"కూడ ఉండాలని అర్థము. అంతే కాదు తప్పు అని నిరూపించటానికి అవకాశంలేని పక్షంలో విరుద్ధం కాదని నిరూపించటానికి అవకాశముండాలి. ప్రతి సిద్ధాంతం స్పర్శగా తాకిడిగా వాస్తవాన్ని చూపెడుతూ సాధ్యమైనంత వరకు నిష్పక్షపాతంగా రమారమి అన్నిటికీ వర్తించేట్టు ఉండాలి. అప్పుడే శాస్త్రీయత అనిపించుకొంటుంది.

రక్తం ఎర్రగా ఉంటుందనేది జగమెరిగిన సత్యం. కళ్ళకు కట్టినట్లు చూపించవచ్చు. అయితే ఎంత ఎర్రగా ఉంటుంది అనే దానికి సాపేక్ష దృష్టి అవసరమౌతుంది. అంటే ఓ పది పన్నెండు శాంపిల్స్‌ను కళ్లారా చూస్తేకాని ఎర్రదనపు సాంద్రత అంటే ఏమిటో అది ఎలా ఉంటుందో తెలిసిరాదు. "రిలేటివిటీ" దేనికైనా ముఖ్యమనిపిస్తుంది. అయితే "ఈ రిలేటివిటీ" యొక్క పరిమాణం పెరిగేకొద్దీ సిద్ధాంతం యొక్క ధాటి తగ్గుతుందేమో అన్న భ్రాంతి కలుగుతుంది. సిద్ధాంతమనేది యదార్థాన్ని విడమరచేందుకే కాని కేవలం ప్రముఖస్థానాన్ని ఆక్రమించేందుకు కాదుకదా! గుర్తింపు అనేది వ్యక్తిత్వ పరధులకు అన్వయించకూడదు. అంతే కాదు. ఏదేశ పరిస్థితులకూ వర్తింప జేయకూడదు. విశ్వకల్యాణాన్ని అపేక్షిస్తూ మానవాభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ పురుడుపోసుకొనే ప్రగతిశీల కాలక్రమంలో జన్మించేదే సిద్ధాంతం. కాలక్రమేణా శైశవపు ఛాయలనుంచి కౌమార యవ్వన దశలను దాటుకొని అపరిమితమైన అనుభవ ప్రకర్షతో మూర్తీభవించిన విచక్షణా ప్రౌఢిమతో ఆ సిద్ధాంతం ఏది కాలాలపాటు భాగ్యోదయకాంతులను వెదజల్లగలుగుతుంది. సిద్ధాంతానికి వార్థక్యదశకూడ రావచ్చు! మరణించనూ వచ్చు!! లేదా చిరంజీవి కావచ్చు!!! ఒక సిద్ధాంతం గతించినందుకు బాధ పడడం కాని దాని స్థానంలోనే మరో క్రొత్త సిద్ధాంతం వచ్చిందని భయపడడం కాని అలాకాదని రెండింటినీ వ్యతిరేకించడం కాని అలా అని ఆరెండింటినీ అదే పనిగా పొగడడం కాని శాస్త్రీయత అన్న పదానికి అర్థం తెలిసిన వాళ్ళెవరూ చేయకూడని పని. అంతేకాదు మృత సిద్ధాంతంలోని సారాన్ని గ్రహించి వర్తమాన సిద్ధాంతానికి అన్వయింపజేసి ఏమాత్రం దోషాలు ఉండని సరిక్రొత్త ప్రత్యామ్నాయ వాదానికి పూనుకోవడం సుశాస్త్రీయలక్షణం! ఈ ప్రభావం వల్లనే ఎన్నో నవీన సిద్ధాంతాలు రూపాన్ని తెచ్చుకోగలుగుతున్నాయి. అంటే "థీరిటికల్ ఎక్స్‌ప్రెషన్"కు "ఇంటర్ ప్రెటేషన్" ప్రాణమన్నమాట. ఈ ఇంటర్‌ప్రెటేషన్‌కు తార్కికశక్తి ఉండాలి. ఈ అధికారాన్ని సవాలు చేయడం అనేది ఎప్పుడైతే మొదలవుతుందో అప్పుడే శాస్త్రీయచర్చ ప్రారంభమవుతుంది. అయితే ఇది కేవలం పేచీకోసం కాకుండా నిర్మాణాత్మకంగా ఉంచే శాస్త్రపురోగతికి దోహదకారి ఔతుంది. అంటే శాస్త్రీయ విశ్లేషణ అనేది "కీన్ అబ్జర్వేషన్"లో

"బ్రిలియంట్ ఎలూసిడేషన్"లో "ఎఫెక్టివ్ కోడిఫికేషన్"లో నిక్షిప్తమై ఉంటుందని ఒక్కమాటగా అర్థం చెప్పుకోవచ్చు.

రక్తం ఎర్రగా ఉంటుందా అన్న ప్రశ్నకు సమాధానం అవును అని చెప్పవచ్చు. ఎంత ఎర్రగా ఉంటుందనే ప్రశ్నకు కొద్దిగా తటపటాయించవలసి వస్తుంది. అన్నింటిలోనూ ఎర్రగా ఉంటుందా అనే ప్రశ్నకు మరిన్ని చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది. ఎలుకలో రక్తం ఎర్రగా ఉన్నట్లు బొద్దింకలో ఉండదే? బొద్దింకలో రక్తం తెల్లగా ఉన్నట్లు పీతలో ఉండదే? పీతలో రక్తం నీలంగా ఉన్నట్లు వానపాములో ఉండదే?- ఈ ప్రశ్నలు బాగా ఆలోచింపజేసేవి. వీటికి సమాధాన మివ్వడంలో కొన్ని సిద్ధాంతాలను ఏర్పరచుకోవాల్సి ఉంటుంది. వెన్నెముక కలవాటిలో ఎర్రగా ఉంటుందని వెన్నెముక లేని వాటిలో ఎర్రగా ఉండదని అన్నామనుకోండి. వెన్నెముకకు ఎర్రదనానికి సంబంధముందా అనే ప్రశ్నవస్తుంది. అంతేకాక వానపాములో వెన్నెముక లేదు కదా! అయినా రక్తమెందుకు ఎర్రగా ఉంటుంది అనే మరో ప్రశ్న వస్తుంది. ఇలాకాదని ఎర్రదనం కలిగించే ఒక వర్ణకం ఉంటుందని అది ఉన్నవాటిలో రక్తం ఎర్రగా ఉంటుందని అన్నామనుకోండి. ఆ వర్ణకం ఎక్కణ్ణుంచి వస్తుంది? అది ఎర్రదనాన్నే ఎందుకు కలుగ జేస్తుంది? అనేవి తరువాత వచ్చే ప్రశ్నలు. ఒక్కొక్క రంగుకు ఒక్కొక్క వర్ణకముంటుందని ఏ వర్ణకమూ లేకపోతే ఏ రంగూ ఉండదని అన్నామనుకోండి. వర్ణకానికి జంతు లక్షణానికి సంబంధముందా? ఉంటే జంతువులోని ఏ లక్షణం ఎక్కువగా ప్రభావాన్ని చూపెడుతుంది? అనేవి మళ్ళీ తటస్థపడే ప్రశ్నలు. ఎర్రటి వర్ణకం పరిణామ ప్రక్రియలో పురోగమనానికి సంకేతమని అన్నారనుకోండి. వానపాములకంటే మంచినీటి పీతలలో రక్తం ఎర్రగా ఉండాలి. వానపాములలో ఆ ఎరుపుదనపు సాంద్రత కొద్దిగా తగ్గి ఉండాలి. కాని వాస్తవానికి అలాలేవు. ఎందుకు అని అనిపించడం శాస్త్రీయమే! కాదంటారా?

రక్తం రంగుకు, వర్ణకోత్పత్తికి పరిణామవాదానికి జంతు ప్రవర్తనకు ఏదైనా అవినాభావ సంబంధ ముందా? ఉంటే ఎలా ఉంటుంది? ఒకవేళ లేకపోతే పై ప్రశ్నలకెలా సమాధానాలు చెప్పుకోవాలి? ఏవిధంగా తృప్తికరమైన జవాబులను రాబట్టుకోవాలి? - ఇలా ఒకదాని తరువాత ఒకటి చొప్పున ఎన్నో సందేహాలు బయలుదేరుతాయి. వీటికి గిరిగీసినట్లు ఖరాఖరిగా 'ఇదీ! సమాధానం!' అని చెప్పడం కష్టం. అలాగే దీనికి 'సమాధానం లేదు!' అని అనడం కూడ చాలనష్టం. పరీక్షించేందుకు ప్రయోగాలు జరిపేందుకు విస్తృతమైన అవకాశాలు ఉన్నా మెట్టుమెట్టులో అంతకు మించిన అనుమానాస్పద వాదనలకు కూడ బలీయమైన అవకాశాలు ఉండడంవల్ల 'ఇది అదీ' అని 'అది ఇదీ' అని నికరంగా తేల్చి చెప్పగలిగే స్థితిలో మనముండము. ఈ స్థితిని మనస్ఫూర్తిగా ఒప్పుకోవడం శాస్త్రీయత అనే అనిపించు కొంటుంది కాని చేతకాని తనమనిపించుకోదు. దీన్ని గుర్తించవలసిన అవసరం ప్రతి శాస్త్రవేత్తకూ ఉంది.

చలిస్తూ ఉన్న ఒక వస్తువు తనపై ప్రయోగించబడిన బలం మీద ఆధారపడి ఉంటుంది. ఎప్పుడైతే ఆబలం శూన్యమవుతుందో ఆ వస్తువు చలించడం నిలిపివేస్తుంది. ఇది అరిస్టాటిల్ సిద్ధాంతము. దీన్నెవరైనా క్షణాల్లోపల నిర్ధారీకరించవచ్చు. అయితే గెలీలియో సిద్ధాంతం అలాకాదు. దాన్ని ఋజువు చేయడం కొంచెం కష్టంతో కూడుకొన్నపని. అలాగే ఎపిక్యూరస్ అన్నట్లు సూర్యచంద్రులు ఒకే పరిమాణంలో ఉన్నారనే వాస్తవాన్ని (?) అంగీకరించడంకూడ కష్టసాధ్యమౌతుంది. ఇటీవల కొందరు ఖగోళ శాస్త్ర వేత్తలు సూర్యుని పరిమాణం పెరుగుతుందని దాదాపు 500 కోట్ల సంవత్సరాల తరువాత చెప్పుకోదగినంతగా ఈ గోళం ఉబ్బుతుందని తత్ఫలితంగా దాని ఆకర్షకశక్తి యొక్క ప్రభావం ఎక్కువౌతుందని ఈ విధంగా ఎప్పుడైతే ఆకర్షకశక్తి ఎక్కువౌతుందో దాని మూలంగా తన చుట్టు ప్రక్కల ఉన్న చిన్న చిన్న గోళాలన్నింటినీ ఈ ఎర్రగోళం కబళించడం మొదలెడుతుందని ఈ కబళింపు చర్యలో ఒక భాగంగా భూమికూడ సూర్యగోళం చేత మ్రింగబడుతుందని తెలియజేసారు. చివరగా న్యూట్రాన్ తారల రూపంలో ఇనుపఖండాలు అలా ఒకచో ఉంటాయని వారి వాదం. ఈ ప్లాస్మాఫిజిసిస్ట్‌ల అభిప్రాయం అర్థంలేనిది అని అనడం మంచిది కాదు. అలాగే ఆ అభిప్రాయానికి దాసోహమనడం కూడ మంచిది కాదు. 500 కోట్ల సంవత్సరాల తరువాత జరగబోయే (?) ఈ చర్యను ఇప్పుడే ఊహించి చెప్పడం ఏ మాత్రం సందేహం లేకుండా అశాస్త్రీయమైన చర్య. ఎవరైనా ఈవిషయంలో ఏకీభవించనట్లైతే వారికే మాత్రం శాస్త్రీయ దృక్పథం లేదనే చెప్పుకోవచ్చు. శాస్త్రీయతకు కూడ భావస్వాతంత్ర్యముండాలి కదా! క్షణ క్షణం మారుతున్న రోదసీ గ్రహాల ఆకర్షకశక్తిని గురించి వాటి భ్రమణ శీలతను గురించి ఏమాత్రం ఆలోచించకుండా ఒక నిర్ణయానికి రావడం వివేకవంతమైన చర్యకాదు. అది గర్హనీయము. అంతేకాదు. ఈ ప్రతిపాదన తప్పు అని నిరూపించేందుకు కూడ వీలులేదు. ఎందుకు వీలులేదు అంటే ప్రయోగాత్మకమైన పరీక్షలు చేసేందుకు కాని ప్రమాణాత్మకమైన పరిశోధనలు జరిపేందుకు కాని అవకాశం లేక పోవడమే దానికి కారణమని ఒప్పుకోవాలి. అందులో తప్పులేదు. "ఎపిస్టెమాలజీ" (ప్రమాణ విజ్ఞానం) అనేది

గణితాత్మకంగా ఎంత నిర్దుష్టంగా ఎదిగి ఉన్నా దాని కాలానికి మాత్రం తప్పకుండా లోబడి ఉంటుంది. కాలాతీతమైన భావన శాస్త్రీయ సుక్షేత్రంలో మొలకెత్త కూడదు. కాలంయొక్క ప్రభావం ఏ గణాంక సిద్ధాంతాలకూ అందనిదని ప్రతిఒకరు గ్రహించగలగాలి. అలాతెలుసుకోక "పొటన్షియల్ ఫిలాసఫీ" పేరుతో గణితశాస్త్రంలో సామర్థ్యాన్ని ప్రదర్శిస్తే శాస్త్రీయత దెబ్బతింటుంది. శాస్త్రం మూల బడుతుంది. దీన్ని గ్రహించడం శాస్త్రాధ్యయనంలో చాలా ముఖ్యం.

శాస్త్రమే సరిగా అర్థం కాకుండా ఉంచే శాస్త్రీయత అన్న పదానికే సరిగా అర్థం తెలియకుండా ఉంచే భౌతికశాస్త్రం శ్రేష్ఠ మని, రసాయన శాస్త్రం ఉత్కృష్టమని, ఖగోళశాస్త్రం అమోఘ మని, భూగోళ శాస్త్రం అద్భుతమని, ఒకటి తక్కువని ఒకటి ఎక్కువని అనుకోవడం మన "పరిపక్వం లోపాని"కి గుర్తుగా నిలుస్తుంది. శాస్త్రమనేది ఒకటే. అందులోని వివిధాంశాలు ఈ విభాగాలు. ఒకే వృక్షానికున్న విభిన్న తలాలుగా ఈ విభాగాలను గుర్తించడం అవసరం. గణితం అనేది ఆధారం లాంటిది. ఈ గణితానికి స్వయం ప్రతిపత్తి లేదని కొందరు, గణితమే ఏకైక శాస్త్రమని కొందరు వాదించుకోవడం చాల అవివేకం. దేని విలువ దానికుండనే ఉంటుంది. ఇదిలా ఉండగానే "జువాలజీ"ని చీల్చి "పాథో-బయాలజీ" నాదని "మాలెక్యులార్ ఫిజియాలజీ" నీదని "ఎన్విరాన్‌మెంటల్ బయాలజీ" వీడిదని "రీప్రొడక్టివ్ ఫిజియాలజీ" వాడిదని దెబ్బలాడుకోవడం చూస్తుంటే వీళ్ళకేమాత్రం శాస్త్రీయ లక్షణం లేదనిపిస్తుంది. వృత్తిరీత్యా వాళ్ళు ప్రొఫెసర్లైనా ప్రవృత్తిరీత్యా కాదనిపిస్తుంది. సరే! ఈ వివాదాలలా ప్రక్కకు పెట్టండి. శాస్త్రగతిలో ఇటీవల చాల మార్పులొచ్చాయి. ముఖ్యంగా భౌతిక శాస్త్రంలోని ఊహింప శక్యంకాని మలుపులు ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నాయి. ఈ మార్పులను బాగా అర్థం చేసుకుంటే శాస్త్రమంటే ఏమిటి? నిజానికదేమి చేస్తున్నది? మనకేమి చెప్తున్నది? అనే ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. అయితే ఆ దొరికిన వాటిని విశ్లేషిస్తే దొరకనివి చాల ఉన్నాయని స్పష్టంగా బోధపడుతుంది. అదే విచిత్రం!

ఎన్నో సమస్యలను ఒక కొలిక్కి తెచ్చిన "క్వాంటమ్ మెకానిక్స్" ఒకానొక దశలో "అసంపూర్ణ సిద్ధాంతం" అనిపించు కొంది. ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతం రావడంతో మళ్ళీ ఊపిరి పోసుకొంది. అయితే ఏ ఒక్క సిద్ధాంతమూ ఇండివిజువాలిటీని ప్రదర్శించలేక పోతోంది. అలా అని వాటికి "ఒరిజినాలిటీ" లేదని చెప్పడం భావ్యం అనిపించ కోదు. కొన్నింటికి ప్రత్యక్ష ప్రమాణా లుంటాయి. మరి కొన్నింటికి పరోక్ష ప్రమాణాలుంటాయి. ఇంకొన్నింటికి అనుమాన ప్రమాణాలు ఉంటాయి. శాస్త్రం ప్రత్యక్ష ప్రమాణానికే ప్రథమస్థానాన్ని ఇచ్చినా పరోక్ష ప్రమాణానికి అనుమాన ప్రమాణానికి కూడ తగినంత విలువనిస్తుంది. ఇచ్చి తీరాలి. కొన్ని సిద్ధాంతాలు కేవలం అనుమాన ప్రమాణాలపైనే ఆధారపడి ఉంటాయి. ఈ ఆధారాన్ని అలంబనగా తీసుకొని ఆ సిద్ధాంతంపైన నమ్మకాన్ని కనబరచడం సమ్మత మనిపించుకోదు. అలా అని ఆ సిద్ధాంతాన్ని గణించక పోవడం కూడ అసమంజస మనే అనిపించు కొంటుంది.

సంపూర్ణ సూర్యగ్రహణముంది. ఆ గ్రహణ ప్రభావం జీవరాశులమీద ఉంటుంది. ఉండదు. ఇక్కడ సందేహాస్పదమైన ప్రశ్న ఉదయిస్తోంది. ఒకవేళ ప్రయోగాలు జరిపామనుకోండి. ఆ ప్రయోగాలు మళ్ళీ ప్రయోజనాత్మకంగా ఋజువు చేయబడాలంటే మళ్ళీ మరో మారు సూర్యగ్రహణం రావాలి. అది మళ్ళీ ఎప్పు డొస్తుందో? వచ్చినా ముందు వచ్చినప్పుడున్న విధంగానే ఉంటుందో ఉండదో? ఎంతో కాలం గడచిపోతుంది కదా! మరి ఈ కాల ప్రభావం ఎలా ఉంటుందో? రోదసీలో ఏ విధమైన మార్పులొస్తాయో? జీవరాశులెలా ఉంటాయో? శీతోష్ణ పరిస్థితులు భౌగోళిక స్థితిగతులు ఎలా ఉంటాయో?— ఎవరూ ఊహించి చెప్పలేరు. చెప్పినా నమ్మడం పూర్తిగా శాస్త్రవిరుద్ధం. ఋజువు చేయడానికి వీలుకాని ఈ ప్రయోగాల ఫలితాలను నమ్మడమెలా? అలా అని స్పష్టంగా కనబడుతున్న మార్పులను నమ్మకుండా పోవడమెలా? కాబట్టి ఇటువంటి పరిస్థితులలో ప్రత్యక్ష ప్రమాణాలు నిమిత్తమాత్రాలౌతాయి. అందువల్ల పరోక్ష ప్రమాణాలమీద అనుమాన ప్రమాణాలమీద ఆధారపడవలసి వస్తుంది. అలా ఆధార పడడం నూటికి నూరుపాళ్ళు శాస్త్రీయమే ఔతుందా? సమాధానం ఎవరు చెప్పగలరు? అలా అని అశాస్త్రీయ మనిపించుకొంటుందా? ఎవరు కాదనగలరు?

ఒక శతాబ్దం క్రిందట మానవుడు చంద్రుడిని చేరడమనేది అసాధ్యమని భావిస్తూవచ్చాము. అలాగే ఇప్పుడు సూర్యుణ్ణి చేరు కోవడం కూడ అంత సులభసాధ్యమైన విషయం కాదనే అను కొంటున్నాము. ఇది అశాస్త్రీయ మెలా అవుతుంది? శాస్త్రంమీద నమ్మకం లేకపోవడం ఎలా అవుతుంది? శాస్త్రీయత అనేదానికి కొన్ని హద్దులు ఉంటాయి. నియమాలు ఉంటాయి. మినహా యింపులూ ఉంటాయి. మరి వాటికిలోబడి ముందూ వెనకా చూచి సరితూచి చర్య తీసుకోవాలి కదా! వంద సంవత్సరాల తరువాత ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? "ప్రెడిషన్" (జరగబోయే

దానిని గురించి చెప్పడం) అని అంటున్నప్పుడు అది నిజమౌ తుందని అనుకోవడం నా అభిప్రాయంలో దుర్భ్రమ అనిపించు కొంటుంది. ఇటీవల కొన్ని సందర్భాలలో వాతావరణ పరిశోధకుల "ప్రెడిక్షన్"లు దారుణంగా దెబ్బతిన్నాయి. ఇది శాస్త్రలోపంకాదు. శాస్త్రజ్ఞుల లోపం. ఊహించడానికి గణితాత్మకమైన సందేశం కన్నా గుణాత్మకమైన సంయమనం చాల ముఖ్యం. దాన్ని శాస్త్రీయత అనాలి కాని "స్టాటిస్టికల్ పాయింట్ ఆఫ్ వ్యూ"లో (గణాంక శాస్త్రదృష్టితో) మాట్లాడడాన్ని కాదు.

సూర్యుని చేరడం సులభసాధ్యం కాదని అంటున్నామే కాని అసాధ్యమని అనడం లేదు. ఇప్పటి శాస్త్ర పురోగతిని అంచనావేసి సాంకేతిక నైపుణ్యాన్ని ఖరాఖండిగా కొలచి ఆమాటను అనగలుగుతున్నాము. కాంతి కిరణాలను గురించి ఏమీతెలియని రోజులనుంచి ఎక్స్‌కిరణాలు, ఆల్ఫాకిరణాలు, బీటాకిరణాలు, గామాకిరణాలుదాటు కొని ఈవేళ "లేసర్" కిరణాలకు వచ్చాము. శంకరుడి ఫాలనేత్రం లాంటివీ లేసర్‌కిరణ పుంజమని అతిశయోక్తిగా కూడ అనుకొన్నాము. రేపొద్దున ఈ లేసర్ కిరణాల తాకిడిని తట్టుకోగల పరిస్థితిని మానవుడు తనకున్న శాస్త్రీయ పరిజ్ఞానం ద్వారా కల్పించుకోవచ్చు! ఇక్కడ మళ్ళీ అనుమానం. కృతార్థులు కావటానికి వీలు ఉన్నట్లే విఫలులు కావటానికికూడా వీలు ఉంటుంది. అంటే "ప్రాబబిలిటీ" రెండింటికీ 1% నుంచి 100% వరకు ఉండవచ్చు. దీన్ని ఒప్పేసుకోవాలి. తప్పదు. అప్పుడే మనమార్గం ఖచ్చితంగా శాస్త్రీయ మార్గమనిపించు కొంటుంది.

జీవరహస్యాన్ని ఛేదించాలని ఎన్నో ప్రయోగాలను జరుపుకొంటూ వచ్చాము. కణమన్నాము. కేంద్రకమన్నాము. మళ్ళీ క్రోమోజోమన్నాము. కాదు జీనన్నాము. చివరగా డి. యన్. ఏ. అన్నాము. కాని ఈ విషయంలో కూడ ఎన్నో వివాదాలు తలెత్తాయి. డి. యన్. ఏ. నిర్మాణం పట్ల సందేహాస్పదమైన అనేక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ అణునిర్మాణం ఇంతవరకు సరియైన అవగాహనకు రాలేదు. "డబుల్ హెలిక్స్" సిద్ధాంతము సంతృప్తికరంగా ఉన్నా నోబెల్ బహుమతిని గెలుచుకొన్నా ఈనాడు ఎదురవుతున్న ఎన్నో క్లిష్టమైన అంశాలను సులభసాధ్యంగా సుగ్రాహ్యంగా వివరించగల పరిస్థితిలో మాత్రం ఆ సిద్ధాంతం లేదనే పచ్చి నిజాన్ని అందరూ ఒప్పుకోవాలి. ఒప్పుకొని తీరాలి. ఈ సిద్ధాంతాన్ని ఇప్పుడు కాదని కూడ అంటున్నారు. అంతమాత్రాన ఈ సిద్ధాంతం సరియైందికాదని అర్థంకాదు. అలాఅని దోషరహితమైనదని కూడ తీర్పు ఇవ్వకూడదు. వివరణాత్మకంగా ఈ సిద్ధాంతం ఇంకా చాల ఎక్కువ స్థాయికి ఎదగవలసిన అవసరముందని నా అభిప్రాయం. ఈ ఎదగడంలో మార్పులనేవి ఎన్నో సహజంగానే వస్తాయి. వాటిని హృదయపూర్వకంగా ఆహ్వానించడం, సమయస్ఫూరకంగా అన్వయింప జేసుకోవడం శాస్త్రం మీద ఆధారపడి ఉండదు. శాస్త్రజ్ఞుని విజ్ఞతమీద ఆధారపడి ఉంటుంది. ఈ విజ్ఞత అనే పదానికి శాస్త్రీయత అనే పదానికి ఏకోదర సంబంధాన్ని ఊహించడంలో అసందర్భమేమీలేదు. చెప్పేదేమిటంటే మార్పులనేవి వస్తూనే ఉంటాయని వాటిలో అత్యంత తృప్తికరమైన మంచి మార్పును గ్రహించడం నిగ్రహించుకోవడం శాస్త్రీయజ్ఞతపై ఆధారపడి ఉంటుందని మాత్రమే!

ఇంకో ముఖ్యమైన విషయాన్ని చాలమంది మరచిపోతున్నారు. శాస్త్రీయత అంటే కేవలం గణితాత్మకమైన సాంకేతిక సిద్ధాంత వివరణగా భావిస్తున్నారు! ఉదాహరణకు చెట్టు అనేది ఉంది. దానికో కాయ ఉంది. అది రాలితే భూమి మీదనే పడుతుంది. కాని ఆకాశంపైన పడదు. భూమికి ఆకర్షణ ఉంది కాబట్టి అది క్రిందివైపుకే పడుతోంది! భూమ్యాకర్షణ సిద్ధాంతం న్యూటన్ పుణ్యమా అని చోటు చేసుకొంది. చెట్టు భూమిని ఆశ్రయించుకొని ఉంది. అటువంటప్పుడు దాని కాయ భూమిని ఆశ్రయించక ఆకాశాన్ని ఆశ్రయిస్తుందా? ఇది మామూలు తర్కం. కనీసపు లోకజ్ఞానం ఉండేవాలు. ఈ భూమ్యాకర్షణ సిద్ధాంతమనేది ఎంత సిల్లీగా (?) ఉంటుందో అర్థమౌతుంది. సిల్లీ అని ఎందుకంటున్నానంటే భూమికి ఆకర్షణ అనేది న్యూటన్‌కు ముందు లేనేలేదని భావించే మహానుభావులు కూడ రీసెర్చి చేస్తున్నారీ భారతదేశంలో! అందువల్ల న్యూటన్ చేసిన దంతా తన సిద్ధాంతానికొక గణితాత్మకమైన భావన ఇచ్చుకొన్నాడు. అందువల్ల దాన్ని "సైన్స్" అంటున్నారు కాని అంతకు ముందున్న "లాజికల్ సైన్స్"ను మాత్రం "సైన్స్" అనడం లేదు. ఇదెంత అన్యాయమో ఆలోచించండి. "సైంటిఫిక్ ఇంట్యూషన్" అనేది నిజంగానే ఉండి ఉంటే ఈ విశదీకరణ అవసరమయ్యేదికాదు. కాదంటారా? ఇలాగే ప్రతి చర్యకూ ప్రతిచర్య అనేది ఉంటుంది అనే విషయం అందరికీ తెలిసిందే. అది మానవుడే దానికి ప్రారంభ గురువు కూడ! అయితే ఆ విషయాన్ని న్యూటన్ "స్టాటిస్టికల్"గా రూపొందించాడు. అందువల్ల దానికి సైంటిఫిక్ వాల్యూ (వైజ్ఞానికపు విలువ) ఇచ్చారు. "మ్యాథమ్యాటికల్"గా వివరించకుండా సగటుమనిషికి అర్థమయ్యేలా విడమరచి చెప్పడం "అన్‌సైంటిఫిక్ అప్టిట్యూడ్" అని అనిపించుకొంటుందా? దీన్ని ఆలోచించవలసిన అవసరం ఉంది. నిరక్షరకుక్షికి కూడ అర్థమయ్యేలా చెప్పేవిధానం శాస్త్రీయ విధానమని అనిపించుకొంటుందా? లేక విద్వాంసుడికి సైతం ఒక్కొకసారి అర్థంకానట్లు కనిపించే గణాంక విన్యాస

క్రమం శాస్త్రీయ విధానమనిపించుకొంటుందా ? అనేది యోచించుకోవలసిన అవసరం ఆసన్నమైనదని ఇప్పటికైనా గ్రహించగలగాలి.

ఈ శాస్త్రాలకందని మరో విశిష్టమైన శాస్త్రముంది. అదే మానవ శాస్త్రం ! ఈ హ్యూమన్ సైకాలజీ అనేది ఏ సిద్ధాంతాలకూ అందనిది. అపరిమితమైన పరధులు కలది. విస్పష్టంగా నిర్ధారించడానికి వీలులేనిది. ఇదమిత్థంగా తెలియ చెప్పడానికి సాధ్యం కానిది. అందువల్ల ఎవరెంత చెప్పినా అదో మెటాఫిజికల్ థీరమ్ మాత్రమే ! పరిపూర్ణం కాలేదు !! ఎంతగా వివరించి చెప్పినా అదో "ఇన్‌కంప్లీట్ ఫోరమ్" మాత్రమే! ఏ నాటికీ పూర్తికాదు!! అయితే కొన్ని విచిత్రమైన ఒకే విధమైన లక్షణాలను దేశ కాల పరిస్థితులకు అతీతంగా వేషభాషలకు అనూహ్యంగా ఈ మానవప్రవృత్తి ప్రదర్శిస్తూ ఉండడంవల్ల ఒక "కంట్రోలింగ్ అథారిటీ" (అదుపులో ఉంచేశక్తి) ఉన్నట్లుగా భావించవలసి వస్తుంది. ఈ భావన అనన్యసామాన్యమైన అత్యంత ప్రతిభావంతమైన అసాధారణమైన భావనని నా అభిమతం. ఒక చెకింగ్ మెషీన్ అనేది లేకుండా ఉంటే "నాచురల్‌గా హ్యూమన్ పొటెన్సీ"లో "ఇంబ్యాలెన్స్" తప్పకుండా తారసపడి ఉండేది. జీవరాశి-పరిసరాలు కలిసిన వ్యవస్థని చూస్తుంటే తప్పకుండా విచారణ జరిపేది ఏదో ఉందనే అనిపిస్తుంది. అయితే, ఈ పర్యవేక్షణ చేసే దానికి లక్ష్యం అనేది ఉందో లేదో 'అల్టిమేట్ గోల్'అనేది ఉందోలేదో 'స్పాన్' అనేది ఉంటుందో లేదో "షేప్" అనేది వస్తుందో రాదో అనే ఇలాంటి సమస్యాత్మకమైన విషయాలకు సంతృప్తికరమైన సమాధానాలు మనిషికి అందుబాటులో లేవు. ఎందుకని ఇలా అంటున్నానంటే తన శరీరం మీద తనికే అధికారంలేని స్థితిలో ఈ మనిషనే వాడున్నాడు ! అందువల్ల. ఎలా అంటారా ?

మనిషికి తన పుట్టుకను గురించి కాని చావును గురించికాని తెలుసా ? పరిపూర్ణమైన పరిజ్ఞానమందులో ఏ మాత్రమైనా ఉందా ? దీన్ని వేదాంత మంటారేమో ! సరే వదిలేస్తాను.

మనిషి రోజుకెన్నిసార్లు రెప్పలు మూస్తూ తెరుస్తుంటాడు ? ఎన్నిమాటలు మాట్లాడుతాడు ? ఎన్నిసార్లు చేతులు త్రిప్పుతాడు ? ఎన్ని అడుగులు నడుస్తాడు ? ఎన్నిసార్లు ఏడుస్తాడు ? ఎంతగా ఏడుస్తాడు? ఎన్నిసార్లు నవ్వుతాడు ? ఎంతగా నవ్వుతాడు ? నిద్రలోపోతాడు ? ఎప్పుడు మేలుకొంటాడు ? అప్పుడతనిస్థితి ఎలా ఉంటుంది ? దాని అతీగతీ అతనికి తెలుసా ? ఇలాంటివి ఎన్నో ! వీటికి జవాబులు చెప్పగలిగే స్థితిలో మనిషిలేడు. అయినా తాను సర్వ స్వతంత్రుడనని విర్రవీగుతున్నాడు ! ఇది శాస్త్రీయతకు చిహ్నమా ? మూర్ఖతకు కొలమానమా ? ఆలోచించుకోవలసిన అవసరం విచక్షణాజ్ఞానమున్న మనిషికి లేదా ? అతనికీ జంతువుకూ తేడా ఉండవలసిన అవసరం లేదా ? తన్నునడుపుతున్న ఒక శక్తిని "సూపర్ హ్యూమన్ పవర్" అని భావించడం దోషమవుతుందా? తనకందని మహత్తరమైన ఈ విచిత్ర ప్రవృత్తిని అతడు విధి అని కాలగతి ధర్మమని భావించడం అజ్ఞానమౌతుందా ? తన్ను నడుపుతున్నది "ఫిజికల్ డైనమిక్ ఫోర్స్" అని అతడు భావించవచ్చు. దాన్నే దేవుడు లేడు. (దేవుడు అనే పదం అభ్యంతరకరమైతే విధి అని ప్రతిక్షేపించుకోండి) అని వాదించేవారు ఎక్కువగా చెబుతుంటారు. "ఫిజికల్" అని "కెమికల్" అని "మెకానికల్" అని "ఎలక్ట్రికల్" అని మనం శక్తిని విభజిస్తున్నామే కాని నిజానికి అవంతా శక్తిలోని అంతర్ స్వరూపాలే కదా !

పొగలు క్రక్కుతున్న రంగులేని ఒక ద్రవ పదార్థముంది. ఈ ఉంది అనేది కళ్ళు చెబుతాయి. కాని అది పొగలు క్రక్కుతున్నది అతి వేడివల్లనా కాక అతి చల్లదనం వల్లనా అని నిర్ణయించడానికి కళ్ళకు శక్తిలేదు. దానికి చర్మం అవసరం. మరి ఆ ద్రవ పదార్థంలో ఏవైనా శబ్దాలు వస్తున్నాయేమో అని చూడవలసింది చర్మం కాదు చెవులు. అలాగే ఆ పదార్థానికున్న వాసనను నిర్ణయించేది చెవులుకాదు ముక్కు. అయితే రుచిని ముక్కు నిర్ణయించదు. నాలుక తెలుపుతుంది. ఈ ఐదు ఇంద్రియాలు కలసి గ్రహించిన భావాన్ని మనస్సు అనేది తన బుద్ధి సూక్ష్మతతో తెలుసుకొనగలుగుతుంది. అప్పుడు ఆ ద్రవ పదార్థం తాలూకూ వివరాలన్నీ కూలం కషంగా మెదడు గూటిలో భద్రపరచబడుతుంది. అయితే ఆ విధంగా కనిపించని ఈ అజ్ఞాతశక్తి వివరాలు భద్రపరచబడే అవకాశం పూర్తిగా లేదు. మనస్సు అనేది ఎంత కుశాగ్రబుద్ధి అయినా దానికి కూడ కొన్ని పరిమితులనేవి తప్పకుండా ఉంటాయి. అసలీ మనసు కింతటి జ్ఞానసంపద ఉండడానికి కేవలం మనిషి పనితనం కారణమంటారా ? కాక మనిషిని సృష్టించిన మరోశక్తి ప్రభావమంటారా ?

కనిపించని "ఆక్సిజన్"ను నమ్ముతున్నాము. కనిపించని విద్యుత్తును నమ్ముతున్నాము. ప్రత్యక్ష ప్రమాణాలు లేకపోయినా పరోక్ష ప్రమాణాలమీద అనుమాన ప్రమాణాలమీద ఆధారపడి ఎలాగైతేనేం నమ్ముతున్నాము. మరి అజ్ఞాతశక్తిని నమ్మడానికి అభ్యంతరమేమిటి ? దీనికూడ ఎన్నో పరోక్ష ప్రమాణాలు అనుమాన ప్రమాణాలు అండగా నిలుస్తున్నాయి కదా ! దీన్ని అంగీకరించడం మనిషికి చిన్నతనం కాదు. నిజంగా గొప్పతనం ! అంగీకరించకపోవడం శాస్త్రీయతకు మాయనిమచ్చ. తీరనిద్రోహం. అంగీకరించి ఆమోదించడం శాస్త్రీయమేకాదు శుభపరిణామంకూడా!

శాస్త్రం పురోగమిస్తోంది. సందేహంలేని ఈ అంశాన్ని ఎవరైనా సరే ఓ. కే. అంటారు. కాని ఒక ప్రశ్న- నిరంతరం గుండెల్ని తొలిచేస్తున్న ప్రశ్న. ఈ అభివృద్ధి ఏ పరమార్థాన్ని ఆశించి ? నిజానికీ శాస్త్రానికి పరమార్థముందా ? "హారిజాంటల్ డెవలప్‌మెంట్" ఎన్నాళ్లు: "వెర్టికల్ ఎన్‌హాన్స్‌మెంట్" ఎప్పటికి? ఏ ఒక్క విషయంలోనైనా. శాస్త్రజ్ఞుడు పరిపూర్ణంగా విజయం సాధించగలిగేడా ? తాను సృష్టించిన సాంకేతిక యంత్రాంగంపై తనకు అదుపు ఉందని గుండెలపై చెయ్‌వేసుకొని చెప్పగలడా ? "టెస్ట్‌ట్యూబ్ బేబీ" పుట్టింది. కవలలుకూడా పుట్టారు ! కాని స్పెర్మ్‌ను, ఓవమ్‌ను అప్పతీసుకొన్నాడు కదా ! చంద్రుణ్ణి చూచి వచ్చాడు. రాళ్లూరప్పలూ తెచ్చాడు. అయితే అంతటితో ఏం సాధించినట్లు ! మానవ కల్యాణానికి నిజంగానే ఈ శాస్త్రం దోహదం చేస్తోందా ? విశ్వాభ్యుదయాన్ని ఈశాస్త్రం మనస్ఫూర్తిగా వాంఛిస్తోందా ? కాలుష్యం, విషం గురించి హెచ్చరిస్తోంది. జనాభా సమస్యని గురించి మాట్లాడుతోంది. అంతరిక్షానికి ప్రాముఖ్యం ఇవ్వాలంటోంది. ఇంకొన్నాళ్ళకు స్థలం అనేమాటే వినపడదంటుంది. కొన్నేళ్ళకు ఫుడ్ గుడ్‌బై చెప్పేరోజులొస్తాయని అంటున్నది. ఒకరినొకరు పీక్కుతింటారనికూడా జోస్యం చెబుతున్నది. ఒక్క మాటలో కొన్ని సంవత్సరాల తరువాత (?) ప్రకృతి వ్యవస్థలో "కెయాస్" రాబోతుందని తెలియజెప్పింది. మరీ"సైన్స్" ఎందుకున్నది ? ఏం చేస్తున్నది ? మానవ జీవనానికి ఉపయోగకారిగా ఉండేందుకు ప్రయత్నించాలి కాని అపాయకారిగా ఉండడంలో అర్థం లేదు. ఇది మనం శాస్త్రంతో సాధించిన పరమపద సోపానమా ? మనకు మనమే తెరచుకొంటున్న అలవైకుంఠ పురద్వారమా ?- ఆలోచించండి. కూడు, గుడ్డ, నీడ-వీటికి ప్రాధాన్యమివ్వడం శాస్త్రీయత అనిపించుకొంటుందా ? కంప్యూటర్‌లు, రాకెట్‌లు, బాంబులు-వీటి చుట్టూ తిరగడం శాస్త్రీయత అనిపించుకొంటుందా ?- నిర్ణయించండి.

కాబట్టి శాస్త్రీయత అన్నపదానికి చాలమందికి అర్థం తెలియదనే భావించవలసివస్తోంది. గీతలో కృష్ణుడు ఉపదేశిస్తూ స్థితప్రజ్ఞుడవు కమ్మంటాడు. అంటే ఏమిటని అర్జునుడు అడుగుతాడు. దానికి కృష్ణుడు చక్కని వివరణను ఇస్తాడు. నాకు తెలిసినంత వరకు అప్పటి ఆ స్థిత ప్రజ్ఞను ఈ శాస్త్రీయతతో పోల్చవచ్చును. సంయమనంతో కూడుకొన్న ఉపజ్ఞను ప్రదర్శించడమే స్థితప్రజ్ఞ. ఇది జ్ఞానయజ్ఞులకు మాత్రమే సాధ్యమౌతుంది. అలాగే స్వయం విమర్శతో కూడుకొన్న సమన్వయ పారమార్థిక అభిజ్ఞతను ప్రదర్శించడమే శాస్త్రీయత. ఇది శాస్త్రగత ఆత్మపరిజ్ఞానులకు మాత్రమే బోధపడుతుంది.

అంటే శాస్త్రీయతకు నియమ నిష్ఠలతోపాటు పరిశీలనా పాటవము పరిరక్షణాభారము కూడ ఉండాలని అర్థము. ఇదికేవలం శాస్త్రం చెప్పదు. మానవుని కందని మరోశాస్త్రం - మనోశాస్త్రం చెబుతుంది. అదే సంస్కారం ! ఈ సంస్కార బద్ధమైన శాస్త్ర పరిజ్ఞానానికి అతినిర్దుష్టమైన ప్రయోజనాత్మక ప్రజాభ్యుదయ ప్రయోగాత్మక పథకానికి మరోపేరే శాస్త్రీయత !

విజ్ఞులు దారి చూపెదరు గాక !

~~~~~~

# నిస్పృహలో - స్పృహ

## శ్రీ రత్నశీకర విశ్వనాథ్

శిశిర తాడిత తరుశాఖికల
నిస్పృహల్లో తీయని
వగరుల చిగురులున్నాయ్ -
దుఃఖ పీడిత దరిద్రముఖాల
నిట్టూర్పుల ఓర్పులలో చిగిర్చే
ఆశల మోసులున్నాయ్ -
శిశిర దారిద్ర్యంలో భవిష్యద్వసంత
కుసుమాల మరందాలకై
చరిత్రకందని పేద భ్రమరాలున్నాయ్ -
క్షుద్రాగ్ని దహిత చకోరపు
నిరీక్షణా వీక్షణాలలో, వెన్నెల
వానల సోనలున్నాయ్ -
విరహబాధిత ధారా ప్రేయసి కన్నుల
కన్నీళ్ళ ధారలలో ప్రవాస ప్రియపతి
ఆగమన రహదారులున్నాయ్ —
మధుర భావాన్వేషిత మేధస్సుల
నిశ్వాస స్వనముల తపస్సులో
అనంతమైన ఊహల ఊటలున్నాయ్ —
ని'స్పృహ'లో స్పృహ; ని'రాశ'లో ఆశ;
నిట్టూర్పులో ఓదార్పు; నిరీక్షణలో తృష్ణ ....
శిశిరంలో శైశవం !!
~~~~~~

# భువన తారలు

## శ్రీ వేంపాటి సోమరాజు

బాల భాస్కరుని అరుణ కాంతుల
ఆకాశం అందగించిన వేళ,
గణ గణ గణ గణ గుడిలో గంటలు
వీనుల విందుగ మ్రోగిన వేళ,
ఆకుపచ్చని ఆమ్రవాటికల
ఆమని కోయిల పాడినవేళ,

పసిడి నవ్వుల పిల్లలు పాపలు
గుమిగూడెదరు మైదానంలో
ఆటల పాటల సందడితోను
అందరి కన్నుల పండువుగాను.

మనసులోన మమత మెఱయ
కన్నులలో కాంతి వెలుగ
మఱ్ఱిచెట్టు పెద్దనీడ
ప్రేమమీర కూర్చుండిన
ముసలి తాత ముచ్చటించు
"చిన్నతనపు రోజులలో
హరిత వర్ణ శాద్వలాల
పల్లవించి, మా వెంటను

పరువులెత్తిన చిలిపితనం
ఆనందం, అనురాగం
ఇట్టివే, యిట్టివే" యటంచు
అలసిపోయిన సూర్యదేవుడు
పశ్చిమాద్రిని విశ్రమించగ
అలసిపోయిన పిల్లలందరు
ఆటపాటలు కట్టిపెట్టి
తల్లికౌగిట, తండ్రిప్రక్కన
మెల్ల మెల్లగా వొదిగిపోయి
కథలువింటు, కబుర్లు చెబుతు
నిద్రరాగ కలలుగంటూ
కలల యలల వూయలలో
కదలిపోతూ, కరగిపోతూ
ముసి ముసి నవ్వుల మురిపిస్తూ
బంగరు శైశవ వాహినిలో
ఆటల పాటల పడవనెక్కి
ఆనందపు తెఱచాపనెత్తి
విశ్వానికే వెలుగును తెచ్చే
భువనతారలు, పిల్లలు పాపలు !

[ విలియం బ్లేక్ మహాకవి వ్రాసిన "ది ఇఖోయింగ్ గ్రీన్" అన్న గీతం చదివిన తర్వాత .... ]



డా॥ యస్. శివరామమూర్తి

# నేటి తెలుగులో సమాస నిర్మాణం

## సమాసాలు, పదబంధాలు

సమాసం అంటే ఒక పదం కంటె ఎక్కువ పదాలు కలిసి ఒక మాటగా వ్యవహరించడం, సంస్కృత పదమైన 'సమాస' మనే మాటకు ఆంగ్లంలో 'కాంపౌండు' అనే మాటతో సమానార్థకంగా వ్యవహరించడం కద్దు. 'సమర్థంబులగు పదంబు లేక పదంబగుట సమాసంబు.' అనగా సామర్థ్యము గల పదాలు ఒక పదంగా వ్యవహరింపబడడం సమాసమని సాంప్రదాయ వ్యాకరణాల్లో వివరణ. సామర్థ్యము అను మాటకు అర్థము ఏకార్థమగుట-అని వృత్తిలో వివరింపబడినది. నవ్య భాషా శాస్త్రంలోని మార్ఫాలజీ, ఏక్సోనమీ మొదలైన మాటలు వృక్షశాస్త్రంలో వాడుకున్నట్లే కాంపౌండు అనే మాటను రసాయన శాస్త్రపరిభాషలో వాడుకున్నట్లు చెప్పుకోవచ్చు. రసాయనిక శాస్త్రంలో మిశ్రమం. సమ్మేళనం అనే మాటలు వాడకం మనకు తెలిసిందే. మిశ్రమం అనే దాన్ని 'మిక్చర్' అనే ఇంగ్లీషు మాటతోను, సమ్మేళనం అనే దాన్ని కాంపౌండు అనే మాటతో సమానార్థకంలోను వాడుతున్నారు. ధాన్యం-రాళ్ళు, బియ్యం-యిసుక మొదలైన పదార్థాల కలయికను సమ్మేళనాలుగా చెప్పుకుంటున్నారు. ఈ సమ్మేళనం అనే మాట-కాంపౌండు అనే ఇంగ్లీషు మాటకి సమానం అని మొదట్లోనే చెప్పుకొన్నాం. ఇంతకీ చెప్పదగిందేమిటంటే ధాన్యం-రాళ్ళు కలిసిన మిశ్రమాన్ని విడదీసినంత సులువుగా పాలు-నీరు కలిసిన సమ్మేళనాన్ని విడదీయలేం.

తెలుగుభాషలో ఒకటి కన్నా ఎక్కువ పదాలు కలిగిన రూపాల్ని రెండు విధాలుగా విభజించవచ్చును.

1. సమాసాలు
2. పద బంధాలు

ఇటువంటి వివక్షతకి మూడు ముఖ్యమైన కారణాలున్నాయి.

## (అ) - సంధి మార్పులు

రెండు పదాలు కలిసినప్పుడు వాటి మధ్య రకరకాల సంధి మార్పులు జరగడం సాధారణమైన విషయం. ఈ సంధి మార్పుల వల్ల మొదటి పదంలోని చివరి అచ్చుగాని, చివరి అచ్చుతోపాటు పక్కనున్న హల్లుకూడా కాని, చివరి అక్షరము కాని పోతూ ఉండడం, ఆయాహల్లులమధ్య, అచ్చులమధ్య, సమీకరణం జరగడం కూడ కద్దు. ఇటువంటి మార్పులవల్ల ఒకోసారి మొదటి పదంలోని మొదటి అక్షరం మాత్రమే మిగిలిపోవచ్చు. ఈ సంధి మార్పులో ఉన్నటువంటి ధ్వనులు పోవడమే కాకుండా, కొన్ని కొత్తధ్వనులు రావడం కూడ కద్దు. వీటికి కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

1. కొత్త + ఆట = కొత్తాట
2. మూడు + పావు = ముప్పావు
3. పోటులు + ఆట = పోట్లాట
4. రాముడు + లక్ష్మణుడు = రామలక్ష్మణులు
5. ఇలు + ఆయన = ఇంటాయన.

ఈ పదాల్ని సంధి మార్పుల్ని పరిశీలించకుండా విడదీస్తే కొన్ని పదాలకి అర్థాలు వెంటనే స్ఫురించవు. అంటే

కొత్త + ఆట
ము + పావు
పోట్ల్ + ఆట
ఇంట్ + ఆయన

భాషాపరంగా సంధి వశాత్తు జరిగిన ఈ మార్పులవల్ల 'సమాసం'లోని మొదటి పదం అర్థం వెంటనే స్ఫురించదు.

## (ఆ) - అర్థంలో మార్పు

రెండు పదాలు కలిసినప్పుడు కొన్నిట్లో ఆ రెండు పదాల యొక్క మొత్తం అర్థం ఇమిడి ఉండడం, కొన్నిట్లో ఆ రెండు పదాల యొక్క అర్థానికి అతీతంగానే వేరే అర్థాన్ని సంతరించుకోవడం, కొన్నిట్లో ఒక పదానికి పూర్తిగా అర్థమే లేని పరిస్థితులు కూడ ఉన్నాయి. కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

6. బంతి + ఆట = బంతాట
7. అడుగు + కొను = అడుక్కొను
8. చేసి + పెట్టు = చేసిపెట్టు
9. దా + నిమ్మ = దానిమ్మ

ఆరో ఉదాహరణలో అర్థం మారలేదు. ఏడెనిమిది ఉదాహరణాల్లో ఆ రెండు పదాలకున్న అర్థం కన్నా మరికొంత అర్థం సంతరించుకొన్నాయి. తొమ్మిదో ఉదాహరణలో మొదటి పదానికి సరియైన అర్థం కనిపించలేదు. 8, 9 ఉదాహరణల లాంటివి శబ్దపల్లవాలుగా పేర్కొనబడ్డాయి బాలవ్యాకరణంలో.

(ఇ) - పద విస్తరణ

రెండు పదాలు సంధివశాత్తు కలిసినప్పుడు, ఆ రెండింటి మధ్య మరికొన్ని పదాల్ని ఇరికించడానికి సాధ్యమౌతుంది; కొన్నింట్లో కాదు. ఇటువంటి పదాలు ఇరికించే సందర్భంలో ఉత్పత్తి అయ్యే రూపాలు కృత్రిమంగా ఉండకూడదు. కొన్ని ఉదాహరణలు :

10. కొత్త + ఆవు = కొత్తావు.
11. కొత్త + మంచి + ఆవు = కొత్త మంచావు
12. కొత్త + నల్ల + ఆవు = కొత్త నల్లావు
13. దా + నిమ్మ = దానిమ్మ
14. చేసి + అక్కడ + పెట్టు = చేసి అక్కడపెట్టు
15. చేసి + పెట్టు చేసిపెట్టు
16. సంతోష + పెట్టు = సంతోషపెట్టు

14వ ఉదాహరణలో ఉన్న చేసి + (అక్కడ) పెట్టు అన్న దానిలో అర్థానికి 15లోని చేసి + పెట్టులోని అర్థానికి వ్యత్యాసం ఉంది. చేసిపెట్టు అనే దానికి రెండు అర్థాలున్నాయి. చేసేసి పెట్టు. దయచేసి చేసేసి పెట్టు. 15లోని ఉదాహరణకి చేసిపెట్టండి అని చివరన, అండి అనే పార్టికిల్ చేరిస్తే రెండో అర్థం ఇంకా బాగా అవగతమౌతుంది. అర్థం మారినా 'చేసిపెట్టు' అనే మాటలో మరో పదాన్ని యిరికించడానికి సాధ్యమై పద విస్తరణకు అవకాశం ఉంది. కాని 13వ ఉదాహరణంలో ఏ విధంగా కూడ మరొక పదం ఇరికించే అవకాశం లేదు. ఇటువంటివే క్రియల్లో మరికొన్ని ఉదాహరణలు.

17. విన + బడు = విన + పడు
18. చెయ్య + గల = చెయ్య + కల
19. అదర + గొట్టు = అదర + కొట్టు
20. అర + బెట్టు = అర + పెట్టు

14, 15 లోని ఉదాహరణలు క్త్వార్థక సంబంధమైన 'పదబంధం'. 16 లోని క్రియ నామవాచక సంబంధమైన సమాస క్రియ. 17, 18, 19 లోని క్రియలు అన్నంత రూపానికి సహాయక క్రియలతో కూడినవి. ఇటువంటి రూపాల్లో ఏ విధంగాను ఒక పద బంధంలో మరో పదాన్ని యిరికించడానికి సాధ్యంకాదు.

మీద చెప్పిన ఉదాహరణల్ని పరిశీలించిన తరువాత సమాసాలు-పదబంధాలు అనే రెండు రకాలైన వాటిని మనం గుర్తించాల్సి ఉంటుంది. ఇటువంటి అవసరం లేకుండా అన్నింటిని సమాసాలే అందాం. అనకుంటే సమాసమనే పదానికి మనం ఇచ్చే అర్థం చాల విస్తృతం అవుతుంది. అలా కాకుండా అన్నింటినే పదబంధాలు అందాం అంటే తెలుగులో సమాసాల ప్రసక్తే లేకుండా పోతుంది. ప్రసక్తే లేకుండా పోవడం వల్ల ప్రమాదం లేదనుకొండి. దృష్టిలో సమాసాల్ని పదబంధాల్ని వేరుగా ఉంచి ఈ క్రింద నిచ్చిన విపక్షతల్ని పాటించడం మేలనిపిస్తుంది.

| | సమాసాలు | పదబంధాలు |
|---|---|---|
| 1. | నిర్మితి ననుసరించి సంధి వశంగా పదాల్లోవికారితమైన మార్పులు జరిగి రెండు పదాలువిడదీసినంతనే అందులోని ఏదో ఒక పదం సుళువుగా అర్థాన్నివ్వలేక పోవడం. | రెండుగానిఅంతకంటెఎక్కువ పదాలు పదబంధాలుగా కలిసినప్పుడు సంధి వశాత్తు మార్పులు జరిగినా, విడదీసినంతనే పదాలు తమఅర్థాల్ని, రూపాల్ని కలిగి సుళువుగా అవగతమవడం. |
| 2. | రెండుగాని అంతకంటె ఎక్కువపదాలుకలిసినప్పుడు అది ఇచ్చే మొత్తం అర్థం అందులోని పదాలు అర్థం కన్నా కొంచెమైనా భిన్నంగా ఉండడం. | రెండు గాని అంతకంటె ఎక్కువ పదాలు కలిసినప్పుడు ఆ రూపం తాలూకు మొత్తం అర్థం దానిలోని పదాల అర్థంతో సమానంగాఉండడం. |
| 3. | రెండుగాని అంత కంటె ఎక్కువ పదాలు కలిసిన రూపాల మధ్య మరోపదం యిరికించి పద విస్తరణకు సాధ్యపడని రూపాలు. | రెండు గాని అంత కంటె ఎక్కువ పదాలు కలిసిన పద బంధాల మధ్య మరో పదాన్ని యిరికించి పదబంధాల్ని విస్తరించే అవకాశం కల రూపాలు. |
| 4. | సమాసాల్లో సాధారణంగా రెండుపదాలకంటేఎక్కువ పదాలు లేకపోవడం. | పదబంధాల్లో రెండు పదాల కంటె ఎక్కువ పదాలు ఉండే అవకాశం ఉంది. |
| 5. | ఒక ఊనికతో పలకబడి పదాల మధ్య ఎటువంటి ధ్వని విరతి ఉండడానికి అవకాశం లేదు. | పదాల మధ్య ధ్వని విరతి ఉండడానికి అవకాశాలున్నాయి. |

కాని ఇటువంటి వివక్షతలో చిక్కులు లేకపోలేదు. ఈ వివక్షతలో మొదటిదైన సంధి మార్పుల గురించే ఆలోచిద్దాం. ఎటువంటి సంధి మార్పులు జరిగితే సమాసాలని గుర్తించాలి, ఎటువంటి సంధి మార్పులు జరిగితే పదబంధం అనాల్సి ఉంటుందన్నది గడ్డు ప్రశ్న. అలా అని 'సమాసమనే' రూపాలు లేవనడంలో కూడ కొన్ని చిక్కులు లేకపోలేదు. సమాస రూపాలు ఇటు పద విభాగం చివరను-వాక్య విభాగం మొదట్లోను మనం సాధారణంగా చర్చించదగే రూపాలు. ఈ రూపాల్లో ఒక పదం కన్నా ఎక్కువ పదాలుండడం వల్ల ఇవి పద విభాగంలో చెప్పుకోదగ్గవి. సాధారణంగా పద విభాగంలో ప్రాతిపదిక + ప్రత్యయాల గురించి చర్చిస్తారు. అంతే కాని రెండు ప్రాతిపదికలు కలిసిన రూపాల గురించి చర్చించరు. కాని సమాసాన్నికూడ ప్రాతిపదిక క్రింద గుర్తించడం వల్ల తప్పులేదు. ఎందుకంటే ఈ సమాసాలకి కూడ మిగతా రూపాల్లాగే, విభక్తి ప్రత్యయాలు క్రియా ప్రత్యయాలు చేర్చ వచ్చును. ఉదాహరణకి-ముక్కాని, ముక్కంటి వంటి రూపాలకి విభక్తి ప్రత్యయాలు చేర్చగా ముక్కాన్ని, ముక్కంటికి అని ఏర్పడతాయి. అలాగే క్రియల్లో కూడ సమాసాల క్రియలనబడే చెయ్యగలుగు, అరబెట్టు అనే వాటికి క్రియా ప్రత్యయాలుచేరిస్తే చెయ్యగలుగుతాను, అరబెడతాను అనే రూపాలు ఏర్పడతాయి. అందువల్ల ఇటువంటి సమాసాల్నికూడ పద విభాగంలోనే చేర్చి చర్చించవచ్చును. కొన్ని రకాలైన పద బంధాలకి కూడ విభక్తి ప్రత్యయాలు, క్రియా ప్రత్యయాలు చేర్చవచ్చును. ఈ వ్యాసంలో ముందు ముందు చర్చిద్దాం.

మీద చేసిన వివక్ష ప్రకారం నేటి తెలుగులో ఈ క్రింది విధమైన నిర్మాణాలు సమాసాలుగా గుర్తించాల్సి ఉంది.

1. విపరీతమైన సంధి మార్పులు జరగడం వల్ల ఏర్పడి అటువంటి పదాల మధ్య మరో పదాన్ని ఇరికించడానికి అవకాశం లేనివి

   విశేషణం + నామవాచకం.

   పెత్తల్లి, చన్నీరు, కన్నీరు, వెల్లుల్లి.

2. సంఖ్యావాచక విశేషణం + నామవాచకం.

   ముక్కాని, మక్కాలి (పీటి), పందుము, నల్తుము.

3. ప్రత్యయం + నామవాచకం

   పన్నీరు, దాపిమ్మ, మోచేయి, మోకాలు

4. క్రియా రూపాల్లో అన్నంత రూపంతో అంతమైన పదానికి సహాయ క్రియ చేర్చగా వచ్చేవి.

   చెయ్యగలుగు,తియ్యగలుగు, వెళ్ళనియ్యి, చూడబడు

5. క్రియా రూపాలకు బహువచన రూపం చేర్చబడిన రూపానికి సహాయక క్రియ చేర్చగా ఏర్పడిన రూపాలు.

   పెనుగులాడు, పోట్లాడు కొట్లాడు

6. ధ్వన్యనుకరణలో కలిగిన రూపాలు

   కలకలలాడు, గజగజలాడు, కిలకిలలు, నిగనిగలు, ఘుమఘుమలు

7. నామవాచకాలకి - సహాయక క్రియ చేర్చగా ఏర్పడ్డ రూపాలు-

   సంతోషపడు, అబ్బురపడు, సంబరపడు

8. అంగ్లపదాలకు సహాయక క్రియలు చేర్చగా ఏర్పడే కొన్ని రూపాలు :

   పాసగు

9. కొన్ని శబ్దపల్లవాలు :

   నిద్రపుచ్చు

10. ఆమ్రేడితాలు :

   కాఫీ గీఫీ, అప్పుడప్పుడు, ఇల్లూ గిల్లూ,కొన్నికొన్ని.

భద్రిరాజు కృష్ణమూర్తిగారు "తెలుగులో సమాస క్రియలు" అనే వ్యాసంలో అన్నంత రూపాలు + సహాయక క్రియతోకూడిన రూపాల్ని, క్త్వార్థక + సహాయక క్రియతో కూడిన రూపాల్ని, సమాస క్రియలుగానే గుర్తించారు. ఈ వ్యాసంలో ఇందులో మొదట చెప్పబడ్డవి మాత్రమే సమాస క్రియారూపాలుగా గుర్తించబడ్డాయి. మీద చెప్పిన కారాణాలే ఈ వివక్షతకు ఆధారం. అన్నంత క్రియ తరువాత వచ్చిన సహాయక క్రియ నాద రహిత హల్లులై ఉంటే తప్పకుండా నాదత్వాన్ని పొందుతాయి. అంటే కచటతపలు, గజడదబలుగా మారుతాయి. ఈ మార్పు క్రియ చివరలో ఇంతకు ముందు ఉన్నటువంటి అనునాసిక స్వరమైన న్ వలన-అలాగే ఈ న్ మూలంగా-సహాయక క్రియ అచ్చుతో మొదలైతే న కారం మధ్య చేరుతుంది. ఈ మార్పు ఈ రెండు విధాలైన క్రియారూపాల మధ్య ముఖ్యమైన వ్యత్యాసాన్ని తెలుపుతుంది. పోవు అనే క్రియ ఈ రెండింటితోను సహాయక క్రియగా కలుస్తు ది. కాని ఒక దానిలో

పోవు క్రియలోని పో అలాగే ఉండిపోతుంది. రెండో రూపంలో పో, బో గామారుతుంది. ఇటువంటిమార్పువల్ల ఈ రెండురూపాలు చాల వ్యత్యాసం గల అర్థాలు కలవిగా ఉన్నాయి. వరుసగా ఉదాహరణలు కొన్ని చూడండి :

ఎండ + పెట్టు = ఎండబెట్టు
ఆర + కట్టు = ఆరగట్టు
చెయ్య + ఇయ్య = చెయ్యనియ్య
వెళ్ళి + పోవు = వెళ్ళిపోవు, వెళ్ళిపోయాడు
వెళ్ళి + పోవు = వెళ్ళిబోవు (వెళ్ళిబోయాడు)

డాక్టర్ సి. రామారావుగారు కో ఆర్డినేషన్ అర్ సబార్డినేషన్ అనే వ్యాసంలో నడచివెళ్ళు, చేసిబతుకు, తినిసంపాయించు, మొదలైన క్రియారూపాలుకూడ సమాసాలుగా పరిగణించదలచినట్లు కనబడుతుంది. పైగా వాటిని క్రియా సమాసాలుగా పరిగణిస్తే వాటి మధ్య పెద్ద పెద్ద పదబంధాలుండవచ్చును. కాని అటువంటిది సాధారణంగా వీటిలో జరగదని చెప్పారు. కాని క్త్వార్థకము + క్రియా రూపాల మధ్య వేరే పదాల్ని ఇరికించవచ్చును. అందువల్ల ఈ వ్యాసంలో అవి సమాసాలుగా గుర్తించబడలేదు.

నడిచి వెళ్ళాడు : నడిచి/ఇంటికి/వెళ్ళాడు-

అతను కాలేజీవరకు నడిచి తరువాత ఇంటికి వెళ్ళాడు అనే రూపాలు సాధ్యమౌతాయి. కాని ఇక్కడ సి. రామారావుగారి సమాసాల గురించి చర్చించడం ముఖ్యోద్దేశం కాదు.

చూడలేదు, చూడవద్దు, చూడకూడదు, చూడరాదు, అనే క్రియారూపాల్లో లేదు, వద్దు, కూడదు రాదు అనేవికూడ అన్నంత రూపాల తరువాతనే వస్తాయి. కాని ఇవి సమాస క్రియలుగా పరిగణించబడవు. ఇవి వ్యతిరేకార్థాన్ని సూచించి పదాన్ని అక్కడితో అంతం చేస్తాయి. అంతేగాక కొన్ని రూపాల్లో మరికొన్ని పదాల్ని కూడ ఇరికించి విస్తృతం చేయవచ్చును. ఉదాహరణకు :

చూడరాలేదు.

నేటి తెలుగులోని పదబంధాల్లో ఈ క్రింది విధాలైన రూపాలు మనం గమనించవచ్చును :

నేటి తెలుగులో రెండు ముఖ్యమైన వాక్యప్రక్రియలున్నాయి: 1. క్రియలేనిది 2. క్రియతో కూడినవి. ఉదాహరణలు :

అది చెట్టు, ఆమె చదువుతుంది.

పదబంధాల్ని ఎండోసెంట్రిక్ (అంతర కేంద్ర పద బంధాలు) అని, ఎక్సోసెంట్రిక్ (బాహ్య కేంద్ర పదబంధాలు) అని రెండు విధాలుగా విభజించవచ్చు. ఎండోసెంట్రిక్ పదబంధం అంటే ఆ పదబంధాల్ని ఎంత విస్తరింపజేసినా పదబంధంలోని ఏదో ఒక దానితోగాని, కనీసం ఒక దానితో వ్యాకరణ విషయికంగా సమానంగా ఉంటుంది. అంటే పదబంధంలోని లక్షణం ఆ పద బంధంలోనే ఏదో ఒక దానితో ఉంటుంది. ఎక్సోసెంట్రిక్ అంటే పదబంధంలోని ఏదైనా ఒక పదం-మొత్తం పదాలతో వ్యాకరణ పరంగా వ్యత్యాసం చూపడం.

ఉదాహరణలు:

ఎండోసెంట్రిక్ పదబంధం :

ఆ కొత్త పుస్తకం బాగుంది, కొత్త పుస్తకం బాగుంది, పుస్తకం బాగుంది, ఆ పుస్తకం బాగుంది.

ఎక్సోసెంట్రిక్ పదబంధం :

ఆమె సీత కన్న / బాగుంది.
సీత / బాగుంది.

ఎండోసెంట్రిక్ పదబంధాల్ని రెండు విధాలుగా విభజించవచ్చును.

విశేషణ పూర్వ పదబంధాలు :

కోఆర్డినేట్ (సమన్వయ)

ఎ. ఎడిటివ్ (సంకలనాత్మక)
బి. ఎపోజిషనల్ (ప్రతి స్థాపన)
సి. ఆల్టర్నేటివ్ (పర్యాయ)

కోఆర్డినేట్ పదబంధాల్ని మూడు విధాలుగా విభజించవచ్చును. సంకలనాత్మక పదబంధాల్లో కొన్ని చోట్ల సముచ్చయం ఉంటుంది. కొన్నిట్లో సముచ్చయం ఉండదు. ఉదాహరణలు :

అమ్మ, నాన్న, చెల్లి / వెళ్లారు.
కాగితాలు, కలాలు, పుస్తకాలు
సీతారాములు, సీతారామలక్ష్మణులు, ఆవూ దూడ, ఆవూ దూడా, అదా యిదా, అదీ యిదీ, రెండున్నర, అయిదుంబావు

**సమానాధికరణ పదబంధాలు :**

మహాత్ముడు గాంధీ . చెల్లి శారద

**పర్యాయ రూప పదబంధాలు :**

కాని, లేక, అయినా, ఓ మొదలైన రూపాలు ఒక పదబంధంలో మొదటి పదం చివర చేర్చగా ఏర్పడిన రూపాలు. ఇందులో 'లేక' తప్ప మిగతా అన్ని రూపాలు పదబంధంలోని రెండు పదాలకు చేరుతాయి.

అది కాని యిది కాని — కాగితమైనా పుస్తకమైనా

అది లేక యిది — మూడో నాలుగో

**విశేషణపూర్వ పదబంధాలు :** వీటిలో చాలా రకాలున్నాయి.

1. విశేషణం + నామ వాచకం.

అ. రంగు - ఎర్రగులాబి, తెల్లకాగితం, నల్లకాకి, ఎర్రటిగులాబి, తెల్లటికాగితం, నల్లనికాకి

ఆ. పరిమాణం ; చిన్న కలం, పెద్ద పుస్తకం.

ఇ. రకం : కొత్త మాట, పాత పాట, మంచి ఆట.

ఈ. రుచి : తియ్యని పండు, పుల్లటి పండు.

ఎ. స్పర్శ : వెచ్చని నిట్టూర్పు, మెత్తటి పరుపు, చల్లని నీరు.

ఏ. కొలపరిమాణం : లీటరు నెయ్యి, పిడికెడుబియ్యం

ఒ. సంఖ్యావాచకం : మూడు కలాలు, పది కాగితాలు, ఒకటో తరగతి, రెండో క్లాసు. ఇద్దరు మనుష్యులు, పదిమంది మనుష్యులు

ఓ. నిర్దిష్టత : తిరుపతికొండ, ద్రాక్షపళ్లు, కృష్ణానది.

ఔ. నిర్దేశాత్మకం : ఆ రోజు, ఈ మనిషి, ఆ పాట.

క. క్రియావిశేషణం: చేసినపని, వచ్చిన మనిషి, చదువుతున్న అబ్బాయి, పోతున్న అమ్మాయి, వచ్చేమనిషి, తినే తిండి, రాని మనిషి, తినని తిండి.

ఖ సంబంధ బోధనం : నామాట, ఆమెపాట, లక్ష్మణ చరిత్ర

గ. స్థలం : ఇక్కడి పని, బయటమనిషి, దగ్గరి యిల్లు, దూరపు బస

ఘ. కాలం : ఇప్పటి పని, తరువాతి మాట, రేపటి కథ, నిన్నటిపాట

చ. బహుళ వ్యాప్తి : ప్రతిరోజు, కొండరపని

ఛ. పరిమాణం : ఇన్నిపాలు, ఇంతపని, కొంత తేనె, సగం పాఠం, అన్ని పుస్తకాలు

**బహిః కేంద్ర పదబంధాలు :**

కుర్చీ మీద, సీతకన్న, యింటి లోపల

ఈ పదబంధాలకు ఉత్తర పదంగా మరో నామవాచకం చేరిస్తే - అవి ఎండోసెంట్రిక్ పదబంధాల్లాగానే వ్యవహరిస్తాయి.

కుర్చీమీది పుస్తకం, పెట్టెక్రిందిబల్ల, సీతకన్న పెద్దవాడు.

ఎండోసెంట్రిక్ పదబంధాల్లో మొదటి పదానికి ది, వి, వాడు మొదలైన ప్రిడికేటివ్ పార్టికల్స్ చేరిస్తే పూర్తివాక్యాలుగా వ్యవహరించవచ్చును. ఇటువంటి చేర్పు వీటిలో కొన్నింటికి మాత్రమే సాధ్యమౌతుంది.

కలం చిన్నది, పరుపు మెత్తనిది, నీళ్ళు మంచివి, పని యిక్కడిది - మొదలైనవి

**పదబంధ విస్తరణ :**

ఇటువంటి పదబంధాల్ని విశేషణాలు చేరుస్తూ అర్థ పొంది కను బట్టి విస్తరించవచ్చును. ఈ క్రింది ఉదాహరణలు గమనించండి :

విశేషణం + నామవాచకం :
కప్ప / + పిల్ల
పెద్ద / కప్పపిల్ల
మింగుతున్న / పెద్ద కప్ప పిల్ల
పిల్లను / మింగుతున్న పెద్ద కప్ప పిల్ల
చేప / పిల్లను మింగుతున్న పెద్ద కప్ప పిల్ల
చిన్న / చేప పిల్లను మింగుతున్న పెద్ద కప్ప పిల్ల
ఆ / చిన్న చేప పిల్లను మింగుతున్న కప్పపిల్ల

ఇటువంటి పదబంధాల్లో ఎడమ వైపునున్న చివరి పదం మాత్రమే విశేషణంగా వ్యవహరిస్తుంది. దానికి కుడి వైపునున్న మిగతా భాగమంతా నామ పదబంధంగా వ్యవహరిస్తుంది.

**క్రియారూపాల్లో సమాసాలు - పదబంధాలు**

అ. అన్నంత క్రియారూపం + సహాయక క్రియ } రూపాలు
ఆ. నామవాచకం + సహాయక క్రియ } సమాసాలని.

ఉ దాహ ర ణ లు :

ఇ. క్త్వార్థకము + సహాయక క్రియతో కూడిన రూపాలు పద బంధాలని చెప్పుకున్నాం. కొన్ని ఉదాహరణలు : అన్నంత రూపం తరువాత వచ్చే సహాయక క్రియలుగా విభజించవచ్చు.

1.

| | | | |
|---|---|---|---|
| కొట్టు | - పడగొట్టు | కోయు | - తెగకోయు |
| కట్టు | - అరగట్టు | తీయు | - ఊడదీయు |
| పెట్టు | - ఎండబెట్టు | తోయు | - పడదోయు |
| జల్లు | - ఎదజల్లు | అంపు | - సాగనంపు |
| ప్రాకు | - ఎగప్రాకు | పడు | - అమ్మబడు |
| ఇయ్యి | - చూడనియ్యి | వేయు | - అరవేయు |
| చూపు | - అమ్మజూపు | తలచు | - వెళ్ళదలచు |
| పోయు | - పారబోయు | పూయు | - విరబూయు |

ఈ సహాయక క్రియలు - వీటి ముందున్న ముఖ్య క్రియల సకర్మక, అకర్మక నిష్పత్తిని మార్చగలవు. ఈ క్రింద చెప్పబోయే క్రియలు అటువంటి మార్పును తేజాలవు.

2. వచ్చు - చూడవచ్చు
పోవు - చూడబోయాడు

అనుజ్ఞావాచి, సామర్థ్యవాచి, అసామర్థ్యవాచి, సంసిద్ధతా వాచి, నిర్ణయా, సంఖ్యాక మొదలైన రూపాలు ఈ సహాయక క్రియలు చేర్చడం వల్ల సాధించవచ్చును.

నామవాచకాల తరువాత, ధ్వన్యనుకరణ రూపాల మీద, సాధారణంగా - బడు, అను మొదలైన సహాయక క్రియలు చేరు తుంటాయి. ఈ క్రింది ఉదాహరణలు గమనించండి :

సంతోషపడు. ఆనందపడు, బడబడమను, దడదడమను

క్రియా పదబంధాలు

క్త్వార్థక రూపంతో కూడినవి పదబంధాలుగా గుర్తింప బడ్డాయి. క్త్వార్థక రూపాల తరువాత చేర్చదగిన సహాయక క్రియలు :

| | | | |
|---|---|---|---|
| పోవు | - వెళ్ళిపోయాడు | వేయు | - చేసెయ్యి |
| పెట్టు | - చేసిపెట్టు | ఉండు | - చూస్తున్నాను |

ఇవికాక అన్నంత క్రియారూపాల తరువాత ఉండు, కూడు, వలయు, ల్, రా, తప్ప మొదలైన సహాయక క్రియలతో చేర్చిన రూపాలు కూడ పదబంధాలుగానే పరిగణించవచ్చును.

ఉదా:- చూడకూడదు, చూడవద్దు, చూడలేదు, చూడరాదు, చూడకతప్పదు.

ఈ సహాయక క్రియలుకూడ ఒక పదంలో 4, 5 ఉండవచ్చును.

డబ్బు / కూడ / బెట్టు / కో / లేక / పోయాడు

**సమాసాలు - పదబంధాలు ఏర్పడేటప్పుడు జరిగే సంధి మార్పులు**

స్వతంత్రత గల రెండు పదాలు కలిసినప్పుడు కొన్ని సంధి మార్పులు జరగడం కద్దు. అందులో కొన్ని ముఖ్యమైన వాటిని పరిశీలిద్దాం.

1. ప, పూలతో అంతమయ్యే మొదటి పదాలు - ప తో ప్రారంభమయ్యే పదాల్తో కలిస్తే మొదటి పదంలోని చివరి అచ్చు లోపిస్తుంది.

కోప + పడు = కోప్పడు

అపు + పెట్టు = అప్పెట్టు

2. క, కులతో అంతమయి, రెండక్షరాలు కలిగే పదాలు క్ తో మొదలయ్యే పదాల్ని కలిస్తే మొదటి పదంలోని చివరిఅచ్చు లోపిస్తుంది.

నాకు + కాదు = నాక్కాదు

రాక + కోసం = రాక్కోసం

3. అన్నంత రూపాలతో అంతమయ్యే పదాలు - వలయు క్రియతో కలిసినప్పుడు - వలయులోని వ, వ్ లోపిస్తుంది.

చేయ + వలసింది = చేయాల్సింది

విన + వలిసింది = వినాల్సింది

4. వలస్‌లోని ల, స ల మధ్య అచ్చు లోపిస్తుంది.

5. అచ్చుతో అంతమయ్యే పదాలు ఇ, ఎ లతోగాని, ఉ, ఓ లతో గాని ప్రారంభమయ్యే పదాలతో కలిసినప్పుడు వరుసగా యి, వు లు వికల్పంగా ఆగమాలుగా చేరతాయి.

ఆమె + ఇచ్చింది = ఆమె యిచ్చింది

ఆవిడ + ఇచ్చింది = ఆవిడ యిచ్చింది, ఆవిడిచ్చింది

ఆవిడ + ఎక్కడ = ఆవిడ యెక్కడ

సీత + ఉన్నది = సీత వున్నది

6. గు తో అంతమయ్యే క్రియాపదాల అన్నంతరూపాలు కలుగు అనే క్రియతో చేరితే మొదటిపదం చివరి అచ్చులోపిస్తుంది.

పెరగ + కలుగు = పెరగ్గలుగు

విరగ + కలుగు = విరగ్గలుగు

7. క్రియల అన్నంత రూపాల తరువాత వచ్చే సహాయక క్రియల మొదటి నాదరహితిమైన హల్లులు నాదత పొందుతాయి. అచ్చుతో ప్రారంభమయ్యే రూపాల ముందు న్ గాగమం వస్తుంది.

కూడ + పెట్టు = కూడబెట్టు

రా + పెట్టు = రాబెట్టు

రా + ఇయు = రానియ్యు

8. డ తో అంతమయ్యే క్రియల అన్నంత రూపాలు లే అనే క్రియా రూపంలో చేరినప్పుడు డ + ల లు - ళ్ళ గా మారుతాయి.

చూడ + లేదు = చూళ్ళేదు

ఆడ + లేదు = ఆళ్ళేదు

9. క్రియారూపాలు 'అను' క్రియతో చేరినప్పుడు ఏకాక్షరాల ముందు మ్మ అని, మిగతా రూపాల ముందు మ ఆగమంగా వస్తాయి.

రమ్మన్నాను, పొమ్మన్నాను, పాడమన్నాను.

10. పన్ను, కన్ను మొదలైన పదాల చివర సిలబుల్ పోయిఅటి గమంగా వస్తుంది.

పంటినొప్పి కంటినొప్పి

ఏటి వరద ఇంటికప్పు

పగటి పూట

పన్ను, కన్ను, గూడు, గోరు, నోరు, నీరు, ఏరు, యిల్లు, ఒళ్ళు, నదురు, పగలు, రోలు, కూడు, నాడు, నేడు ఈ గణంలోని పదాలు.

11. మాపు మొదలైన పదాల తరువాత అటి అగమంగా వస్తుంది.

మాపటి వేళ, నిన్నటి రాత్రి

మాపు, మొన్న, నిన్న, నేపు, రేపు, ఈ గణంలోనివి.

12. రాయి మొదలైన పదాల చివరి అక్షరం పోయి తి ఆగమంగా వస్తుంది.

రాతిగుండె చేతిదెబ్బ

రాయి, చేయి, గోయి, చెయ్యి ఈ గణంలోనివి.

13. పదబంధాల్లో మొదటి పదం సాధారణంగా విశేషణ రూపంలో ఉంటుంది.

నా మాట రాముడి పుస్తకం

పుస్తకాల వెల తన రాత

14. సంఖ్యావాచక రూపాలు మరో పదంతో కలిసినప్పుడు ఇటి అగమంగా వస్తుంది.

రెండిటి/ఖరీదు మూడిటి / వెల

15. నూరు అనే సంఖ్యావాచకం చివరి అక్షరం పోయి టి అనేది ఆగమంగా వస్తుంది.

నూరు — నూట యిరవై. నూట పది,



# ఉగాది ఎందుకు?

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

దినమూ ఒక పండుగయినపుడు
ఉన్నవాడికి ఉగాది పండుగ ఎందుకు?
ఉచ్చిమిాదికి బొట్టు చమురుకు నోచుకోలేనప్పుడు
లేనివాడికీ ఉగాది ఉలుకెందుకు?

అయినా ఉగాది వస్తూనే ఉంది!
ఎవరి కోసం వస్తుందో? వచ్చి యేమి తెస్తుందో?
చెప్పి చెప్పి వస్తుంది!- 'గప్‌చిప్'గా వెళ్ళిపోతుంది!!

అనాది నుండి అవిరళంగా సాగిపోతున్న కాలగతిని
అదుపులోనికి తెచ్చుకోవాలని ఆలోచించిన మనిషి
ఆ కాలాన్ని వొడిసి వాటంగా పట్టుకొని
ముక్కలు ముక్కలుగా చీల్చి చెండాడి
ఏడాదులని-నెలలని-దినములని-గంటలని-నిముషాలని-
సెకనులని
భాష్యంచెప్పి విభజించి భజించిన కాలంనుండీ
ఉగాది వస్తూనే ఉంది!

ఒకరికి తల్లి యింకొకరికి చెల్లి మరొక్కరికి అనురాగ
కల్పవల్లి
సాంఘిక నియమావళితో మొగం మొత్తి, శివమెత్తి
గళమెత్తి ఓ చైతన్యమూర్తి పండుగల అవసరాన్ని
పలికి నపుడు
కోయిల సన్నాయి స్వరములతో
లతాకన్యలు కాలికి గజ్జెకట్టి నవ్వుల పువ్వులు రువ్వుతూంటే
వచ్చేసింది ఉగాది! - నాటినుండి వస్తూనే ఉంది!!

నాకు యింకను కండ్లకు కట్టినట్లు కన్పిస్తూనే ఉంది-
తొలికోడి కూయక ముందు
ఊరు మేల్కొన్న సమయమందు
గోచికూడా లేకుండా కూర్చునేవాడిని అమ్మ ముందు!
ఆరోగ్యసూత్రాల్ని ఓ అబక నూనెలో రంగలించిపోసి
అనురాగం ఆత్మీయతల్ని అరచేతుల్లోనింపి
ఒళ్ళంతా కళ్ళుచేసి నూనెను నా వొళ్ళంతా రుద్దేది!
ఉడుకుడుకు నీళ్ళతో తలకడిగి పోసేది!!
కొత్త నిక్కరు చొక్కా తొడిగిన సంబరం నాదైతే
ఆ సంబరం ఏడాది పొడుగునా కొనసాగాలన్న ఆనందం
అమ్మది!

కుత కుత ఉడుకుతున్న కోడి కూర
ముక్కు పుటాలను అదరగొడుతూ ఉంటే-
అరచేతిలో ఉగాది పచ్చడి పెట్టేది!
ఆ పులుపు చేదులు పులుముకొన్న 'తీపురుచి' సహించక
వంటింటివైపు ఓరగంట చూస్తూ ముఖం చిట్లిస్తే
'అబ్బోడా! సుకాన్ని సవిసూడాలంటే
కష్టాల్ని దిగమింగాలిరా!' అనేది.
ఆ వయస్సులో అమూల్యమయిన అమ్మ సందేశం
తలకెక్కలేదు కానీ
గోచీ పెట్టేసరికి ఏపేచీ లేకుండా నసాళాని కెక్కింది!
ఆనాటి నుండి సుఖం చవిచూడడానికని
దిగమ్రింగుతున్నాను దినము దిగుమతి అవుతున్న ఎన్నో
అనుభవాల్ని!
అయితే- 'తీపు' ఒక వర్గానికే పరంపరాగతంగా
'చేదు' యింకొక్క వర్గానికి మధుర వరంగా
కలగలపడానికి వీలులేని విధంగా-
నాటుకొన్న నేటి సమాజంలో-
చేదు తీపుల ప్రసక్తి ఎందుకు?
'ఉగాది పచ్చడి' ఉద్బోధ ఎందుకు?-
నాకు బాగా జ్ఞాపకముంది-
అమ్మ అయ్య ముచ్చటపడి సంతలో కొని తెచ్చిన
గుడ్డల్ని సింగారించుకొని
మొలకలెత్తే కోరికల్ని కనుకొలకుల్లో పండించుకొని
మరదండ్ల సరసాలతో బావ నవరసాలు ఒలికిస్తుంటే-
ఊరిమిాది పండుగంతా మానట్టింట నడయాడినట్లుండేది!

కానీ ఈనాడు-
అరువులకని ఎరువులకని తనఖా తాకీదులకని
తల తాకట్టుపెట్ట లాంఛనాల తాంబూలాలతో తన
మునకలైన అయ్య
కొత్తబట్టల లంచాలతో కూతుర్ని అల్లుణ్ణి పిలిపించుకోలేక
కుమిలి కుమిలి మంచాన కూలబడిన తరుణంలో
ఉగాది ఎందుకు?

ఇప్పటికీ నా నోళ్ళంతా చక్కలి గింతలు పెట్టినట్లు పుల
కాంకిత మవుతుంది
ఉగాదినాడు ఊరికి దక్షిణంగా గుంట కట్టమీద
చీకూ చింతా లేకుండా చింతచెట్ల నీడక్రింద
ఆడిన గచ్చకాయలాట మనసులో సయ్యాటలాడినపుడు!
ఆ పండుగనాడు గురవున్న వానిదే పండుగ!
గెలుపు గచ్చకాయలు జేబులో పొంగి పొరలుతూ
ఓడిన జేబుల్ని వంకర చూపులతో గేలి పట్టించేవి.
మరి ఈ రోజుల్లో
తలకాయలు గచ్చకాయలయినాయి.
పదవి గురి అయింది.
పదవిని గురిగా పెట్టి ప్రతిరోజు పబ్లిక్‌గా ఆడుతున్నారు
తలకాయలాట
పదవి ఎంత పెద్దదయితే-గెలుపు అంత గొప్పది.
ఆ గెలుపుతో జీవితాలు తిరిగే మలుపు అంతకంటే గొప్పది.
డబ్బుతో ముడిపడ్డ తలకాయలాట ముందు
గడ్డిపరకకు కొరగాని గచ్చకాయలాట ఎందుకు?
ఉగాది ఎందుకు?-

ఇప్పటికీ నా వొళ్ళు గగుర్పొడిచి రోమాంచితమవుతూ
ఉంటుంది
ఆ దృశ్యం కనులముందు మెదలుతూ ఉంటే-
ఊరికి ఉత్తరంగా ముత్యాలమ్మ గుడికి పరుగు దూరంలో
పేదవాడి పేరాసలా విస్తరించిన మఱ్ఱిమాన్క్రింద
మాచెర్ల మరుగు జొచ్చినట్లుండేది!
కాళ్ళకు కత్తి గట్టిన కోళ్ళు కలబడి రోషంతో ఎగిరెగిరిపడి
తన్నుకొంటూ పొడుచుకొంటూ వుంటే-
చిందుతున్న నెత్తురు అందరికండ్లల్లో ఆనందాన్ని
చిందించేది!
ఆడేవాళ్ళు కొందరయితే పై పందెం పాట పాడేవాళ్ళు
కొందరు
ఊరిలోని ఉగాది మఱ్ఱిమాన్క్రింద మహారాణిలా
కొలువు తీరినట్లుండేది.
కానీ ఈరోజు-
ఉన్నవాడు లేనివానికి లేని పోని ఆశల కత్తిగట్టి
ఉసిగొలిపి ఊరి మీదికి వదలుతున్నాడు
నోరున్న కోళ్ళు కాలుగిరి రెక్కల తొడ తట్టుతూంటే -
జోరుమీది మనిం మీసం తెగదువ్వు తున్నాడు!
కనుల ముందు కమనీయంగా రోజు రాజుకొంటున్న
కలిగిన వాళ్ళ వేట ముందు -
ఎప్పుడో ఏడాది కొక్కసారి నోరులేని కోళ్ళ పందె
మెందుకు?

ఉగాది ఎందుకు?

దినమూ ఒక పండుగయినప్పుడు
ఉన్నవాడికి ఉగాది పండుగ ఎందుకు?
ఉచ్చిమీదికి బొట్టు చమురుకు నోచుకోలేనప్పుడు
లేనివాడికి ఉగాది ఎందుకు?



శ్రీ అవటపల్లి నారాయణరావు

# దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

ఇప్పటికి ముప్పైయేండ్లకు పైగా అవుతుంది. కీర్తిశేషులైన కోపల్లె హనుమంతరావు పంతులుగారున్ను,[1] ముట్నూరి కృష్ణారావు,[2] చిట్టా సుందరరామయ్య,[3] చిల్లరిగె శ్రీనివాసరావు,[4] కవుతా శ్రీరామశాస్త్రిగార్లున్ను,[5] నేనున్ను కలిసి సూరతులో జరుగుచుండిన కాంగ్రెసు మహాసభకు[6] బయలుదేరి, బొంబాయిలో సుప్రసిద్ధ భోజనశాల అయిన సర్దారు గృహంలో బస చేశాము. కారం, పులుసు, గోంగూర, పచ్చడి లేని మహారాష్ట్రుల చప్పిడి భోజనం మాకు రుచించిందికాదు. ఇట్లా తంటాలుపడే మమ్ములను చూచి జాలిపడి, "ఈ వూళ్లో మన బందరు వారే అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వున్నారు. మనం వారియింటికి వెళ్ళినట్లయితే వారు అన్ని సౌకర్యాలూ చేయిస్తారు. అక్కడకు వెళ్ళితే బాగా వుంటుం"దని హనుమంతరావుగారన్నారు. మేమంతా సరే అని, గిర్గాంలో వున్న నాగేశ్వరరావు పంతులుగారి బసకు బయలు దేరాము.

అహమ్మదాబాదు మిల్లుధోవతీ కట్టుకొని చిక్కని బనీయను తొడుక్కొని, మెడలో చిన్న రుద్రాక్ష తావళం వేసుకొనివున్న వొకవ్యక్తి చిరునవ్వు నవ్వుకొంటూ మాకు యెదురుగా వచ్చి స్వాగతమిచ్చారు. వారికి 35 సంవత్సరాల వయస్సుంటుంది, పసిమి వర్ణం, పలుచని శరీరం, చక్కని మీసకట్టు, మృదువైన చెక్కిళ్ళు విశాలమైన ముఖమండలం, దయనూ, కనికరాన్ని, శాంతాన్నీ, కోమల హృదయాన్నీ చూపే కన్నులు, పట్టుదలనూ, కార్యశూరత్వాన్నీ ప్రకటించే నిడివియైన ముక్కు గలిగి, తెలుగుతో మాట్లాడే దానికి ప్రారంభించిన వారిని చూడడంతోనే మా ప్రాణాలన్నీ లేచి వచ్చాయి. అప్పట్లో నాగేశ్వరరావు పంతులు గారింక ఆంధ్రపత్రికను స్థాపించలేదు. అమృతాంజనం వ్యాపారంకూడా భారీగా జరగడంలేదు. సామాన్యగృహస్థులుగానే వుండి, ట్రాములో ఆఫీసుకు పోతూ వస్తూ వుండేవారు. అయినప్పటికిన్ని అతిథిసత్కారంలో మాత్రం అప్పటిదానికిన్ని, చరమదశ నాటికిన్ని భేదం ఏమీ కనపడదు. ప్రొద్దున్నే మా అందరికీ వేన్నీళ్ళ స్నానం, వెన్నతో చేసిన బిస్కట్టు, చిక్కని పాలతో తయారైన కాఫీ ఏర్పాటు చేయించి, పదిగంటలకల్లా మంచి ఊరగాయలు, పిండివంటలు, కూరలు, అప్పడాలు, వడియాలు, వెన్న కాచిన నెయ్యి, తోడు పెట్టిన పెరుగు-యీ ప్రకారం మాకు భోజనాలు పెట్టించారు. సర్దారు గృహం భోజనంతో కారానికి మొగంవాచిన మేమంతా పంతులుగారు పెట్టించిన ఆవకాయ, మాగాయ జాడీలను సగం వంతు ఖాళీ చేసివేశాం. సూరతు వెళ్ళేరోజునా మా అందరకున్నూ ప్రత్యేకమైన విందుచేసి, దేశానికి వెళ్ళేటప్పుడు బొంబాయిలో దిగి తప్పకుండా తమ యింటికే రమ్మన్నారు. అయిదారేండ్ల తరువాత, అదృష్టవశాత్తు, పంతులుగారు 1908 సెప్టెంబరు 9వ తారీఖు బుధవారంనాడు బొంబాయిలో స్థాపించిన ఆంధ్రపత్రికకు నేను సంపాదకుడుగా వెళ్ళడం తటస్థించింది. వారు ఎవరు వుద్యోగానికి వెళ్ళినా ముందు తమ యింటిలోనే బసచేయించేవారు; తమ సహపంక్తిని భోజనాలు పెట్టించేవారు. ఈ ఆచారాన్ని అనుసరించి, నేనుకూడా వారి యింట్లోనే వొక నెలరోజులకు తక్కువకాకుండా భోజనం చేశాను. ఆ రోజులలో ఆంధ్రపత్రిక కార్యస్థానం అంతా రెండు చిన్న గదులలో ఇమిడివుండేది.

సంవత్సరాది సంచిక మూలంగా ఆంధ్రమండలంలోని ప్రముఖులతో పంతులుగారికి సన్నిహిత బాంధవ్యం కలిగింది. బొంబాయిలోనూ తెలుగువారు చాలామంది ఉన్నారు. అయితే, వీరంతా ఒకచోట కలుసుకోవడం గాని, మంచి చెడ్డలు మాట్లాడుకోవడంగాని లేవు. వీరందరినీ కూడగట్టుకొనిరాగల ప్రముఖుడున్నూ లేడు. ఇట్టి స్థితిలో బొంబాయి ఆంధ్రుల సమావేశంయొక్క ఆవశ్యకతను గ్రహించి, ముందుగా, కీర్తిశేషులైన గంటి లక్ష్మినరసింహంగారి[7] యింట్లో ఆంధ్రుల సమావేశం వొకటి పంతులుగారే ఏర్పాటు చేయించి, ఆ పిమ్మట నెలకొకరింట్లో ఇట్టి సాంఘిక సమావేశాలను జరిపిస్తూ వచ్చారు. ఒకటో రెండో సంవత్సరాది సభలు కూడా జరిగినాయి. కామాటి పురంలోని తెలుగువారితో సంబంధం కల్పించారు, ఈ విధంగా ఆంధ్రదేశం యొక్క భావ్య

భివృద్ధికి ఆధారమైన ప్రత్యేక రాష్ట్ర నిర్మాణం, ఆంధ్ర జాతీయాభిమానవ్యాప్తి మొదలగు గొప్ప సంకల్పాలన్నీ నాగేశ్వరరావు పంతులుగారు తమ వద్ద పనిచేస్తూ వచ్చిన అయిదార్గురు తెలుగు వారితోనే ప్రారంభించారు.

అయితే, నాగేశ్వరరావు పంతులుగారి సంకల్పాలు, ప్రజాభిమానం, కార్యదీక్ష విస్తరించిన కొద్దీ ఆంధ్రప్రాబల్యం లేని బొంబాయి నగరం వారికి సంకుచిత ప్రదేశంగా కనపడివుంటుంది. అందువల్ల, వారు తమ సంకల్పాలను సాధించే దారికై బెజవాడకు పోతే బాగావుంటుందా, లేకుంటే చెన్నపట్టణం అనుకూలంగా వుంటుందా అనే ఆందోళనలో పడి, దృష్టి బెజవాడమీదనే వుండినప్పటికీ రాజకీయ ప్రాముఖ్యంవల్లనూ, ప్రభుత్వంవారి ముఖ్యస్థానం కావడం చేతనూ, చివరకు తమకార్యరంగాన్ని చెన్నపట్టణానికే మార్చడానికి నిశ్చయించుకొని, ఆంధ్రపత్రికను, తమ కుటుంబాన్ని, మనుష్యులను అక్కడకు లేవదీసి, వార పత్రికతోపాటు, 1914 ఏప్రిలు 1వ తేదీని దైనిక పత్రికనుకూడా ప్రారంభించారు. అప్పట్లో ఆంధ్ర ప్రకాశిక8, శశిలేఖ9, కృష్ణాపత్రికలు10 తప్పితే చెప్పదగ్గ తెలుగుపత్రికలే అంతగాలేవు. ఆంధ్రపత్రిక దైనిక పత్రికగా మారడంతోనే ఆంధ్రోద్యమానికిన్ని, ఆంధ్ర జాతీయ భావ వికాసానికిన్ని నూతన జీవం, క్రొత్త తేజస్సు కలిగి, చీలికలు చీలికలుగాను, విడి విడిగాను, ఒకరియొక్క సంగతి ఒకరికి తెలియకుండాను వుండే మన ఆంధ్ర మహాజనులను దగ్గరగా చేర్చి, కొత్త ఆశలను, క్రొత్త అభిలాషలను పుట్టించి ఒక జాతిగా ప్రకాశించే దానికి కావలసిన దోహదానికి ప్రారంభం అయింది.

పంతులుగారి అంతస్తు యెంత పెద్దదో వారి కార్యశక్తి, ప్రజాభిమానం, సేవాభిలాష, క్రియాశక్తి—అంత పెద్దవి. పంతులుగారి పేరు వారి ఆంధ్రపత్రికా నిర్వాహకత్వం వల్లనే స్థిరంగా జ్ఞప్తియందుంచుకోబడగలిగివున్నా, ఈ మాత్రం పనిలోనే పంతులుగారికి తృప్తి కలుగలేదు. కొంచెం లోతుగా ఆలోచించి చూచినట్లయితే వారి సేవా విధానంలో ఒక గీత గీచి, 'దీన్ని దాటి పోగూడ'దనే ప్రసక్తే కనిపించదు. ప్రజా ప్రబోధానికై అధునికాంధ్రులలో యింత బాహుళ్యమైన కృషి చేస్తూ వున్నవారు మరి వొకరు వున్నారో లేదో, అనుమానం. ఆంధ్రగ్రంథమాల11 అనే పేరుతో, డబ్బు పెట్టి స్వయంగా అచ్చువేయించుకో శక్తిలేని యెందరో కవుల, యెందరో గాయకుల, యెందరో పండితుల, యెందరో విద్యాధికుల గ్రంథాలను వారు ఉచితంగా అచ్చు వేయించి యిచ్చినారు. కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు అసంపూర్తిగా వదలిపెట్టిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం యొక్క ప్రకటన భారాన్ని మీద వేసుకున్నారు. సుమారు మూడు సంవత్సరాలకు పైగా కృషిచేసి, ఆంధ్రసారస్వతం యొక్క విషయసూచికను ప్రకటించి తరతరాల పండితులకు, విద్యార్థులకు మహోపకారం చేశారు. భారతి మూలంగా మన మాసమున్నూ పండితులతో పరిచయం కల్పించి భాషా సేవచేశారు. ఆంధ్రపత్రిక, భారతి, విజ్ఞానసర్వస్వం, ఆంధ్ర గ్రంథమాల, ఆంధ్రవాఙ్మయసూచిక వీటిమూలంగా వారు చేసిన అఖండమయిన సేవను ఒక యెత్తుగాను, దాతలుగా, అన్నదాతలుగా చేసిన సేవను యింకొక యెత్తుగాను భావింపవలసి వుంటుంది.

పంతులుగారి దాతృత్వస్వరూపాన్ని గ్రహించాలంటే మన దృష్టిని కాస్త బెజవాడలోని శ్రీదుర్గా విలాసం మీదకున్నూ చెన్నపట్టణంలోని ఆంధ్ర పత్రికా కార్యాలయం మీదకున్నూ త్రిప్పవలసి వుంటుంది. బెజవాడలో ప్రొద్దుటిపూటను, చెన్న పట్టణంలో సాయంకాలమున్నూ పంతులుగారి దగ్గర నిలుచుండే సరి, శాలువలు కప్పుకొని కొందరు, ఖద్దరు టోపీలు పెట్టుకొని కొందరు, లాగులు వేసుకొని కొందరు, పుస్తకాలు చేతబట్టుకొని కొందరు, కన్నీరు కారుస్తూ కొందరున్నూ, యిండ్లుకట్టుకుంటున్నామనీ, పెండ్లి చేసుకుంటున్నామనీ, పుస్తకాలు అచ్చువేసేదానికి డబ్బులేదనీ, శరణాలయాలకనీ, విద్యాలయాలకనీ, సంతర్పణలకనీ, విదేశ ప్రయాణాలకనీ, పుణ్యక్షేత్రాలకనీ, స్కూలు జీతాలకనీ, యీ విధంగా మరి యెందరోనున్నూ, లోకంలో యెన్ని తరగతుల అవసరాలు, కష్టాలు, దుఃఖాలు, సుఖాలు వున్నవో అన్ని తరగతుల మనుష్యులున్నూ కనపడేవారు. ఎవరో అదృష్టహీనులు తప్ప ప్రతి మనిషిన్ని, అప్పుడు పంతులుగారి ఖజానాలో వుండే నిలువనుబట్టి, పదులు వందలు పట్టుకొని పోనివారులేరు. ఇవ్వడం అంటేను, భోజనం పెట్టడం అంటేను పంతులుగారికి ఒక విధమైన సంతోషం. అ యివ్వడంలో ఒక హద్దు లేదు, ఒక నిర్ణయం లేదు; తడుముకోవడంలేదు, సందేహించడం లేదు. అ రావడం, అ యివ్వడం అంతా ఒక మహాప్రవాహం ; దేశంలో పంతులుగారికన్నా భాగ్యవంతులు లేరా ? ఉన్నారు. అయితే భాగ్యానికిన్నీ దాతృత్వానికిన్నీ సంబంధం వున్నట్టు తోచదు. అన్ని గుణాలవలెనే యిదిన్నీ పుట్టుకతో యేర్పడే ఒక గుణం. ఈ గుణం పంతులుగారిలో అత్యధికంగా వుండడంవల్లనే వారు తమ ప్రియపుత్రిక శ్రీమతి కామాక్షమ్మగారి వివాహ సమయంలో సంచిలో చేయిపెట్టి చేతికి వచ్చినన్ని రూపాయలు పండితులకిచ్చివేయగలిగారు. నవరాత్రులలో బెజవాడలో జరుగు పూజలందు పండితులకు ధారాళంగా వెనక్కు తీయకుండా యిచ్చివేశారు.

**Statement about Ownership and other particulars about newspaper**

# BHARATI

Form IV (See Rule 8)

1. Place of Publication : Vijayawada
2. Periodicity of its Publication : Monthly
3. Printers Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes.
   Address : 8-2-322, Banjara Hills,
   Hyderabad - 500 034.
4. Publisher's Name : Sri S Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 8-2-322, Banjara Hills.
   Hyderabad - 500 034.
5. Editor's Name : Sri S Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 8-2-322, Banjara Hills,
   Hyderabad - 500 034.
6. Name - and address of individuals who own the newspaper and partners or share holders - holding more than one percent of the total capital :
   1. Name : S. Kamakshamma
      Address : 1, Luz Avenue.
      Mylapore, Madras - 600 004.
   2. Name : S. Radhakrishna
      Address : 8-2-322, Banjara Hills,
      Hyderabad - 500 034.
   3. Name : S. Nageswara Rao
      Address : 1. Luz Avenue,
      Mylapore, Madras - 600 004
   4. Name : S. Rajeswari,
      Address : 8-2-322, Banjara Hills,
      Hyderabad - 500 034.
   5. Name : S. Seshamma,
      Address : 1, Luz Avenue, Mylapore,
      Madras - 600 004.
   6. Name : S. Sreeramamurty, Trustee,
      Kasinaduni Nageswarao,
      Sivalenks Sambu Prasad
      Dharma Nidhi.
      Address : 41/45, Luz Church Road,
      Mylapore, Madras - 600 004
   7. Name : S. Ramayamma
      Address : 1, Luz Avenue, Mylapore.
      Madras - 600 004.
   8. Name : P. Satyanaryana
      Address : 183, 184, Rashtrapathi Road,
      Secunderabad.
   9. Name : D. Subba Rao
      Address : 1, Luz Avenue.
      Mylapore, Madras - 600 004.

I, S. Radhakrishna, hereby declare, that the particulars given above are true to the best of my knowledge and belief

**S. Radhakrishna,**
Signature of Publisher.

2—3—82


విశ్వదాత శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి దయాళుత్వాని కిన్నీ, దాతృత్వానికీన్నీ సంబంధించిన గాథ లెన్ని అయినా చెప్ప వచ్చును. ఏదో ఒక సందర్భంలో పంతులుగారొక వూరు వెళ్లారు. అక్కడ ఒక పెద్దమనిషి తాను మాత్రమే కాకుండా, తనభార్యనూ, నలుగురు పిల్లలనూ వెంట బెట్టుకొని పంతులుగారి బసకు వెళ్లాడు. వెళ్ళి, పంతులుగారి ఎదుటవారంతా కండ్లనీరు పెట్టుకోవడం మొదలు పెట్టారు. ఇట్లా కన్నీరు పెట్టుకొంటూ ఆయన భార్యా, పిల్లలూ రివ్వున పంతులుగారి పాదాలపైబడి అపురుమని యేడుస్తూ "అయ్యా, మీరు ఎందరికో ధర్మం చేస్తున్నారు, అన్నం పెట్టు తున్నారు, ఉద్యోగాలిస్తున్నారు, పోషిస్తున్నారు. మాకు అన్నం లేదు. చేతిలో చిల్లిగవ్వ లేదు. మాకు పట్టెడు అన్నం దొరికే మార్గం చూపిస్తారనే ఆశతో మీ పాదాలు పట్టుకొన్నాం. రక్షిస్తారా, రక్షిం చండి. లేదా, మమ్ము చచ్చిపొమ్మంటే చచ్చిపోతాం" అని ఆ ఆడ మనిషీ, పిల్లలు అనేటప్పటికి పంతులుగారు కూడా కంటనీరు పెట్టు కొని, "ఏం కావాలి, ఏం కావాలి" అని యెంతో ఆదుర్దాతో అడిగి, చివరకు వారు అడిగినది యిచ్చి పంపివేశారు.

మరొకసారి, ఒక విద్యార్థి పరీక్షకు రుసుము కట్టవలసి యుండి, ఒక పెద్దమనిషి దగ్గర సగము అప్పుతీసుకొని, మిగతా సొమ్ము కోసం బ్రహ్మ ప్రయత్నం చేశాడు. ఎక్కడా దొరకలేదు. చివరకా పెద్ద మనిషి దగ్గర నుంచే సిఫారసు వుత్తరం వ్రాయించు కొని పంతుల వారిని చూచాడు. ఆవుత్తరం చూచుకొని వారు నలభై రూపాయల కొరకు చీటీ వ్రాసియిచ్చారు. కుర్రాడు నిర్విణ్ణుడై పోయాడు. ఇరవై యిమ్మంటే నలభై యివ్వడం! పంతులుగారా సంగతి గ్రహించి "ఈ పైకం నాకు మళ్ళీ యివ్వనక్కరలేదు. ఈ వుత్తరం వ్రాసి యిచ్చినవారి పైకంకూడా యిప్పుడీయకు. నా పైకం సరేసరి, వారి పైకం పై ఖర్చులకూ వాడుకొని, యింటి దగ్గర నుంచి పైకం వచ్చిన తరువాత వారికియ్యి" అన్నారు. విద్యార్థినోట మాటరాక పంతులవారికి సాష్టాంగపడి ఆనందాశ్రువులతో వెళ్ళి పోయాడు.

నేను యెరిగినంతలో బహు ఆశ్చర్యమైన గాథ యింకొ కటి వుంది. ఆనాడు శనివారం. ఆరుగంటలయింది. ఇంటికి వెళ్ళే దానికై తంబుశెట్టి వీధిలో మోటారు సిద్ధంగా వుంది. తోలుసంచిలో కాగితాలు వేసుకొని లేవబోతున్నారు పంతులుగారు. ఇంతలో ఖద్దరుటోపీ పెట్టుకున్న ఒకాయన వచ్చి కుర్చీమీద కూర్చున్నాడు.

ఖద్దరు టోపీ మనిషి-అయ్యా....గారు ఇవ్వేళనే వచ్చారు. జ్వరంగా వుంది. రాలేకపోయారు. ఖర్చుకేమీ లేదు. మీతో చెప్పి, యేమైనా తీసుకొని రమ్మన్నారు.

పంతులుగారు—మంచిది. ఇప్పుడు యింటికివెళ్ళుతున్నాను. సోమవారం రండి.

ఖద్దరుటోపీ—ఎవరు వస్తారయ్యా సోమవారం మళ్ళీ? నాకు ఏమీ పనిలేదనుకున్నారా? యీ భాగ్యానికి తిప్పడం కూడా యెందుకు? అ యిచ్చేది ఏమిటో యిప్పుడే యివ్వరాదా, పోతాను.

పంతులుగారు—నాకష్టాలు మీకేమి తెలుస్తాయండీ? అంతా నన్నే పట్టుకొని పీక్కొని తింటామంటారు. ఇంటికిపోతూ వుండే సమయంలో ఇట్లావచ్చి తే, తే అంటే యెట్లా? సోమవారం నాకు రాకూడదా?

ఖద్దరుటోపీ—మీ కష్టాలకు నన్నేమి చేయమంటారు? మీరు నాకోసమే కష్టపడుతున్నారా? ఈ మాత్రానికి యిన్నిసార్లు తిప్పలా ఏమిటి? లేదని చెప్పరాదా, పోతాను.

పంతులుగారు మళ్ళీ మాట్లాడకుండా సొంత ఖర్చుకు తీసికొని పోతూవున్న సొమ్ములోనుండి కొంత సొమ్ము తీసి ఆయన చేతిలో పెట్టి "క్షమించండి" అని వెళ్ళిపోయారు.

పంతులుగారి సదుపాయం చూడకుండా అడిగేవారుయెందరో వున్నారు. ఇంటికి వెళ్ళే సమయమైనా సరే, కారులో వెళ్ళేటప్పుడైనా సరే, రైలుబండి యెక్కుతున్నప్పుడైనా సరే, యేవూరైనా సరే, పగలు రాత్రి అనే భేదం లేకుండా, వారి మనస్సునయినా కనిపెట్టకుండా, కఠినంగా మాట్లాడి, నిర్బంధంచేసి సహాయం పొందిన వారు యెందరో వున్నారు. ఇట్లా ఎందరు పీడించినా, తిప్పలు పెట్టినా పంతులుగారి మనస్సు మాత్రం యెప్పుడూ సంతోషంగాను, నిర్మలంగాను నిష్కళంకంగాను వుండేదేగాని అనుమానం, అసూయత కనపడేవికావు.

ఇక వారి అన్నదాన విషయంలోను, మిత్రుల ఆదరణ విషయంలోను యెంత చెప్పినప్పటికిన్ని తృప్తి తీరదు. బెజవాడలోని దుర్గావిలాసం యెప్పుడూ పచ్చతోరణాలు కలిగి పెండ్లిండ్లు వడుగులు, వేడుకలు మొదలయిన వాటికి సంబంధించిన వాద్యాలతో మ్రోగుతూనే వుంటుంది. పంతులుగారు అక్కడ వున్నప్పుడల్లా, యెంతమంది వచ్చినా సరే వారి సహపంక్తిని భోజనం చేయవలసిందే. పొయ్యిమీద బియ్యపు గుండిగ వుంచుతూనే వుంటుంది మధ్యాహ్నం పండ్రెండు గంటలదాకా. రాష్ట్రీయ సభలు వచ్చినా సరే, హరిజన సభలు వచ్చినా, యే సభలు వచ్చినా, వందలు వచ్చినా, వేలు వచ్చినా, భోజనపు ఖర్చు యెప్పుడూ పంతులుగారిమీదనే పడడం రివాజు అయిపోయింది. కరాచీకి, బొంబాయికి వెళ్ళే పెద్దలంతా బొంబాయిలో వారి అతిథులుగానే వుండి పిండివంటలతో సహా భుజించి వెళ్ళడం ఆచారమయింది. ఇక చెన్న పట్టణంలో పంతులుగారి 'శ్రీబాగ్' స్త్రీ పురుషుల కందరకూ అడ్డంలేని అతిథ్య క్షేత్రంగా వుంది. ఎక్కువ ఏ మూల ప్రదేశంలో జరిగే సభ కు పిలిచినా ప్రయాణపు ఖర్చులన్నీ తామే భరించి, పైగా అక్కడ అధమం నూరు రూపాయల కట్నమైనా యిచ్చిరావడం వారికి అభ్యాసమైంది. హరిజనోద్ధరణ విషయంలో పంతులుగారి తోడ్పాటే లేని యెడల యింత ప్రచారం, యింతపని ఒక్కనాటికీ జరిగివుండదు.

పరిసరాలు వ్యక్తులనెట్లా మార్చివేస్తాయో చూడాలంటే పంతులుగారినే నిదర్శనంగా చూపవచ్చు. బంగాళా విభజనానంతరం[12] బయలుదేరిన వుద్యమంలో నాటివాళ్ళకు దాదాభాయి[13], డిగ్బీ[14], దత్తు[15], వాచా[16], తిలక్కు[17] గార్ల రచనలు వేదప్రామాణ్యంగా వుండేవి. ఒకనాటి సాయంకాలం బొంబాయి హార్బరులో పంతులుగారూ, నేనూ ఒక చిన్న పడవలో షికారుకు బయలుదేరాము. నేను వున్నవాణ్ణి వుండకుండా హిందూదేశపు దారిద్ర్యం, కరవులు, ధనప్రవాహం, గృహపరిశ్రమల నాశనం వీటిమీద పడ్డాను. ఈ సంభాషణ అప్పట్లో వారి కంత సమ్మతంగా వుండినట్టు కనపడలేదు. వారి మనస్సుకు కొంచెం కష్టం తోపింపచేసినట్టు జ్ఞాపకం. ఆ తరువాత చెన్న పట్టణం చేరాము. అది రష్యా, జపాను యుద్ధసమయం.[18] ఒక రోజున రష్యా ప్రభుత్వపు ప్రజా పీడనానికి సంబంధించిన ఒక వ్యాసాన్ని 'నేషన్' పత్రిక నుండి భాషాంతరం చేసివేస్తిమి. దానిలో ఎక్కడనో ఒకచోట "యీలాటి ప్రభుత్వానికి అంగ్లేయ ప్రభుత్వం వారు తోడ్పడుతున్నా"రని ఒక ముక్క దొర్లిందని అప్పుడు పోలీసు కమీషనరుగా వుండిన అర్మిటేజిగారు పంతులుగారిని పిలిపించి హెచ్చరించి పంపారు. ఇది పంతులుగారికి కష్టంగా తోచింది. అప్పుడు కరుకైన తలకట్టులు పెట్టడంకూడా రాజద్రోహమే అన్నారు. ఆ రోజుల్లో పంతులుగారు ఖరీదుగల సూట్లు వేస్తూ అంగ్లేయ ప్రభుత్వం అంటేయెంతో అభిమానం కలిగివుంటూ వచ్చారు. అట్లాటి నాగేశ్వరరావు పంతులుగారు గాంధీమహాత్ముని వుద్యమంలో కొట్టుకొనిపోయి, ఆ సూటులను, అలాలిప్లీతువాళ్ళను, ఆ కూటికూరాది సోపులను ఒక తన్ను తన్నారు. గాంధీ వుద్యమంలోపడి ముతకబట్టలను కట్టారు. తమ ఆరోగ్యానికి భంగం కలుగుతుందేమో అనే ఆలోచనకూడా లేక వూరూరా తిరిగారు. ఈ వుద్యమ ఫలితంగా ఖద్దరువ్యాప్తికై ఆంధ్ర పత్రికాలయంలో స్థాపించిన స్టోర్సు వ్యవహారంలో వేల కొద్దీ హానించుకొని పోయినా మళ్ళీ మాట్లాడలేదు. కాంగ్రెసు వాఙ్మయోత్పత్తి నిమిత్తమై కొన్ని వేలతో స్థాపింపబడ్డ ముద్రా

లయంవారు చివరకు యినుపముక్కలను, పనికిరాని కాగితాలను చేతికిచ్చినా కిమ్మనలేదు. ఇక కాంగ్రెసు పక్షీయుల సహాయాని కనీ, వారి యెన్నికలలో ఖర్చులకనీ చేసిన వ్యయం యిప్పటికీ రహస్యగాథగానే వుంది. ఇట్లా ఆంధ్రోద్యమం, హరిజనోద్యమం, ఖాండాగారోద్యమం, కృత్తివెన్ను, సున్నంపాడు దేవాలయాలు, శ్రీశైల సోపానాలు, భద్రాచల విద్యుద్దీపాలు, కాంగ్రెస్సు మొదలగువాటి కెన్నిటికో అలివిగాని ఖర్చుచేస్తూ, సమస్త సదుద్యమాలకూ తోడ్పడుతూ, దేశహితైక కార్యాభిలాషులను పోషిస్తూ, తాము స్వయంగా వూరూరా ప్రజా ప్రబోధం చేస్తూ, చివరకు వుప్పు సత్యాగ్రహసమయంలో,19 మిక్కిలి అరోగ్యంగా వున్న సమయంలో జెయిలులోకూడా హర్చుండి వచ్చారు. జెయిలుకు పోయినా తమకు సహజమైన విందులు, సంతర్పణలు, బీదలకు సహాయం తప్పలేదు. చివరకు యీలాటి పరోపకారి జోలికి పోవడం మంచిది కాదని ప్రభుత్వ సభ్యులుగా వుండిన అనరబిలు క్యాంబెలుగారు నాగేశ్వరరావు పంతులుగారి జోక్యానికిక పోవద్దని తమ తోడి సభ్యులను హెచ్చరించినట్లుగా కూడ అప్పుడు చెప్పుకున్నారు.

దేశసేవా పరాయణులు, త్యాగమూర్తులు, దీనజనోద్ధారకులు అయిన దేశోద్ధారక, విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కడచిన ముప్పైయేండ్లనుండి చేస్తూవచ్చిన అఖండ సేవకుకృతజ్ఞతాసూచకంగా బెజవాడలోనూ20 రంగూనులోను మన ఆంధ్రులు చాలా గొప్పగా సన్మానం చేసి ధన్యులయ్యారు. కేంద్ర శాసనసభ యెన్నికలలో స్త్రీలు, పురుషులు. చిన్నలు, పెద్దలు అందరూ తమ ఓట్లను పంతులుగారికే యిచ్చి తమ పూజ్యభావాన్ని విశదీకరించారు. అధునికాంధ్రులలో నాగేశ్వరరావు పంతులుగారు చేసినంత సర్వతోముఖమైన సేవను యెవరూ చేసినట్లు తోచదు. స్వయంకృషి చేతనే, స్వసాహాయ్యం వల్లనే ద్రవ్యాన్ని ఆర్జించారు. ప్రజోపయోగం నిమిత్తమై ఆ ద్రవ్యాన్ని ధారాళంగా యిచ్చివేశారు.

ప్రస్తుతకాలపు సారస్వతంతో, సంస్కరణంలో, దేశకల్యాణ విషయంలో ప్రముఖ స్థానాన్ని వహించి, ప్రజల యొక్కయు, ప్రభుత్వం యొక్కయు గౌరవానికిపాత్రులై, దాతలై, దీనజన బాంధవులై, ఆశ్రితపోషకులై, దేశోద్ధారకులై ఆంధ్ర జాతీయ మూర్తిగా కీర్తివహించిన నాగేశ్వరరావు పంతులుగారు 1938-వ సం॥ ఏప్రిల్ 11వ తేదీని మృతి చెందినారు. దేశోద్ధారకుని మరణం చేత దేశం ఒక గొప్ప భక్తుని పోగొట్టుకొంది. ప్రజలొక గొప్ప దాతను, పరోపకార పారీణుని పోగొట్టుకొన్నారు.

## వివరణలు

శ్రీ అవటపల్లి నారాయణరావుగారి స్వస్థలం ఏలూరు. ముట్నూరి వారి సమవయస్కులు. పట్టాభిగారితో కలిసి ఏలూరులో సి.యం.యస్. హైస్కూల్లోచదివారుగాని మెట్రిక్యులేషన్ పరీక్షలో తప్పారు. 1906లో కృష్ణాపత్రిక సహాయ సంపాదకులు. తర్వాత ఆంధ్రపత్రికకు వెళ్ళి ప్రథమ సంపాదకులయ్యారు. 1915-16లో నాగేశ్వరరావుగారి సాయంతో అమెరికా పోయి ఎం. ఏ. పట్టా పొంది వచ్చారు. బర్మాకు వెళ్ళి తెలుగు కూలీల దురవస్థలను తొలగించేందుకు కృషిచేశారు. బర్మాశాసన సభకు రెండుసార్లు ఎన్నికయ్యారు. 1929 ప్రాంతంలో తిరిగి వచ్చి నాగేశ్వరరావు గారికీ కృష్ణారావుగారికీ సన్మానాలు చెయ్యడానికి కారణ భూతులయ్యారు. 'విశాలాంధ్రము' రచించారు. మళ్ళీ బర్మా వెళ్ళి ప్రభుత్వం నియమించగా శాసన సభ్యులై వుంటూ, రెండో ప్రపంచ యుద్ధకాలంలో జపాన్ సేనలు రంగూన్‌ను పట్టుకొనే ముందు స్వదేశం వచ్చారు. బర్మా ప్రవాస ప్రభుత్వ స్థానమైన సిమ్లాలో కాందిశీకుల రక్షణకు ఉద్యోగిగా ఉండి, వ్యాధిగ్రస్తులుకాగా, బెజవాడకు వచ్చి 1945లో మరణించారు. "నారాయణరావుగారు ఆంధ్ర పత్రికా ప్రపంచపు అది పురుషులలో నొకరు." (పట్టాభి)

1. కోపల్లె హనుమంతరావు బందురులో పట్టాభికీ ముట్నూరికీ మిత్రులు. వృక్షశాస్త్రం పఠించి 1893లో బి. ఏ., పరీక్షనెగ్గి ఊటీలో అసిస్టెంట్ కన్సర్వేటర్ అఫ్ ఫారెస్ట్స్‌గా రెండేళ్లు పని చేసి, 1904లో బందరు వచ్చారు. బి. యల్. పరీక్ష నిచ్చారు గాని ప్రాక్టీసు చెయ్యలేదు. 1911లో ఆంధ్ర జాతీయ కళాశాలాస్థాపనకు సారథ్యం వహించారు. కళలూ శాస్త్రీయా ప్రోత్సహించారు. నలభై రెంటో యేటనే 1922 ఫిబ్రవరి 2న మరణించారు.

2. ముట్నూరి కృష్ణారావుగారు 1906 నుండి, మధ్య మధ్య కొద్ది కాలంలో తప్ప, కృష్ణాపత్రికా సంపాదకులు. తాత్వికులు, మహాశయులు.

3. చిట్టా సుందరరామయ్య బందరు వకీలు. బహుగ్రంథ పారంగతుడు. 'కృష్ణాపత్రిక; రచన సందర్భంలో ముట్నూరినీ, 'జన్మభూమి' నిర్వహణంలో పట్టాభిని "సజీవ నిఘంటువు"గా వుపయోగపడేవారని చెరుకువాడ వెంకట నరసింహం వర్ణించారు.

4. చిల్లరిగె శ్రీనివాసరావుది కూడా బందరే. చిట్టా సుందర రామయ్యగారిదికూడా. వారిద్దరూ పౌరప్రముఖులు, జాతీయవాదులు.

5. కొత్తా శ్రీరామశాస్త్రి వెలుగులోకిరాని విశిష్ట వ్యక్తి. జాతీయ కళాశాల స్థాపన భావం వీరిదే. గుంటూరుజిల్లానుండి 1903-04 ప్రాంతంలో బందరు వచ్చారు. ఇంగ్లీషు చదువులేమోగాని బెంగాలుకు వెళ్ళి బెంగాల్ భాష నేర్చుకుని వచ్చి చాలా అనువాదాలు చేశారు. 'శారద' పత్రిక నడిపారు. 'స్వరాజ్యసుత' నిర్వహించేవారు. కాలంకారీ అద్దకానికి అపూర్వమైన ప్రోత్సాహమిచ్చి పునరుద్ధరించారు. ప్రతిసభలోనూ 'వందేమాతరం' గేయాలాపనతో సభ్యుల నుత్తేజ పరిచేవారు. వచన రూపంలో హరికథలు చెప్పేవారు. తాను వైదిక బ్రాహ్మణుడై నియోగి బ్రాహ్మణ వితంతువును పెళ్ళాడారు. వారి పుత్రులు ప్రఖ్యాత చిత్రకారులైన ఆనంద మోహన్, రామ్‌మోహన్‌శాస్త్రి. పుత్రిక ప్రఖ్యాత చరిత్ర పరిశోధకురాలు వారణాసి యశోదాదేవి. శ్రీరామశాస్త్రి చివరిరోజులలో బందరు విడిచి వెళ్ళారు. శ్రీరామశాస్త్రి కృష్ణా స్వదేశీ ఇండస్ట్రియల్ కంపెనీ పెట్టారు. ప్రావిడెంటు కంపెనీలో వచ్చిన పదివేల రూపాయలను జాతీయకళాశాలకు మూల నిధిగా ఇచ్చారు. ఆంధ్రి భాషాభివర్ధనీ సంఘం నడిపారు.

---



6. సూరత్ కాంగ్రెసు 1907లో జరిగింది. కాంగ్రెసులోని 'మిత'వాదుల ప్రాబల్యాన్ని తిలక్, అరవిందులు ప్రతిఘటించి, సభాధ్యక్షుడుగా బెంగాలీ బారిస్టరు రాస్ బిహారి ఘోష్‌కు పోటీగా లాలా లజ్‌పత్‌రాయ్‌ని నిలిపారు గాని ఆయన ఉపసంహరించుకున్నారు. అధ్యక్షోపన్యాసానికి తిలక్ ప్రవేశపెట్టిన వివరణ తీవ్రమైన వాగ్వాదాలకే గాక దెబ్బలాటకు గూడా దారితీసింది. ఆ సభ తర్వాత 'అతి'వాద నాయకులపై బ్రిటిష్ ప్రభుత్వం దండ నీతిని ప్రయోగించిన ఫలితంగా కాంగ్రెసు 'మిత'వాదులకై వశమైంది. 1916 లో అనీ బిసెంటు అందరినీ కలిపేదాకా వీరి మధ్య సఖ్యత, సద్భావం లేవు. ఈ సభ కాంగ్రెసు చరిత్రలో ఒక ముఖ్య ఘట్టం.

7. గంటి లక్ష్మినరసింహం - గంటి లక్ష్మన్న వీరేనా? అయితే రాజమండ్రిలో ప్లీడరు. 'బాల భారతీ సమాజ' అధ్యక్షుడు. 'వందేమాతరం' ఉద్యమంలో తీవ్రంగా పాల్గొన్నాడు. లేక, బొంబాయిలో పైకివచ్చిన డాక్టరు గంటి సూర్యనారాయణగారిని యిలా భ్రమపడ్డారా?

8. ఆంధ్రప్రకాశిక - ఏ పి. పార్థసారథి నాయుడు (1848-1928) మద్రాసు నుండి నలభై సంవత్సరాలపాటు నడిపిన వారపత్రిక.

9. శశిరేఖ - గట్టుపల్లి శేషాచార్యులు మద్రాసునుండి నడుపుతూ వచ్చిన పత్రిక.

10. కృష్ణాపత్రిక - గుంటూరు వేరే జిల్లా గాకముందు ఉభయ ప్రాంతాలకూ కలిసి 1892 నుండి జిల్లా సంఘం వుండేది. సంఘ సంస్కరణ, చేతి పరిశ్రమలు, రైతు కష్టసుఖాలు పట్టించుకునేది. 1900 లో ఈ సంఘ సమావేశానికి అధ్యక్షత వహించిన రెంటాల వెంకట సుబ్బారావు, దీని ఆశయ ప్రచారానికి పత్రిక అవసరం సూచించి, నూరు రూపాయలు విరాళం యిచ్చారు. పౌర ప్రముఖులూ యిచ్చారు. ఫలితంగా 1902 ఫిబ్రవరి 1న పత్రిక మొదలైంది. కొండ వెంకటప్పయ్య, దాసు నారాయణరావు సంయుక్త సంపాదకులు. మొదట పక్షపత్రికగా నడిచింది. మద్రాసులో అచ్చుపడి వచ్చేది. 1905 లో గుంటూరుజిల్లా ఏర్పడ్డాక కొండవారు గుంటూరుకు పోవడంతో, 1903 లోనే దాసు నారాయణరావు మరణంతో, సహాయ సంపాదకులుగా 1903 నుండి పని చేస్తూ వచ్చిన ముట్నూరి కృష్ణారావు 1907 నాటికల్లా పత్రికాబాధ్యత చేపట్టారు గాని, 1908 లో 'తెల్లవారిని తుపాకులతో కాల్చుట' అనే వ్యాసాన్ని రాసి ప్రకటించిన ఫలితంగా కలెక్టర్ స్కాట్ బెదరింపుతో, ప్లీడరు సి. వి. రామాచారి పేరిట పట్టాభి మూడేళ్ళు నిర్వహించి 1911 లో కృష్ణారావుకు అప్పగించారు. 1930 ఉప్పు

సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళాక, కోట సుబ్బారావు మూడేళ్ళు, 1933 నుంచి కమలాకర వెంకటరావు నిర్వహించారు. 1935 లో మళ్ళీ కృష్ణారావు పత్రికను చేబట్టి 1945 జూన్ 23 దాకా నడిపారు. ఆయన మరణానంతరం, వీలునామా ప్రకారం కాటూరి కొంతకాలం విడిగా, కోలవెన్ను రామకోటేశ్వరరావుతో కలిసి కొంతకాలం, కమలాకర వెంకట్రావుతో కలిసి మరికొంతకాలం సాగించారు. ఆ తర్వాత ఆర్. వి. యల్. నరసింహారావు యాజమాన్యంలో కమలాకర వెంకట్రావు సంపాదకులుగా ఆరేళ్ల నడిచింది. ముట్నూరి మనుమడు రామకృష్ణరావు ఒక సంవత్సరం నడిపారు. వి. వై. యల్. నరసింహారావు కొంతకాలం మద్రాసులో పెట్టారు. చివరకు ముదిగొండ సుబ్రహ్మణ్యశాస్త్రి చేతికి వచ్చింది.

11. ఆంధ్ర గ్రంథమాల: 1926 లో స్థాపన. బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర, భగవద్గీతా వ్యాఖ్యానము వగైరా పుస్తకాలను ప్రకటించింది.

12. లార్డ్ కర్జన్ వైస్రాయిగిరిలో జరిగింది (1905). పరిపాలనా సౌలభ్యం కోసం అని పైకి చెప్పినా, జాతీయవాదులు ప్రబలంగా వున్న పశ్చిమబెంగాలు ప్రాంతంనుంచి ముస్లిములు అధిక సంఖ్యలోవున్న తూర్పుబెంగాలు ప్రాంతానికి ఉపరాష్ట్ర ప్రతిపత్తి ఇచ్చారు. లార్డ్ హార్డింజ్ రద్దు చేసేదాకా (1911) బెంగాలు సమైక్యత కోసం 'వందేమాతరం' ఉద్యమం సాగింది.

13. దాదాభాయి నౌరోజీ జాతీయోద్యమంలో 'కురువృద్ధుడు'- Grand old Man of India (1825-1917). జ్ఞాన ప్రసారక మండలి, బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్ వంటి సంస్థలలో పనిచేసి 'రస్ గోఫ్తార్' పత్రిక పెట్టి, ఇంగ్లాండులో కొంతకాలం పత్తివ్యాపారము చేశాడు. గాంధీలాంటి భారతీయ విద్యార్థులకు అక్కడ పితృతుల్యుడుగా వుంటూ లండన్ ఇండియా సొసైటీ స్థాపించి జాతీయోద్యమంపట్ల బ్రిటీష్ లిబరల్సునూ, సోషలిస్టులనూ సమీకరించాడు. బ్రిటీష్‌పాలన దేశసంపదనెలా హరిస్తుందో గొప్ప గ్రంథం-పావర్టీ ఎండ్ అన్ బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా (1880)లో వర్ణించాడు. బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయ్యాడు. తొలి కాంగ్రెస్ సమావేశంలో పాల్గొన్నాడు. అనేక పర్యాయాలు కాంగ్రెసు అధ్యక్షుడుగా వ్యవహరించిన నౌరోజీ, దేశానికి అధినివేశ రాజ్యాంగ ప్రతిపత్తిని కోరిన రాజభక్తుడు.

14. సర్ విలియండిగ్బీ - భారత జాతీయతాభిమానులైన ఆంగ్లేయులలో ఒకడు. నౌరోజీతో కలిసి భారతదేశ దోపిడీగురించి ప్రచారం చేశాడు. కాంగ్రెస్ పక్షాన ఇంగ్లాండులో బ్రిటిష్‌కమిటీ సూపర్నెంటుగా పనిచేశాడు. నౌరోజీతో కలిసి ఇండియా గ్రంథం రచించాడు. చిన్న చిన్న గ్రంథాలెన్నో రచించాడు.

15. రమేశ్ చంద్రదత్ - ఐ. సి. యస్. అధికారి అయినా, ది ఎకనమిక్ హిస్టరీ ఆఫ్ ఇండియా రెండు సంపుటాల గ్రంథంలో బ్రిటిష్ పాలనలోని ఆర్థిక అక్రమాలు నిరూపించిన మేధావి. సాహిత్య పుత్రుడుకూడా. బెంగాలీభాషలోకి ఋగ్వేదం అనువదించాడు. నవలలు రాశాడు. వాటిలో ఒకదాన్ని 'సుధాశరచ్చంద్రీయం' పేర చిలకమర్తి తెలుగు చేశారు. ఇంగ్లీషులో మహా భారత, రామాయణాలను కావ్యాలుగా వ్రాశాడు. చాలా కాలం కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి.

16. సర్ దిన్షా వాచా- కాంగ్రెసు మితవాద నాయకులలో ఒకరు. జాతీయ ఆర్థిక దోపిడీ గురించి అధ్యయనంచేసి రాశారు. 1901 కలకత్తా కాంగ్రెసు అధ్యక్షులు. తర్వాత కేంద్ర శాసనసభలో 'నామినేటెడ్' సభ్యుడు.

17. 1904లో మొదలై ఒక సంవత్సరం సాగిన యీ యుద్ధంలో కొత్తగా పైకి వచ్చిన, చిన్న ఆసియాదేశం జపాన్ మహాసామ్రాజ్యమైన రష్యాను పూర్తిగా ఓడించింది. ఇది ఆసియన్లందరినీ పుత్తేజపరచింది. ఆంధ్రదేశంలో 'జపాను విజయము' అనే పుస్తకాలు రావడం మొదలుపెట్టి, మునగాల రాజావంటివారు తమ బిడ్డలకు జపాన్ సైనిక, నావిక దళాధిపతుల పేర్లు పెట్టే దాకా వెళ్ళింది. కొందరు యువకులు జపానుకు కొవ్వొత్తులు తయారు చేసే విద్య నార్జించడానికి వెళ్ళారు కూడా.



# శి వ రా త్రి

## శ్రీ శనగన నరసింహస్వామి

శివ ! శివా ! యంచు ఈవాడె చెదరిపోవు
నంట భువనమ్ము వెరపించు తుంటరి చలి-
హర !భవా ! యంచు భర్గాలయాంగణమున
విరమణము లేక జయఘంట మొరయునంట.

ఈ మహా శైవయామిని-ఈ జగజ్జ
నైక జాగరవేళ మదాత్మవీధి
అవధి యెరుగని సివమెదో యావహించి
ఒక్కసారిగ తనువెల్ల నూగిపోవు !

అహహ ! మెయినిండ భసితంబు నలదినట్లు
అలిక తలమున నయనమ్ము మొలిచినట్లు
నిశిత శూలము ముంగేల నిలిచినట్లు
క్రందుకొనె భ్రాంతి యీ పుణ్య కాలమందు.

తిరిగి నానేమొ పూర్వమశ్శరభ ! శరభ !
వీరవాక్కుల బసవేశు వెనుక నేను-
పాల్కురికి సోమనాథుని బంటులందు
నేను నొక్కండనై పుట్టినానొ యేమొ !

ఎదియొ నిగదింప బోవుదు-నెట్లొ నాట్య
మాడబోవుదు-నెలుగెత్తి పాడబోదు-
ఈ యపూర్వ ప్రమోదము నెటు భరింప
గలనొ ! యేవగ కన్నీరు నిలుపగలనొ !

~~~~~~

# ఈ చీ క టి.......

## శ్రీ వి. సంపత్కుమారాచార్య

ఈ చీకటి ఎంత హాయిగా తియ్యగా ఉంది !
దూరాన మినుకు మిణుగురు గుడ్డిదీపం
మూల్గుతోందన్న మాటే గాని !....
ఈ చీకట్లో ఎంత జీవితం కనిపిస్తోంది !!....
ఇంతసేపూ పచ్చి వెలుతురుని మింగి జీర్ణించుకుని
ఊపిరాడని నాకు....
ఈ చీకట్లో ఎంత విశ్రాంతిగా ఉంది !!....
ఈ నిద్రొకటి....పట్టినట్టేపట్టి పట్టు విడుస్తూంటుంది.
ఆ కాస్త విరామంలోనే
ఏ నాటిదో లోతులేని అమాయకపు పాత లేత గుండెలో
ఆశల స్పందనలనీ....ఆశయాల సంపదలనీ గుర్తుకి తెస్తూ
నాకే తప్ప వినిపించని గతకాలపు తీపి లాలిపాటపాడుతూ
ఈ చీకటి ఎంత హాయిగా తియ్యగా ఉంది !!
కనిపించని ఆకాశంతో కలిసిపోయిన కొండల్నీ
ఎగుడుదిగుడు అనుగతాన్ని కవ్వించే గతాన్నీ
కలబోసిన కలలమధ్య
ఈ చీకటి ఎంత రిలీఫ్‌గా ఉంది !!
పగలంతా నోరులేని కీచురాయినైన నేను
ఇప్పుడెంత తియ్యగా పాడుకుంటున్నాను !!
అదేమిటి ! దూరంగా ??
తలుపు సందుల్లోంచి
తెల్లటి సూది బాణాలు వేస్తున్నారెవరో !!
ఎందుకయ్యా మీ ఎదలో ఇన్ని పగలు ?
ఎందుకయ్యా నా నెత్తిని రుద్దుతారు మళ్ళీ ఈ పగలు ??


~~~~~~

శ్రీ బులుసు వేంకట రమణయ్య

# పారిజాతాపహరణం - విభిన్న కథనాలు

నరకాసుర వధానంతరం శ్రీ కృష్ణుడు సత్యభామతో కూడా స్వర్గ లోకానికి వెళ్ళి అక్కడి నందనవనంలో ఉన్న పారిజాత వృక్షాన్ని అపహరించి భూలోకానికి తీసుకొని వచ్చినట్లు శ్రీకృష్ణుని కథలను ఎరిగినవారి కందరికీ తెలుసును. కాని యీ కథ అన్ని గ్రంథాలలోనూ ఒక్కరీతిగా లేదు.

ఇతర గ్రంథాల కంటె ప్రాచీనమైన విష్ణుపురాణంలో ఈ కథ క్రింది విధంగా కానవస్తున్నది.

నరకుడు దేవతలను పెక్కు విధాల హింసించడమే కాకుండా ఇంద్రుని తల్లి అయిన అదితిదేవి కుండలాలను అపహరించాడు. ఇంద్రుని ప్రార్థనను అనుసరించి శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి సంహరించి, ఆ రాక్షసుడు అపహరించిన కుండలాలను అదితికి ఇవ్వడానికి స్వర్గలోకానికి వెళ్ళాడు. అతని వెంట సత్యభామకూడా వెళ్ళినది. కుండలాలు స్వీకరించి అదితి శ్రీకృష్ణుని పొగడినది. ఇంద్రుడు, శచీదేవి ఆ దంపతులను మిక్కిలి గౌరవించారు. సత్యభామ శచీదేవి దగ్గర ఉన్నప్పుడు, ఒక్క పుష్పమయినా సత్యభామకు ఇయ్యకుండా పారిజాత పుష్పాలు అన్నిటినీ శచియే తలలో ముడుచుకొన్నది. తాను మనుష్యస్త్రీ అయినందున తనకు ఆ పారిజాతాలు ఇవ్వలేదని సత్యభామ సూక్ష్మంగానే గ్రహించింది. సత్యభామకు శచీదేవిపై కోపం కలిగినా, దాన్ని ప్రకటించలేదు. ఆమె కృష్ణునితోకూడా నందనవనంలోని పారిజాతం వద్దకు వెళ్ళినప్పుడు, శచీదేవి చూపిన తిరస్కార భావానికి తగిన ప్రాయశ్చిత్తం చెయ్యాలనే సంకల్పం కలిగినట్లున్నది ఆమెకు. అప్పుడు ఆమె శ్రీకృష్ణునితో ఇలా అన్నది:

"నాథా! ఈ పారిజాత వృక్షాన్ని ద్వారకకు ఎందుకు తీసుకొని పోకూడదు? దీనిని నా భవనపు పెరటి తోటలో నాటవలెనని నా కోరిక. మీరు ఎన్నోసార్లు రుక్మిణి, జాంబవతి మొదలైన భార్యలకంటె నీ యందే నాకు ప్రేమ ఎక్కువ అని చెపుతూ వచ్చారు. అని నా ముఖప్రీతికోసం అడిన మాటలు కాకపోతే యీ చెట్టు నా గృహవనానికి అలంకారంగా ఉండవలసినదే! ఈ పారిజాత పుష్ప గుచ్ఛాన్ని తలలో ధరించి సవతుల మధ్య శోభించగలను" అని గట్టిగా చెప్పింది. శ్రీకృష్ణుడు పారిజాత వృక్షాన్ని పెల్లగించి గరుడుని పైపెట్టి, భూలోకానికి రావడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు వన పాలకులు అతనిని అడ్డగించారు. ఆ సమయంలో సత్యభామ "ఈ పారిజాతం సముద్ర మథన సమయంలో ఉద్భవించింది. దీనిమీద ఇంద్రునికి గాని, శచికి గాని ఉండే అధికారం ఏమిటి? ఇది సర్వజన సామాన్యమైనది. అందరికీ దీనిపై హక్కు ఉన్నది. ఇంద్రుడు ఒక్కడూ హక్కుదారుడుకాడు" అని వారితో వాదించినది.

తర్వాత ఇంద్ర ఉపేంద్రులకు జరిగిన యుద్ధం, ఇంద్రుని పరాజయం, శ్రీకృష్ణునికి పారిజాత ప్రదానం విష్ణుపురాణంలోనే కాక తదితర గ్రంథాలలోకూడా కానవస్తున్నది. పయి విషయాలను తెలియజేసే శ్లోకాలు విష్ణు పురాణంలో ఈ క్రింది విధంగాఉన్నవి.

"స దేవైః రర్చితః కృష్ణో దేవమాతుర్నివేశనమ్
సితాభ్ర శిఖరాకారం ప్రవిశ్య దదృశేఽదితిమ్
స తాం ప్రణమ్య శక్రేణ సహ తే కుండలోత్తమే
దదౌ నరకనాశం చ శశంసాస్యై జనార్దనః.

(విష్ణు పురాణం. 5వ అంశం. అధ్యా 30. శ్లో. 3,4)

శచీచ సత్యభామాయై పారిజాతస్య పుష్పకమ్
న దదౌ మానుషీం మత్వా స్వయం పుష్పైరలంకృతా. (శ్లో. 29)

పారిజాతం జగన్నాథః కేశవః కేశిసూదనః.
తుతోష పరమప్రీత్యా తరురాజ మనుత్తమమ్.

తం దృష్ట్వా ప్రాహ గోవిందం సత్యభామా ద్విజోత్తమ.
కస్మాన్న ద్వారకా మేష నీయతే కృష్ణ! పాదపః,
యదిచే త్త్వద్వచః సత్యం త్వమత్యర్థం ప్రియేతి మే
మద్గేహ నిష్కుటార్థాయ తదయం నీయతాం తరుః.
న మే జాంబవతీ తాదృ గభీష్టా న చ రుక్మిణీ,
సత్యే! యథా త్వమిత్యుక్తం త్వయా కృష్ణాసకృత్ ప్రియమ్
సత్యం తద్యది గోవింద! నోపచారకృతం మమ
తదస్తు పారిజాతోఽయం మమ గేహ విభూషణమ్
బిభ్రతీ పారిజాతస్య కేశపక్షేణ మంజరీమ్
సపత్నీనా మహం మధ్యే శోభేయ మితి కామయే
ఇత్యుక్తః సప్రహస్యైనాం పారిజాతం గరుత్మతి,
ఆరోపయామాస హరిః.......... (శ్లో. 32-38)

కా శచీ పారిజాతస్య కో వా శక్రః సురాధిపః
సామాన్యః సర్వలోకస్య యదేషోఽమృతమంథనే
సముత్పన్నస్తరుః కస్మాదేకో గృహ్ణాతి వాసవః, (46-47)

మహాకవిశేషం. ఆ సమయంలో తనకు శ్రీకృష్ణుడు దన్నుగా ఉన్నాడని ధైర్యం వహించి, తన్ను మానవస్త్రీగా ఎంచి తిరస్కార భావం చూపిన శచీదేవిపై అక్కసు తీర్చుకుంటూ ఆ వనపాలకులతో "తన భర్త భుజపరాక్రమాన్ని చూచుకొని ఇంద్రాణి మమ్ము అడ్డుకొంటున్నదా ? అలా అయితే మీరు వెంటనే ఆమె వద్దకు పోయి, శ్రీకృష్ణుణ్ణి సత్యభామ ప్రోత్సహించి, పారిజాతాన్ని అపహరింపజేస్తున్నదని చెప్పండి. మగనికి నీపై ఎక్కువ ప్రేమ వుంటే, అతడు నీకు వశవర్తి అయివుంటే, నా భర్త యీవృక్షాన్ని అపహరించకుండా అడ్డుకొమ్మనీ, దేవతల రాజైన ఇంద్రుని సంగతీ సత్యభామకు తెలుసుననీ, మానవస్త్రీ పారిజాతాన్ని అపహరింపజేస్తున్నదనీ నా మాటగా ఆ శచితో చెప్పండి అని ధీమాగా అన్నది.

ఈ సందర్భంలో ఉన్న శ్లోకాలివి-

భర్తృబాహు మహాగర్వాత్ రుణద్ధ్యేన మథో శచీ,
తత్కథ్యతా మలం క్షాంత్యా సత్యా హారయతి ద్రుమమ్,
కథ్యతాం చ ద్రుతం గత్వా పౌలోమ్యా వచనం మమ
సత్యభామా వదత్యేతదితి గర్వోద్ధతాక్షరమ్.
యదిత్వం దయితా భర్తుర్యది వశ్యః పతిస్తవ,
మద్భర్తుర్హారతో వృక్షం తత్కారయ నివారణమ్.
జానామి తే పతిం శక్రం జానామి త్రిదశేశ్వరమ్
పారిజాతం తథాప్యేనం మానుషీ హారయామితే. (శ్లో 49-52)

విష్ణుపురాణంలో పారిజాతకథ యింత విపులంగా ఉండగా భాగవతంలో మాత్రం చాలా సంగ్రహంగా ఉన్నది.

"శ్రీకృష్ణుడు భార్య అయిన సత్యభామతో కూడా ఇంద్రలోకానికి వెళ్ళి అదితికి ఆమె కుండాలను సమర్పించాడు. ఇంద్రుడు-ఆయన భార్య, సత్యభామా శ్రీకృష్ణులను గౌరవించారు. తర్వాత శ్రీకృష్ణుడు భార్య ప్రేరితుడై పారిజాత వృక్షాన్ని పెల్లగించి, గరుడునిపై పెట్టి, యుద్ధానికి వచ్చిన ఇంద్రాది దేవతలను ఓడించి, తన పట్టణానికి వచ్చాడు. అక్కడ సత్యభామ యింటి తోటలో ఆ వృక్షాన్ని నాటాడు" అని మాత్రం ఉన్నది.

అక్కడి శ్లోకాలివి-
"గత్వా సురేంద్రభవనం దత్త్వాదిత్యైచ కుండలే,
పూజిత త్రిదశేంద్రేణ సహేంద్రాణ్యా చ సప్రియః,
చోదితో భార్య యోత్పాట్య పారిజాతం గరుత్మతి,
ఆరోప్య సేంద్రాన్ విబుధాన్ నిర్జిత్యోపాగమత్పురమ్.
స్థాపితః సత్యభామాయాః గృహోద్యానోపశోభనః"

(భాగవతం, దశమస్కంధం-ఉత్తరభాగం, సర్గ 59 శ్లో 38-40)

13వ శతాబ్ది చివరను, 14వ శతాబ్ది ప్రారంభంలోను ఉండిన అగస్త్య పండితుడు రచించిన కృష్ణ చరిత మనే గద్యకావ్యంలో పారిజాతాన్ని అపహరించే వరకూ కథ భాగవతంలో ఉన్న విధంగానే ఉన్నది. ఆ తర్వాత మాత్రం విష్ణుపురాణ పద్ధతిలో ఉన్నది. ఇందులో వనపాలకులుకాక వనపాలికలు అటంక పరుస్తారు. అప్పుడు సత్యభామ వారితో పలికిన మాటలివి-

"కా నామ శచీ, కో వా దేవాధిపోఽపి, లక్ష్మీసుధాహరిణలక్ష్మవ దఖిల లోక సాధారణస్య పారిజాతస్య శాఖినః కిం చ మద్వచనా దిత్యుచ్యతాం శచీ, యది త్వం మరుత్వతః ప్రియతమా, స చ తే వశంవదశ్చేత్ మయామునా యదువరేణ హార్యమాణ మమరద్రుమ మిమం ఝటితి సజ్జనిర్జర బలాన్వితేన వజ్రిణా తేన వారయతు భవతీ." (పుట 112)

"లక్ష్మియు, అమృతమును, చంద్రుడును సర్వలోక సామాన్యంగా ఉన్నట్లే యీ పారిజాత వృక్షంకూడా అందరికీ చెందినదే దీనిమీద శచికిగాని, ఇంద్రుడికిగాని ఉన్న అధికారం ఏమిటి ? నా మాటగా మీరు ఆమెతో ఇలాచెప్పండి- "నీవు ఇంద్రుడికి అత్యంత ప్రియురాలవు అయినట్లయితే, అతడు నీకు వశమై వుంటే అతణ్ణి దేవసైన్యంతో కూడా పంపి, నా ప్రేరణవల్ల ఈ వృక్షాన్ని అపహరిస్తున్న కృష్ణుణ్ణి అడ్డుకో" అని మయిదాని అభిప్రాయం, విష్ణుపురాణంలో కూడా ఈ విధంగానే ఉన్నది కదా !

పోతన్నగారి ఆంధ్ర మహాభాగవతంలో, సంస్కృత భాగవతంలో ఉన్నట్లే ఉన్నది.

పదహారవ శతాబ్దం చివరను, పదిహేడవ శతాబ్దం ప్రారంభంలోనూ ఉండిన చరిగొండ ధర్మన్న రచించిన చిత్రభారతంలోని పంచమాశ్వాసంలోకూడా ఈ కథ ఉన్నది. ధర్మన్న కొంతవరకూ విష్ణుపురాణకథనే అనుసరించాడు. శచీదేవి దగ్గర సత్యభామ ఉన్న సమయంలో ఒక సేవకుడు పారిజాతపుష్పాలను తెచ్చి శచీదేవికి సమర్పించాడు. ఆమె ఆ పువ్వులలో ఒక్కటయినా సత్యభామకియ్యక అన్నీ తనతలలోనే ముడుచుకున్నది. అంతతో ఊరుకోక "ఈ పువ్వులు నీకియ్యలేదని ఏమీఅనుకోకు. ఇవి దేవస్త్రీలేగాని మానవ స్త్రీలు ధరించరానివి" అని చెప్పివేసింది. ఇలా తన్నుఅవమానించినందువల్ల కలిగిన కోపాన్ని అణచుకొని సత్యభామ తన బసకు పోయి శ్రీకృష్ణునితో తనకు కలిగిన పరాభవాన్ని చెప్పినది. "ఆపువ్వుఇవ్వలేదని ఎందుకు బాధపడతావు ? పారిజాతవృక్షాన్నే నీపెరటిచెట్టుగా నిలుపుతాను" అని చెప్పి అతడు పారిజాతాన్ని పెల్లగించి గరుడునిపై వుంచి, తన్నెదిరించిన ఇంద్రాది దేవతలను ఓడించి, భూలోకానికి తెచ్చి సత్యభామ భవనపు తోటలో నాటాడు." అని చిత్రభారతంలో ఉన్న కథ. ఆ సందర్భంలోని పద్యాలు కొన్ని-

"అంత నొకనాఁడు పౌలోమి యరిగి సత్య
భామఁ దోడ్తెచ్చి భూషణాంబరము లొసఁగి
మచ్చికలతోడఁ దేనియ పిచ్చిలంగ
నుచిత సంభాషణము లాడుచున్న వేళ.

క. బృందారకుఁ డొక్కఁడు దా
నందన వన పారిజాత నవ్యకుసుమ రా
జిం దెచ్చి మధ్యధూటికి
నందిచ్చిన సత్యభామ కందొకటయినన్.

తే. ఇడక యాలేమ ప్రేమ నుపేక్షసేయఁ
దానె కబరీభరంబునఁ దాల్చె దివ్య
గంధలుబ్ధ భ్రమద్భృంగ గణ విచిత్ర
ఝంకృతులు దిక్కులను ప్రతిస్వనము లీన.

వ. ఇట్లు ధరించి.

ఆ. మనుజకామినులకు విను దేవతాయోగ్య
వస్తు వితతి నొసఁగ వలనుకాదు.
సత్యభామ! పారిజాత పుష్పంబులు
నీకు నీయరాదు నిక్కువంబు.

వ. అని పులోమజ శ్రీకృష్ణ ప్రభావంబెఱుంగనిదై"

[ చిత్ర. ఆశ్వా. 5 పద్య. 85-90 ]

ఇది, సత్యభామను నోనాడెనని యింద్రుడు చతుర్భునితో శ్రీకృష్ణ ప్రభావాన్ని చెప్పిన సందర్భంలో వున్నది. విష్ణుపురాణంలోని శచీదేవి సత్యభామ యెడల తిరస్కారభావాన్ని సూచించిందే కాని, నోటితో చెప్పలేదు. ధర్మన్న కవి మాత్రం ఆమె నోటితోనే అని పించాడు.

"పారిజాతాపహరణ" ప్రబంధకర్తఅయిన నందితిమ్మనకవి యీకథను మార్చివేశాడు. అతని కథ ననుసరించి శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి గృహంలో ఉన్నప్పుడు నారదుడు వచ్చి ఒక పారిజాత పుష్పాన్ని అతనికి ఇస్తాడు. సత్యభామ చెలికత్తెలుకూడా అప్పుడు అక్కడ ఉన్నారు. ఆ పుష్పాన్ని రుక్మిణికిస్తే సత్యభామకు కోపం వస్తుందేమో అని సందేహిస్తూనే కృష్ణుడు దానిని రుక్మిణి కిస్తాడు. నారదుడు ఆపుష్పం మహత్తును ప్రశంసిస్తూ, దానిని ధరించడంవల్ల ఎక్కువ శోభించగలవనీ, సత్యభామ గర్వం అణగుతుందనీ రుక్మిణితో అన్నాడు. ఈ విషయమంతా చెలికత్తెలు సత్యభామకు తెలియజేస్తారు. ఆమె కోపంతో మండిపడి అలకగృహం ప్రవేశిస్తుంది. శ్రీకృష్ణుడు వచ్చి ఆమె అలకను తీర్చి, పారిజాతవృక్షాన్నే తెచ్చి ఆమె యింటి పెరటి చెట్టుగా నాటుతానని ప్రతిజ్ఞ చేస్తాడు. నరకాసురుడు అపహరించిన అదితికుండలాలు ఆమె కిచ్చే మిషతో కృష్ణుడు స్వర్గలోకానికి ప్రయాణంకాగా, సత్యభామ అతని వెంట వెళ్ళుతుంది. నందనవనం చూడడానికి వెళ్ళిన కృష్ణుడు పారిజాతాన్ని పెల్లగించి, గరుడునిపై పెట్టగా, ఇంద్రాదులు అడ్డగిస్తారు. అతడు యుద్ధంలో వారందర్నీ ఓడించి, పారిజాతవృక్షంతోసహా భూలోకానికి వస్తాడు. ఇది తిమ్మన్నగారు చెప్పినకథ.

తిమ్మనకవి కథను చాలాచమత్కారంగా మార్చాడు. విష్ణుపురాణంలో సత్యభామకు శచీదేవిమీద కలిగిన కోపం ఈయన ప్రబంధంలో రుక్మిణి మీది కోపంగా మారింది. విష్ణుపురాణంలోని సత్యభామ వనపాలురతో చెప్పిన విధంగానే ప్రబంధంలోని సత్యభామ కూడా మాటలాడింది.

సీ. "వినుఁడు సురేశ్వర వనపాలకులు! వార్ధిఁ
బొడమిన యీ దివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వఁడు?
తోడి యిందిరను కౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిది యేమి యొకరిసొమ్మె?
యిదె నాదు విభుఁడిచే నీ వదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదాన,

పలుకులేటికిఁ దా వీరపత్నియేని
మీ శచీదేని తనదు ప్రాణేశుఁ డైన
మఘవు నిటఁబంపి సత్యభామావిధేయు
వ `న పురలంగ(గొనుచె పో వాసితనము."

[పారి. ఆశ్వా. 4. పద్య 58]

పారిజాతవృక్షం పైని అందరికీ హక్కున్నది అని విష్ణు పురాణంలో ఉండగా దానిమీద కృష్ణుడికే అధికారం ఉన్నదని ప్రబంధంలో స్పష్టంగా చెప్పబడినది. ప్రబంధకవి తిమ్మన విష్ణుపురాణం చూచే ఉంటాడని దీనివల్ల తెలుస్తున్నది.

తిమ్మన పారిజాతాపహరణంలో ఒక విషయం ఆలోచించ దగినది.

నరకాసురవధానంతరం శ్రీ కృష్ణుడు సత్యభామతో కూడా ప్రాగ్జ్యోతిషపురంనుంచి తిన్నగా అమరావతికి వెళ్ళి, నరకాపహృతాలైన అదితి కుండలాలను ఆమెకు సమర్పించినట్లు విష్ణు పురాణంలోనూ, భాగవతంలోనూ ఉన్నది. కృష్ణుడు అప్పుడు స్వర్గలోకానికి వెళ్ళక ద్వారకానగరానికే వచ్చినట్లు కొంతకాలం జరిగాక- సత్యభామ ప్రేరణవల్ల పారిజాతాపహరణార్థమై అదితికి కుండలాలు సమర్పించడానికంటూ అమరావతికి వెళ్ళినట్లూ తిమ్మన గ్రంథంలో కానవస్తున్నది. సత్యభామ రుక్మిణిని అధిక్షేపిస్తూ చెప్పిన

క. "పూనుకొని మేలు కీళ్లకు
లోనయి విహరించువారి లోకమెఱుఁగదో
ఆ నరకాసురదమనుఁడు
తానెఱుఁగఁడొ? భోజకన్య తానెఱుఁగదొకో?"

[పారి, ఆశ్వా. 1 పద్య. 91]

అనే పద్యం యిక్కడ గమనించదగినది. ఇందలి "ఆ నరకాసుర దమనుడు" అనేపదం-నరకాసురవధ ఎప్పుడో జరిగినట్లు సూచిస్తున్నది. ఆకుండలాలను వెంటనే అదితికి ఇవ్వకుండా ఇంతకాలం ఉపేక్షించినట్లు చెప్పడం సముచితంగా ఉన్నట్లు తోచదు. తిమ్మన కవి యీసందర్భంలో పొరపాటు పడ్డాడా? అని అనిపిస్తుంది.

◆◆◆◆◆◆

# నా నువ్వు

## "కన్న"

పున్నమిలో నా నువ్వు
నన్ను విడిచి నవ్వుకుంటు
కన్నులైన త్రిప్పకుండ
వెన్నెలలో కలిశావు

అమవసలో ఆ నువ్వే
కనులకేమి కానరాక
నను వెదకుచు తిరిగి తిరిగి
నాలోనే కలిశావు.



# గుడ్ మార్నింగ్!

## శ్రీ రంధి సోమరాజు

నీ దురాలోచనల భయమేరా నీ చావు
అందులోబడి మట్టిలో కూరుకు పోతున్నావు

నిజానికి నీకు చావెక్కడిది ?
లేదు....లేదు....చావులేదు.

ఎప్పుడూ 'వున్నదే' వుంది
ఉన్నదాన్ని అసలు లేదనడం ఎలా ?

అచ్చకాయి పుచ్చకాయి కబుర్లాడకు
అసలు 'ఉన్నది' లేదని చెప్పడం అసాధ్యం !

రూపం మారితే 'లేక' పోవడం కాదు

ఇది మాయకాదు
కళ్ళు విప్పిచూడు

చూస్తున్నదంతా 'ఉన్న' దాని స్వరూపమే !
చూడలేనిది కూడ అంతే-

అదే దైవత్వం
ఆ దైవత్వమే నువ్వూ నేనూ....

ఇప్పుడు మనలో ఒకరు నియంతకావాలనుకోవడం
ఏమిటి?

ఈ పందెంలో ఎవరు నెగ్గినా
నన్ను నీవు; నిన్ను నేను - తెలుసుకోవడమే!

తెలిస్తే ఏముంది ?
ఏమీలేదు.
మళ్ళీ మొదలు 'ఉన్నాం' అంతే....

అలాగని నీరసించి పోకు

ఏ కొంచెం మారినా
మారిన యుగంగా మారనీ....

ఈ చక్రంలో బడి నలుగుతూ
ఎగరగొట్టు చంద్రుడిలోని చలిని

వానలతో ముంచెత్తు సూర్యుణ్ణి
పండించు వ్యోమ సస్యాన్ని
చుక్కల విస్తళ్ళల్లో చాపకూడు తిందాం

వేల వేల కోట్ల సూర్యులున్నారు
అందరూ మన స్నేహితులు

ఔను అంతా మన వాళ్ళేనయ్యా....
మనల్ని ఆహ్వానిస్తున్నారు

ఈ శరీరం బుద్బుదమూ కాదు
బూడిద కాయా కాదు
అదీ మన ఆత్మలాగే అనశ్వరమైనది

దానిలోని అణువణువూ ఎప్పుడూ సజీవం
మనం పరిపూర్ణ యవ్వనులం

మతం చక్రవర్తిని సృష్టిస్తే
వ్యక్తి ఆరాధనలో మునిగి తేలి
డిక్టేటరయింది కమ్యూనిజం
ఈ యిజాలు, మతాలు సవతి పోరులయ్యాయి

అందుకే పీటి జోలికి పోకు
మనం అందుకోవలసింది
అనంత చైతన్యాన్ని
అది సుక్షేత్రం
మానవతా పవనం

రాజకీయాలు. కీచులాటలు
వుత్తదురద
దురద తగ్గడానికి విషం మింగాలి
దురద వదిలితే
నిద్ర !
నిద్ర తొలిగితే
ధ్యానముద్ర.
మనమంతా ధ్యానగాన సముదాయమైతే
ఎంత హాయి !

గుడ్ మార్నింగ్!

ఔను ఎప్పుడైనా ఎవ్వరైనా
పరిపూర్ణ మహత్వ తత్వ మహత్మ్యాన్ని
ప్రదర్శించ గలగారా ఏమిటి ?
ఐన్‌స్టీన్ ఎంతమంది విజ్ఞానుల గుండెల్లోంచి మొల
కెత్తాడు!
అలా అంతా వెతుక్కుంటూ
ఉన్నదాని ఊపిరిని తెలుసుకుంటూ
అవగతం చేసుకుంటూ
విద్యుత్ కీర సముదాయమై
ఎగురుతూ ఎగురుతూ పోవాలి
ఎదురయ్యే ప్రతిరాయీ వజ్ర సమానమే!
కదలిక లేని కదలికల చైతన్య స్వరూపమే !!
వినువీధి నక్షత్ర పటలమే !!!
గుడ్‌నైట్....
మనం మేలుకోగానే
మనమే అనుకుందాం గుడ్‌మార్నింగ్!



# శీర్షిక నెత్తుకునే వరకు....

క్రిందకు
చిన్నగా
రంధ్రం పడితే
కారే నీటిలాకాదు-
అమ్మమ్మ
నా
చెవిలో
రెండు చుక్కల
వేడి నూనెవేసి
చెంబెడు చెంబెడు నీళ్ళతో,
తలంటు పోస్తున్నట్లూకాదు-
గ్రుక్క గ్రుక్కకు
దూడ
ఆవు పొదుగును
మూతితో అదలిస్తూ
పాలు త్రాగుతున్నట్లూకాదు
'భావం'
సముద్ర కెరటంలా
నన్ను ముంచెత్తి
జాగ్రత స్వప్న సుషుప్తావస్థల్లోనూ
ఉక్కిరి బిక్కిరి చేస్తేనేకాని
నే
పెన్ను స్విచ్చి వేయను!-
ఈ
వాతావరణమే ఏర్పడితే
వాచీలోని
రెండు ముండ్లూ
రాత్రి
పన్నెండో మైలురాయి దగ్గర
మరుసటి రోజు కోసం
ఏకమై పోతున్నా!-
ఆకాశం మైదానంలో
కాలం క్రీడాకారుడు
తూర్పు నుండి పడమరకు
ఎఱ్ఱని బంతిని తన్నేస్తున్నా!-
ఆకలి
నా కడుపున
బైనాక్యులర్స్‌తో చూస్తున్నా!
చివరకు
వాలుకుర్చీలో
కూర్చొని వ్రాస్తున్నందుకు
అవకాశాన్ని చూసుకొని
నిద్ర
నాలో తెల్లవాజాలని అనుకున్నా
నా
హృదయంలోని
'భావ తరంగాలు'
వీటన్నింటిని శాసిస్తాయి!
కవిత
పూర్ణాకృతి పొందే వరకే కాదు
కవిత
శీర్షిక నెత్తుకునే వరకు
నాలోని
సమస్త విశ్వం
స్తంభించి పోతుంది!!

# మేఘావతారాలు

సృష్టి స్థితి లయాలను
తన ముందు చూస్తూ
నిశ్చలంగా
స్థిత ప్రజ్ఞుడిలా ఉన్న
ఆకాశంలో
ఓ తెల్లని మేఘం!
చిరు మెఱుపులతో
వెలిగే
చుక్కలా
ఒక్క రూపంతో కాదు మేఘం!

ఒక గడియ అమీబాలా!
మరో గడియ పక్షిలా!
ఇంకో క్షణం
భరతనాట్యం చేసే భామినిలా!!

దశావతారాల్లా
యుగానికో రూపం కాదు!
క్షణ క్షణానికో
అవతారమెత్తుతున్నది!

మేఘం
నా
భావంకన్నా వేగంగా
రూపాలను దాలుస్తున్నది!
మబ్బుతో
మనసు పోటీపడి
ఓడిపోయింది!
కన్నులతో
చివరకు రాజీపడి
చూడటం నేర్చుకుంది!

ఏ చిత్రకారుడు వేయకుండానే
ఆకాశంలో అనేకానేక
ఆకృతులు
ధరించిన మేఘం
చివరకు
ఎవరూ చెరుపకుండానే
చెరిగి పోయింది!

చిన్నని
నా నేత్రాల్లోను-
వృత్తాకారంలో ఉన్న
నీటి తొట్టిలోనూ-
ముఖ దశలను
దశ దిశలను
దర్శింపజేసే దర్పణంలోనూ
ప్రతిఫలించే
ఆకాశంలోని మేఘం-
చేతుల కందకుండా
చూపుల కందుతూ
మటుమాయమైన మేఘం
అదృశ్యంగా
నాలో చేరింది!
ఇక్కడే ఇక్కడే
మబ్బు
మరో చరిత్ర మొదలైంది!

మనసులో చేరి
కరిగే రూపంలో కాదు
అక్షర రూపంలో
కవితగా అవతారమెత్తింది!

ఈ క్షణంలోనే ఇంకా
ఏ చిత్రకారుడి
కుంచెనో తాకి
కాన్వాసు ఆకాశం మీద
చెరిగే మేఘంలాకాక
శాశ్వతంగా నిలిచే
వర్ణ చిత్ర మేఘంగా
అవతార మెత్తుతుంది
ఎప్పటికీ నిలిచే
ఆకాశంలాగే!!

శ్రీ కందాళై రాఘవాచార్య

# వైవిధ్యం

శ్రీ తిరునగరి

మనసు మెత్తనైనది
మైనంలా వంగుతుంది
మనసు కఠినమైనది
వజ్రంలా మొక్కవోనిది
మనసు సుందరమైనది
పద్యాలల్లి పాట పాడుతుంది
మనసు వికృతమైనది
పరనిందచేసి విర్రవీగుతుంది
మనసు విశాలమైనది
ప్రపంచమంతా పరచుకుంటుంది
మనసు సంకుచితమైనది
తనచుట్టే గిరిగీసుకుంటుంది
మనసు చల్లనైనది
బాధితుల కన్నీరుతుడుస్తుంది
మనసు కుపితమైనది
పరుల నకారణంగా హింసిస్తుంది
మనసు కర్పూరం వంటిది
పరోపకారంలో కరిగిపోతుంది
మనసు పాషాణంవంటిది
పరులకష్టాల నుపేక్షచేస్తుంది
మనసు మనసున్నది
మానవతాదీపం వెలిగిస్తుంది
మనసు మనసుకానిది
మనిషికే పాపంతలపోస్తుంది
మనసు మెత్తనైనది
మనసు కఠినమైనది.

# భావనాపల్లవం

శ్రీ సడ్లపల్లె చిదంబరరెడ్డి

జనారణ్యమ్ములో జడజీవితాన
మలయవాక్పవనాల పలకరింపులులేని
మానసవల్లరి మూగగానిలపించి
నిట్టూర్పుపత్రాలురాల్చుచుండి;
ఏ దివ్యసుందరో ఎదఊహసౌధాన
కాంచనద్వారాన కాంతులమధ్యన
కదలివచ్చినట్లు కాలిమువ్వల సందడి
కనికరించినట్లు కరకంకణముల రవళి:
ఎంతసుందరరూపు ఏమిచల్లనిచూపు
ఎటుచూసినా తన్విప్రతిరూపమేదోచు
ఆ ఇంతిఒడిలోన మనసుకెంతటిహాయి—
కలిమిలేముల మాలిన్యములుసూని
ఆకలిదప్పుల అలమటింపులుఆర్చి
సమత మమతాకుసుమ సౌరభమ్ములువీచి
కళ్ళను ముకుళించ కమ్మనికల అలలు
హృదయజలధి పొంగిపొరలజేయు
క్షణమొకరూపుగా నూతనత్త్వముపొందు
ఆ బాలరూపమ్ము చిత్రాన చిత్రించి
చిరునవ్వులీనెడు ఆముగ్ధమోములో
రహస్యమదిఏమొ రవ్వంతఎరిగి
అవ్యక్తమౌ ఆరూపులోఐక్యమైపోవగా
ఆరాటపడుతోంది
పరితపిస్తోంది
ప్రతిభావనాపల్లవం.

శ్రీ టి. నరసింహారావు        శ్రీ జి. రామేశ్వరము

# ప్రభుత్వరంగంలో ఉద్యోగి బృంద పాలనా నిర్వాహణ - ఒకనూతన మార్గ ఆవశ్యకత

ఏదేని ఒక సంస్థయొక్క ఆర్థిక సేవల లక్ష్యాలను సాధించడం కొరకు మానవ ప్రయత్నాలను సమీకరించడం నిర్వహణయొక్క ముఖ్యమైన పని. ప్రతి నిర్వహణయొక్క నిర్ణయాలు మానవ ప్రవర్తనావళి సంబంధాలను కలిగి యుండును. నిర్వహణ యొక్క విజయం నిర్వహణా సామర్థ్యం అను అంశంపైనే గాకుండా మానవప్రవర్తనావళిని ఆధీనంలోనుంచు విధానంపై ఆధారపడి యుండును. (ఎ) ప్రవర్తన విషయంలో ఒక్కొక్క వ్యక్తి ప్రవర్తన ఒక్కొక్క విధంగా నుండును. ఈ విధంగా విభిన్న సమాజాలలో విభిన్న రకాలైన వ్యక్తులు వుండి విభిన్న రకాల ప్రవర్తనలను కలిగియుంటారు. అందుకని ఒక సమాజంలోని వ్యక్తుల ప్రవర్తన మరియొక సమాజంలోని వ్యక్తులప్రవర్తనలకు భిన్నంగా నుండును. కావున ప్రవర్తన అనే అంశం ఆయాదేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ, భౌగోళిక పరిస్థితుల ప్రభావంపై ఆధారపడి-యుంటుంది. కాని నిర్వహణ సిద్ధాంతాలు మాత్రం పాశ్చాత్యదేశ అనుభవాల దృష్ట్యా ఆధారపడి నిర్మింపబడినవి. ఆ సిద్ధాంతాలకు "సార్వజనీనత" లేదు. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన శాస్త్రీయ నిర్వహణ శాస్త్రజ్ఞులు అయిన ఎఫ్. డబ్ల్యూ. టేలర్, హెన్రీ ఫాయల్, అలివర్ షెల్డన్ మొదలగు వార్లు పాశ్చాత్య సమాజాలకు చెందినవారు గనుక వారు వారి సిద్ధాంతాలను ఆయాదేశాల అనుభవాలపై ఆధారపడి నిర్మించినారు. కాని వాస్తవంగా అభివృద్ధి చెందిన దేశాలకు సంబంధించిన సిద్ధాంతాలు మన దేశం వలె అభివృద్ధి చెందుచున్న సమాజాలకు సరిపడవు, వర్తించవు ఎందుకనగా అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రభావం వేరే విధంగా యుంటుంది. హెన్రీ పాయల్ యొక్క సూచన ప్రకారంగా నిర్వహణ సూత్రాలు సరళితమైనవే కాని నిరపేక్షితమైనవి కావు' కాని ఆ సూత్రాలను మార్పునుబట్టి, ప్రత్యేక పరిస్థితులను బట్టి వినియోగించుకొనవలెను. (బి) ఇచ్చట పాశ్చాత్యదేశాల ప్రవర్తనావళిపై నిర్మింపబడిన నిర్వహణ సిద్ధాంతాలను తిరస్కరించడంకాదు కాని ప్రతిదేశంలోను ఉద్యోగుల జీవనంపై ప్రభావం చూపే అంశాల పరిస్థితులను కనీసం గణనలోనికి తీసుకోవలయును. అప్పుడే ఆ ప్రభుత్వ సంస్థలోని నిర్వహణ నిర్ణయాలు సక్రమంగా అమలుకాగలవు మరియు ఆ సంస్థ ఆశించిన ఫలితాలను పొందుటకు తోడ్పడును. అదే విధంగా సాంప్రదాయ సిద్ధాంతాలు శాస్త్రీయతను కోల్పోయి యితర అంశాలను నిర్లక్ష్యం చేసినవి. ఈ సిద్ధాంతాలు వ్యవస్థాపనపై, నిర్వహణ అమలు పరచునపుడు ప్రభావం చూపే సామాజిక, ఆర్థిక, రాజకీయ అంశాలను గమనించలేదు. (సి)

మన దేశంలోని ప్రభుత్వ సంస్థలు దేశార్థికాభివృద్ధికి తోడ్పడుటలో ముఖ్యపాత్ర వహిస్తున్నవి. ఈ సంస్థలు యీ క్రింద నుదహరించిన ప్రణాళిక లక్ష్యాల సాధనకై పాటు పడుచున్నవి. అవి (1) సామ్యవాద పద్ధతిని అవలంబించుట (2) పారిశ్రామిక నిర్మాణతను పెంపొందించుట (3) మూలధన సమీకరణ (4) సామాజిక అంతరాలను నిర్మూలించుట (5) అభిలషణీయమైన వనరులను కేటాయించుట (6) సామాజిక లక్ష్యాలను సాధించుతు సమతౌల్య ప్రాంతీయాభివృద్ధిని సాధించుట. మన దేశంలో ప్రస్తుతం 180 ప్రభుత్వరంగ సంస్థలలో దాదాపు 14,000 కోట్ల రూపాయల పెట్టుబడితో నడుచుచున్నవి. అనేకమంది ఉద్యోగులు యీ ప్రభుత్వరంగ సంస్థలలో పనిచేయుచున్నను ప్రభు-

రంగ ఉద్యోగి బృందపాలనా నిర్వహణలో చాలా ప్రత్యేకమైన సమస్యలను ఎదుర్కొను చున్నది.

ఉద్యోగి బృందపాలనా నిర్వహణ యేదేని ఒక వ్యవస్థలోని మానవ సమస్యలను పరిశీలించే పనులతో సంబంధం కలిగియుంటుంది. ఏదేని ఒక వ్యవస్థ తన లక్ష్యాలను సాధించవలసినపుడు ఆ వ్యవస్థలో పనిచేసే వ్యక్తులకు ఈ క్రింద తెలుపబడిన సమపాయాలను కల్పించినపుడు వారు కలిసికట్టుగా, సమర్ధవంతముగా, సంతోషంగా పనిచేసి ఆ వ్యవస్థ లక్ష్యాలసాధనకై తోడ్పడవచ్చును.

(1) ఆర్థికంగా సంతృప్తిని కలిగించే జీవనోపాధి సౌకర్యాలు.

(2) ఒకే వర్గములో కలసిమెలసి లక్ష్యసాధనకై తోడ్పడేవారిలో సామాజిక సంతృప్తిని కలిగించడము.

(3) సక్రమంగా ఉద్యోగం చేసేవారిలో వ్యక్తిగత సంతృప్తిని కలిగించడము. సాధారణ నిర్వహణలో ఉద్యోగి బృందపాలనా నిర్వహణ అను అంశము. చాలా ముఖ్యమైనవి. ఏ నిర్వహణ అయినా సరియైన ఉద్యోగి బృందపాలనా విధానమును, వ్యవస్థలో పనిచేసే వ్యక్తుల విషయంలో సరియైన మార్గము లేనిచో సమర్ధవంతముగా పనిచేయులేక పోవచ్చును.

మనదేశం యొక్క ప్రభుత్వరంగంలోని నిర్వహణ నిర్మాణం కేవలం పాశ్చాత్యదేశ విధానాలను అనుకరించబడి నిర్మింపబడినవి. ఈ నిర్వహణ నిర్మాణం మన దేశంలో పనిచేసే కార్మికులు (శ్రామికులు) నివసించే పరిసర ప్రభావాలను లెక్కలోనికి తీసుకోలేదు. మనదేశం లోని నిర్వహణ పరిశీలనలన్ని పాశ్చాత్య సిద్ధాంతాలపై ఆధారపడి నిర్మింపబడినవే కాని మనదేశ పరిస్థితులకు అనుగుణంగా నిర్వహణ సిద్ధాంతాల పరిశీలన కొరకై ఎలాంటి ప్రయత్నాలు జరుగలేదు. ముఖ్యంగా ఒక వ్యవస్థ తన లక్ష్యాలపైనే ఆధారపడకుండా ఆ వ్యవస్థ లక్ష్యాలు సామాజిక సేవలను అందించే విషయాలను కూడ గుర్తించవలెను. ఒకవేళ మ దేశంలోని నిర్వహణ నిర్ణయాలు పూర్తిగా పాశ్చాత్య సిద్ధాంతాలపై, పద్ధతులపై ఆధారపడి మనదేశ సామాజిక, ఆర్థిక పరిసర ప్రభావాలకు వాటి భవిష్యత్ ప్రభావాలను చూపే అంశాలకు భిన్నంగా నిర్ణయాలు తీసుకుంటే మన దేశంలోని నిర్వహణ విధులను నిర్వర్తించునపుడు ఘోర పరాజయము పొందును. (డి)ఈ ప్రస్తుతవ్యాసముముఖ్యంగా ప్రభుత్వరంగంలోని ఉద్యోగి బృందపాలనా నిర్వహణపై ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, ప్రభావంచూపే అంశాలమీద అశ్రద్ధ చూపబడిన విషయాలను గూర్చి వివరించునది. అవి. (1) భాష (2) బదిలీలు (3) నిరుద్యోగిత (4) ఇతరసామాజిక రాజకీయ అంశాలు.

## భాష

సమర్థవంతమైన నిర్వహణకోసం తప్పనిసరియైన సమాచారముఅవసరం. దాదాపు ప్రతివిషయంలో ఒక నిర్వాహకుడు సమాచార సంబంధాన్నికలిగియుంటాడు. ఒక నిర్వాహకుడు తన క్రింది స్థాయిలోని ఉద్యోగులను తనిఖీ చేయవచ్చును. కాని తను తనిఖీ చేయబోయే ముందు వారితో మాట్లాడగలిగే సామర్థ్యం కలిగియుండవలెను. ఇచ్చట మాటలాడుట అనగా మామూలు విషయం కాదు. కొన్ని సందర్భాలలో వార్తలను పంపబడునపుడు వాడబడే ఉచ్ఛారణ పదాలు వార్తలను పొందే వ్యక్తికి వేరే విధంగా అర్ధము కావచ్చును. ప్రత్యేకంగా ఎప్పుడైతే క్రిందిస్థాయిలోని ఉద్యోగులు వారి పర్యవేక్షకుల వద్ద తికమకపడి అందించే సమాచారము వేరే భావాలకు దారితీయును. కావున నిర్వహణలోని క్రమానుగత స్థాయిలన్నింటిలో సమాచారము పంపినపుడు ఆ సమాచారమును పొందే వ్యక్తికి అర్ధమగునట్లు చాల స్పష్టముగా తప్పక ఉండవలెను, సాధారణంగా మామూలు భాషలో సమాచారం అందించినపుడే ఎన్నోరకాల సమస్యలు ఏర్పడుతుంటాయి. ఒకవేళ క్రిందిస్థాయిలోని ఉద్యోగి తనకు తెలిసిన భాషలోనే సమాచారము అందజేసినపుడు ఆ భాష పైస్థాయి ఉద్యోగికి అర్ధంకానప్పుడు యిలాంటి సమస్యలు ఉత్పన్నమగును. మనదేశంలో నిర్వహణ స్థాయిలలో ఉద్యోగులు ప్రతి మారుమూలలనుండి భర్తీ చేయబడినారు కాని క్రింది స్థాయిలో పనిచేసే వర్గం వారు స్థానిక ప్రాంతాలనుండి భర్తీ చేయబడినారు. మనదేశంలో ప్రస్తుతం 14 అధికార భాషలు, 1000కి పైగా భాషా సంబంధ భేదాలు గలవు. కావున పైస్థాయి ఉద్యోగికి క్రిందిస్థాయి ఉద్యోగి భాష తెలియనిచో

అతడు సమాచార భావాలను అందించడంగాని పొందడం గాని చాలా కష్టము. పాశ్చాత్య దేశాలలోని క్రిందిస్థాయి పై స్థాయి ఉద్యోగులకు పర్యవేక్షకులకు మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాల విషయంలో ఎలాంటి భాషా సమస్యలు ఉత్పన్నము కావు. మనదేశంలో నిర్వహణస్థాయిలో కేవలం ఆంగ్లభాష వాడబడినప్పటికి, చాలావరకు అర్థమయినప్పటికి నిర్వహణ విషయంలో భాష అనే అంశం ప్రత్యేక సమస్యలు సృష్టిస్తున్నది. పాశ్చాత్య దేశాల దృష్ట్యా నిర్మించబడిన నిర్వహణ సమాచార సిద్ధాంతము యీ విషయంలో తగిన శ్రద్ధ తీసుకోలేదు. కావున ఆ సిద్ధాంతాలు మనదేశ నిర్వహణకు సహాయపడక పోవచ్చును.

## బదిలీలు

సాధారణంగా ఒక వ్యక్తిని ఉద్యోగిని ఒక హోదా నుండిగాని, ఒక శాఖనుండి గాని ఒక ప్రదేశము నుండి గాని మార్చినప్పుడు బదిలీ అంటారు. బదిలీ యొక్క లక్ష్యాలు: 1) పాలనా అవకతవకలను నిర్మూలించుట (2) పదోన్నతి కొరకు (3) అవినీతి కార్యకలాపాలు చేసినవి కనుగొనుటకుగాని అటువంటి పనులు జరగకుండ జాగ్రత్త తీసుకోవడం కొరకు (4) క్రమశిక్షణా చర్యలను తీసుకోవడం కొరకు. మన దేశంలోని పాలనా నిర్వహణలో బదిలీలు సాధారణలక్షణము. విభిన్న నాగరికతలు, అలవాట్లు, భాషలు గల మన దేశంలో బదిలీల విషయాలకు ప్రత్యేక ప్రాముఖ్యత కలదు. సాధారణంగా ఒక ఉద్యోగి బదిలీ అయినప్పుడు అనేక కష్టాలను, సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ముఖ్యంగా ఒక ఉద్యోగి ఒక రాష్ట్రంనుండి మరొక రాష్ట్రానికి బదిలీ అయినప్పుడు అనేక కష్టాలు ఏర్పడును. ఎందు కనగా ప్రభుత్వరంగంలో పనిచేసే ఉద్యోగులకోసం ప్రభుత్వం కల్పించేగృహవసతులు ప్రస్తుతం పనిచేసే ఉద్యోగులకుమాత్రమే సరిపోవడంలేదు. యిందుకు తోడుగా దినదినాభివృద్ధి చెందుతున్న జనాభాకు గృహవసతులు లేకపోవడము. మనదేశంలోని వివిధ ప్రాంతాలలోని ప్రజలు వివిధ రకాల ఆహారపు అలవాట్లను కలిగియున్నారు. ఈ విధంగానే ఒక రాష్ట్రపు ప్రజల ఆహారపు అలవాట్లకు మరొక రాష్ట్ర ప్రజల ఆహారపు అలవాట్లకు చాలాతేడా వుంది. ఉదా॥ ఉత్తర భారతదేశ ప్రజల జీవనాహారం గోధుమ, అదే దక్షిణ భారత దేశ ప్రజలజీవనాహారము వరి. ఒకవేళ ఉద్యోగి ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి బదిలీ అయినప్పుడు తన అలవాట్లకు, అభిరుచులకు అనుగుణంగా లభించని ఆహారపు వస్తువుల కారణంగా తన ఆహారపు అలవాట్లను తప్పకుండా మార్చుకోవలెను. ఈ విషయమునకు తోడు సమాచారము అనే అంశము ఒక పెద్ద అంతరాయము. దీనికి కారణము తిరిగి భాషా సమస్యయే. భాష అనునది ఎప్పటికి తప్పకుండ సామాజిక సంబంధం కలిగియుండాలి. ఒకవేళ ఆ ఉద్యోగికి ఆ ప్రాంత భాష రానిచో అతడు చాలా సమస్యలను ఎదుర్కోవలెను. ఈ ప్రభావం ఆ ఉద్యోగి కుటుంబీకులపై, పిల్లల విద్యా విషయాలపై చాలా ఘోర ప్రభావము చూపును. కావున యిలాంటి సమయంలో ఆ ఉద్యోగి యీ విధమైన సమస్యలను ఎదుర్కొనుచు తన విధులను సక్రమంగా, సమర్థవంతంగా నిర్వర్తించలేకపోయే అవకాశము కలదు. ముఖ్యంగా మన దేశంలోని ప్రభుత్వ సంస్థలలో "శాస్త్రీయ బదిలీ" పద్ధతిలేదు. అనగా ప్రభుత్వ రంగ సంస్థలలో ఒక ఉద్యోగి ఎంత కాలము వరకు ఒకే స్థలంలో ఉద్యోగం చేయవలయుననియు, ప్రత్యేకంగా ఎంతకాలం తరువాయి ఆ ఉద్యోగిని బదిలీ చేయవలయునను సరియైన పద్ధతిలేదు. అనగా మన దేశంలోని ప్రభుత్వ సంస్థలలో బదిలీ కాలము హేతు బద్ధతను కలిగిలేదు. ప్రభుత్వ సంస్థల బదిలీల విషయాలలో రాజకీయ, కార్మిక సంఘాల నాయకులు చొరవ తీసుకొని బదిలీలను చేయించుచున్నారు.

## నిరుద్యోగిత

మనదేశం దినదినానికీ అతివేగంగా పెరిగిపోయే జనాభాకు, నిరుద్యోగితకు నిలయమైయున్నది. మనదేశం వలె పాశ్చాత్యదేశాలు నిరుద్యోగ సమస్యలను కలిగియున్నను ఆయా దేశాలతో పోల్చి చూసినచో ఆయా దేశాలకన్న మనదేశంలో నిరుద్యోగితాస్థాయి ఎక్కువగా కన్పించును. మనదేశంలోని అన్ని ప్రభుత్వ సంస్థల ఉద్యోగాలకు ఒక ప్రత్యేకమైన వయసు పరిమితి విధించబడినది. ఉదా॥ ఒక సంస్థలో ఏ విధంగానైనా సమర్థత, సామర్థ్యము కలిగిన ఆ ఉద్యోగి ఆ సంస్థ సూచించిన వయసు పరిమితి దాటినచో ఆ వ్యక్తి పై ఉద్యోగానికి అర్హుడు కాడు. అనగా

యిలాంటి సందర్భాలలో అదే సంస్థలో పనిచేయు ఉద్యోగులకు సమర్ధత, సామర్థ్యము. విజ్ఞానము కలిగినా అదే స్థాయిలో లేదా అదేవృత్తిలో తనకు విసుగు కలిగినా గత్యంతరములేక స్థిరపడిపోవలెను. దీనికి కారణము వయసు పరిమితి. ఒకవేళ ఆ వ్యక్తి ఆ సంస్థను వదిలిపెట్టి పోయినచో వేరే సంస్థలో ఉద్యోగం లభించదు ఎందుకనగా వేరే సంస్థలోకూడా వయసు పరిమితి అనే సమస్య ఉత్పన్నమగును. అనగా కేవలం ఒకసారి లభించిన ఉద్యోగంలోనే ఆ ఉద్యోగి జీవితాంతము గడుపవలెను. కేవలం కొన్ని సందర్భాలలో కొందరి వ్యక్తులకు సామర్థ్యము, తగిన శక్తి అర్హతలు కలిగివుంటేఅవుద్యోగి పై ఉద్యోగానికిపోవచ్చును. అలాంటి సమయంలో ఎలాంటి సమస్యలు ఉత్పన్నముకావు కాని పాశ్చాత్య దేశాలలో వయసు పరిమితి అనే అంశము ఉండదు. ఒకవేళ ఉద్యోగాలలో భర్తీ చేయబడిన ఆ ఉద్యోగంపై యిష్టంలేనిచోగాని, ఉద్యోగులు తాము చేసే పనులకు తగిన సంతృప్తిని పొందనిచో వారు ఆ ఉద్యోగాన్ని వదలివేయుదురు. యింకా ఉద్యోగం చేసే వ్యక్తికి కూడ తన సామర్థ్యమును పెంపొందించుకొననిచోగాని, విధులను సక్రమంగా, సమర్థవంతముగా నిర్వర్తించనిచోగాని, ఆ ఉద్యోగికి ఉద్యోగ భద్రత ఉండదు. అనగా పాశ్చాత్య దేశాలలో ఉద్యోగి తన అభిరుచిని బట్టి యిష్టమునుబట్టి ఉద్యోగం చేయవచ్చును. కాని మనదేశంలోని యీ పరిస్థితులవల్ల ఉద్యోగులు యే విధముగానైనా అంటే ఆ ఉద్యోగంపై యిష్టము లేకపోయినచో గాని, ఆ ఉద్యోగానికి తగనిచోగాని ఆ ఉద్యోగానికి అంకితమైపోవలయును. ఇలాంటి సందర్భాలలో వ్యక్తులలోని విజ్ఞానం ఆ సంస్థ వినియోగించుకోలేని పరిస్థితియు ఆ వ్యక్తులలోని జిజ్ఞాస, అనుభవం. విజ్ఞానం, ఆసక్తి నిరుపయోగమయ్యే ఆస్కారము గలదు.

## సామాజిక రాజకీయ అంశాలు

రాజ్యాంగ ప్రకారంగా మనదేశం ఒక లౌకికరాజ్యము కాని మన ప్రజలలో కులతత్వ, మతపరమైన భావాలు వారి మనసులలో పాతుకుపోయాయి. చాలావరకు విద్యావంతులు కూడా యీ కోవకు చెందినవారే. కొన్ని సందర్భాలలో కులము విషయాలు మానవ సంబంధాలకు, పెద్ద పెద్ద నిర్వహణా విధానాలకు ఒక ప్రతిబంధకము. ఈ కులతత్వ భావాలు పై ఉద్యోగికి అతని క్రింది స్థాయిలోని ఉద్యోగుల సంబంధాలను బట్టియు, ఒకే స్థాయిలో పనిచేసే క్రింది స్థాయి ఉద్యోగులలోని సంబంధాన్ని బట్టి యుండును. ఉదా॥ ఒక క్రింది స్థాయి ఉద్యోగి ఉన్నత కులమునకు చెంది అతడు తక్కువ కులానికి చెందిన ఉన్నతోద్యోగి క్రింద పనిచేయుటకు యిష్టపడడు. కొన్ని సమయాలలో పై స్థాయిలలోని ఉద్యోగులు తమకులానికి చెందిన క్రింది స్థాయిలోని ఉద్యోగులపై అభిమానం కల్గియుండుట జరుగవచ్చును. ఒక్కొక్కసారి ఒకే స్థాయిలోన (క్రిందిస్థాయి) పనిచేసే వివిధ వుద్యోగుల మధ్య కులతత్వ, వర్గభావాలు పెంపొందవచ్చును. ముఖ్యమైన నిర్వహణ విధానంపై భర్తీ, పదోన్నతి విషయాలపై కులము మినహాయింపు అను అంశం ప్రభావం చూపుతుంది. రాజ్యాంగ రీత్యా కొన్ని ఉద్యోగాలు కేవలం ఆర్థికంగా, సామాజికంగా వెనకబడిన వర్గాల వారికే కేటాయించబడినవి కాని కొన్ని సందర్భాలలో వారే వారితో సమాన స్థాయిలో కలసి పనిచేసే ఉద్యోగులచే లోకువగా చూడబడుతున్నారు. యీ విధంగా మనుష్యులలోని నరనరాల్లో జీర్ణించుకుపోయి వ్యాపింప బడిన యీ కులతత్వ విధానము పాశ్చాత్య దేశాలలోయెక్కడను కన్పించదు. మానవ సంబంధాల గురించి యిచ్చే సలహాలు, వాటి గురించి చేపట్టబడే పద్ధతులు యీ విధమైన కులతత్వ ప్రభావం వల్ల ఆశించిన సరియైన ఫలితాలను యివ్వలేకపోవచ్చును.

మన దేశంలోని శ్రామికులు చాల వరకు తక్కువ విద్యా ప్రమాణస్థాయి కలిగి, వారు దాదాపు చాలావరకు నిరక్షరాస్య కుటుంబాలనుండివచ్చినారు. ఒకవేళ ఎప్పుడైనా నిర్వహణవారు క్రొత్త విధానాలను, పద్ధతులను ప్రవేశపెట్టవలసినప్పుడు నిర్వహణ వారే స్వయంగా వారి దృష్టిని, పంథాను మార్చుటకు అదనముగా ప్రయత్నాలు చేయవలెను. పాశ్చాత్యదేశాలలో మంచి ఫలితాలను యిచ్చిన విధానాలను, పద్ధతులను మనదేశంలో అనుకరించిన మంచి ఫలితాలను యివ్వలేదు.

ప్రాంతీయ తత్వం కూడ మన ప్రజలలో కీలక పాత్ర వహిస్తున్నది. ఈ ప్రాంతీయ తత్వ భావాలు నిర్వహణ విధానంలో జోక్యాన్నికల్గియున్నవి. భారత ప్రజలు అందరు

సమానమనే భావనా ప్రకారంగా వ్యవస్థలోని యే స్థాయిలో నైనా స్థానిక ప్రజలకు ప్రాముఖ్యత కల్పించవలెను. ఈ విషయం సరియైన వ్యక్తికి సరియైన ఉద్యోగం అను సూత్రంపై దెబ్బ తీయును. కావున అందుబాటులో నున్న ప్రాంతీయ విజ్ఞానమే ఆశించిన ప్రమాణంగా యుండ కూడదు. ప్రాంతీయ తత్వభావాలు కూడా ఒకే సంస్థలో పనిచేసే క్రిందిస్థాయి ఉద్యోగులలో, పై స్థాయి ఉద్యోగుల మధ్య సమస్యలను సృష్టించి అవి సమ్మెలకు, నష్టాలకు దారితీసే ఫలితాలను యివ్వవచ్చును. (ఇ)

మిశ్రమ ఆర్థిక వ్యవస్థగల మనదేశంలోని ఉద్యోగి బృందపాలనా నిర్వహణ మరొక సమస్యను కలిగియున్నది. ప్రభుత్వ రంగంలోని సంస్థల సంఘాలపై దాదాపు ఉద్యోగులు ఆధిపత్యము వహిస్తున్నారు. (ఎఫ్) ఈ విధమైన ఆధిపత్యము ప్రభుత్వ సంస్థలకు ఒక అడ్డంకి. ఉద్యోగిబృంద పాలనా నిర్వహణ వారు ఎల్లప్పుడు వారికి వారే స్వయంగా ప్రభుత్వేతరరంగంలోని వారితో పోల్చుకుంటారు. వేతన విధానంలో ప్రభుత్వసేవల ప్రభావం ప్రభుత్వరంగంలోని జీతము స్కేలు విషయాలపై చూపును. యీ విషయాలనే ప్రభుత్వేతరరంగంలోని జీతము స్కేలు, యితర లాభాల విషయాలతో పోల్చి చూసినచో చాలా వ్యత్యాసము కనిపించును. ఒకే విధమైన ఉద్యోగములకు వేరు వేరు విధాల జీతాలస్కేలు ఉండినచో వారిలో అసంతృప్తి, విసుగు కల్పించును. ఈ ప్రభావం వలన ఉద్యోగులు ప్రభుత్వ రంగంనుండి ప్రభుత్వేతర రంగాలకు పోయే వాతావరణ మేర్పడవచ్చును.(జి)

మనదేశంలోని ముఖ్య విషయమేమిటనగా ప్రభుత్వ సంస్థల నిర్వహణ విధానాలలో రాజకీయాలు జోక్యము కలిగించుకొనును. యీ సంస్థలలోని భర్తీ విషయాలలోను, పదోన్నతి విధానాలలోను, ఎప్పుడైన ఉద్యోగులపై క్రమశిక్షణా చర్యలు తీసుకొనిన విషయాలలో రాజకీయవేత్తలు జోక్యము కలిగించుకొనుచున్నారు. ఎన్నోసార్లు రాజకీయ వేత్తలు వారి స్వార్థపరలక్ష్యాలకు శ్రామికులను వినియోగించుకొన్నారు. ఈ విధంగా వివిధ రాష్ట్రాలలో నడచుచున్న ప్రభుత్వసంస్థలు ఎప్పుడును రాజకీయవేత్తల జోక్యంనుండి విముక్తి కాలేదు.

## ముగింపు

ప్రస్తుత నిర్వహణ సిద్ధాంతాలు కేవలం పాశ్చాత్యదేశాల అనుభవాలమీద ఆధారపడి నిర్మింపబడినవి. కావున ఆ సిద్ధాంతాలను తిరిగి పరిశీలించుట అవసరము. మనదేశ విషయంలో మన జాతి గురించి తెలిపెడు, పరిస్థితులను తెలియజేయు కొన్ని ప్రత్యేక సమస్యలు కలవు. వాటిలో భాష, ప్రాంతీయ తత్వము, అలవాట్లలో భిన్నత్వము, నిరుద్యోగిత అను సమస్యలు నిర్వహణపై చాలా తీవ్రమైన ప్రభావం చూపుతున్నవి. ఏ నిర్వహణ సిద్ధాంతము అయినా యీ సమస్యలుగమనించనిది ఆ సిద్ధాంతము వాస్తవమైనదిగాని సమర్థవంతమైనదిగాని కాదు. కావున ప్రస్తుతం ఆచరణలోవున్న మొత్తం నిర్వహణ సిద్ధాంతమునకు సామాజిక, రాజకీయ, ఆర్థిక, పరిసర ప్రభావాలను లెక్కలోనికి తీసుకొనే ఒక నూతన విధానము ఎంతేని అవసరము

## అధోజ్ఞాపికలు


(ఎ) డగ్లస్ మెక్‌గ్రెగర్, ది హ్యూమన్‌సయిడ్ ఆఫ్ ఎంటర్-ప్రయిస్: మెక్‌గ్రా హిల్ బుక్ కంపెని, ఇన్‌కార్పొరేటెడ్ న్యూయార్క్, 1960 పు 3,4.

(బి) హెన్రీ ఫయోల్, జనరల్ అండ్ ఇండస్ట్రియల్ ఎడ్మినిస్ట్రేషన్ : ఇంగ్లీషు అనువాదం, సర్ అయిసాక్ పిట్‌మన్ అండ్ సన్స్ లిమిటెడ్, లండన్, 949.

(సి) డగ్లస్ మెక్‌గ్రెగర్, అదే పు 17.

(డి) పి. ఎస్. చోహాన్, టూ ఫేసెస్‌ఆఫ్ ఇండియన్ మేనేజ్‌మెంట్ : లోక్ ఉద్యోగ్, బ్యూరో ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రయిజెస్, న్యూఢిల్లీ, 1974.

(ఇ) ఎమ్. కిష్టయ్య, సబ్ రీజనలిజమ్ ఇన్ ఇండియా, బుక్ లింక్స్ కార్పొరేషన్, హైదరాబాద్- 1977.

(ఎఫ్) డా.రాజ్ కె నిగామ్, కాంపోసిషన్ ఆఫ్ బోర్డ్స్ ఆఫ్ గవర్నమెంట్ కంపెనీస్-ది ఎఫిసీ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రయిస్, ఎడిటెడ్ బై ప్రొ. పి. వి. రామనాథమ్ ఎల్లీడ్ పబ్లిషర్స్ ప్రయివేట్ లిమిటెడ్, బొంబాయి, పు. 152.

(జి) హెచ్. కె. పరంజిపె-ది ఫ్లయిట్ ఆఫ్ టెక్నికల్‌పర్సనల్ ఇన్ పబ్లిక్ అండర్‌టేకింగ్స్, ఎ స్టడీ రిపోర్ట్, ది ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ న్యూఢిల్లీ, 963 పు 173.


(రచయితలు కాకతీయ విశ్వ విద్యాలయంలోని ప్రభుత్వ పరిపాలనా విభాగానికి చెందినవారు.)

# రజనీ ముఖము

శ్రీ పజ్ఝల కాళిదాసు

బారులు తీర్చి ఆకసముపై ముదమార విహంగపం క్తిసం
చారము చేయసాగె; వికసన్నవ పుష్పపరాగ గంధ గం
భీర మరుత్ కిశోరములు వీచె, దిశాంతము లందుస్వర్ణ రే
ఖారుచి మీరె వారిధర ఖండము లాముని మాపువేళలో.

ఆ యెలసంజ లేజివురులై విరిసంపెగపూలదండలై
చాయల మేల్మిరేకుల పసందులునై ప్రసరించుచున్న కెం
జాయల నాకళించుకొని శైలమహాశిఖరాళి మయ్యెపై
హాయస వీధికిన్ భువికి హాటక నిర్మిత పట్టభంగముల్!

వెలుగు రాజ్యమ్ముపై దాడి వెడలుచున్న
అంధకాసురుడు పంపినట్టి గూఢ
చారు లవనిపై క్రమ్ముచున్నార లనగ
నీడలన్నియు పొడవులై నిగుడదొడగె!

పడమటి కడలిం బగటిదొర
పడిపోవుట చూచి దెసలపడుచులు దిగులున్
బడుచుండి రనగ నలుపులు
కడలుకొనెను మన్నుమిన్ను గలసెడు చోట్లన్!

అంతట వేండిపూవులను అద్దిన పల్చనినల్లచీర భూ
కాంత ధరించెనేమొయనగా జిరుచీకటిచాయచుక్క పూ
బంతులు తోచె; తూర్పుమలపై పొడచూపిన చంద్రబింబమీ
వింతలం దొంగిచూచునొక వేలుపుకన్నియనాంగనంబడెన్!

ఉక్కిరిబిక్కిరై యుదధి యూర్పులకున్ విసుగెత్తి
రత్నముల్
ముక్కలుముక్కలై యెగిరిపోయెనొ మింటికి చిన్ని
చుక్కలై;
చక్కిలిగింతపెట్టెనొ వసంత సమీరము రేయికన్నెం బ్రా
గ్దిక్కు దరస్మితమ్ము లొలికించును వెన్నెల పుచ్చ
పూవులన్!

ఈ రజని మోముపై నీలి యిరుల కురులు
ముడులు వడును విరియ బారు కడలనెల్ల,
అక్కడక్కడ ప్రోగైన చుక్కలేల
విరగబడినవ్వు నిదియేదొ వింతయట్లు?



# రాహుకేతువులు

శ్రీ యస్. యస్. రెడ్డి

సంప్రదాయమే
కల్పవృక్షం
అని నూరిపోసేవారు
తిరుగుబాటే
ఆధునికం
అని కత్తిదూసేవారు
సాహిత్యవికాసానికి
రాహుకేతువులు !



శ్రీ వి.వి. బి. రామారావు

# పాటు

"యాటి మాంవా అలగ సూత్తన్నావ్?"

పైటను బింకంగా కప్పుకుంటూ అడిగినాది ఎరకమ్మ.

నాగులోడు సూస్తా నిలబడిపోనాడు. ఆడి కళ్ళల్లేదో ఎలుగు. సిగ్గొడిపోనాది ఎరకమ్మ. నేచి గుడిసిలో కెలిపోనాది. ఎన్నులోంచి ఆడికళ్లు గుచ్చుకుంటూనే ఉన్నాయి.

–ఎరకమ్మ సామాన్లు సర్దేసినాది. బొట్టిడికి జుబ్బా తొడిగి పసికూనని సంకనెత్తుకుంది.

"ఆదివోరం మాంవా! సంతకెళ్ళేదోవ ఆటేసుకుందాం. బేగొచ్చీసి బైస్కోపుకెళ్ళాల మరి నెగు మాంవా!"

-సల్లగెల్లి పోతన్న బతుకులు.

ఎరకమ్మకి మనువు కాకముందు ఆళ్ళ జట్టూ నాగులోడిజట్టూ ఇజానారంల కల్సినాయి.

ఇశాపట్నం పలాస కోచీనోంచి నాగులోడి జట్టోళ్ళు దిగినారు.

"ఓరి నాగులయ్య! ....ఓరోరి నాగన్న!" అంటూ తండ్రీ కొడుకుల్ని కావలించీసుకున్నాడు ఎరకయ్య.

"ఇదేన్రా నీ బొట్టి?" నాగన్న డిగినాడు.

"బండి నేటయినట్టుందిరో...." ఎరకయ్య దిగలు పడిపోనాడు.

బండికోసం సూడకేస్....ఎన్నాళ్ళకో కలిసినాం.... ఇయ్యాలకెటెళ్ళొద్దు ...నాకాడబత్తేలున్నాయ్....పదండెహ!"

గబగబా నాగులోడి బావు మేకల్ని తరింవేసినట్టు ఆళ్ళని మైదానంనోకి తీసుకొచ్చీసినాడు.

రొంటిసోనుంచిబీడీ తీస్తాఅన్నాడు నాగన్న: "ఒరేయ్ ఎరకయ్యా మనలో మనమాట, బొట్టి ఎత్తరైపోతంది... ఆటేపైనా నేర్సిందా?"

"బీడీ ఇటాడెయ్!" ఎరకయ్య దమ్ము లాగాడు.

సొపలిప్పేసి గూడు సేసుకుంటుంది ఎరకయ్య ఆడదాయి. ఎరకయ్యకి గూడు జటకాబండి గూడునాగా సుబ్బరగుండాలి.

"బొట్టి రజసొలా అయిపోయి బంతినా గెదగిపోనాది. మనువుమాట ఆలోసించినావా?"

"మంచి మనువురావాలగందా!"

"ఓర్రెరి మొగంవా..."

గట్టుమీద కూకున్న అయ్యకాడికొచ్చినాది ఎరకమ్మ.

"అయ్యా! నూనె కావాల... పావలియ్యమందమ్మ"

"ఒలేయ్ బంతిపువ్వా....ఇలా రాయే..." నాగన్న పిలిసినాడు. ఎరకమ్మ మొగమాట పడింది.

"ఒలేయ్‌సిలకమ్మా....ఈళ్ళకొండెయ్యే... ఎన్నాళ్ళకో కలిసినాం ...నువ్వు నూనేటీ తేవొద్దుగాని....అవునే....నీ పేరేటే?"

"చెప్పెహె...."ఎరకయ్య కసిరాడు. ఆడి మనసులో ఏదో తెలీని ఆలోసెన దొలిచేస్తంది.

"ఇలాయే!" సెయ్యిబట్టుకునిలాగినాడు నాగన్న. "నీ పేరుసెప్పే!"

"ఎరకమ్మ"

"మా యమ్మో!....ఒరేయ్ ఎరకయ్యా.... నీతో కుసింత మాటాడాల... చూడొలే....సిలకా....ఈ బొట్టిని నీకాడడికో....మేంవెల్లి కుసింత టీ తాగొత్తాం నెగుంబ్బీ"

అయ్య దరిజా సూసి తెల్లబోనాడు నాగులయ్య. బీడీ ముక్కకి ఐదుపైసలిమ్మంటే ఇయ్యడుగాని ఇదేటొ!

"ఒరేయ్. ఈ రూపాయెట్టుకెల్లి పిత్తపరిగెలొట్టుకు పొర్రా...."

దీంతో నాగులయ్యకి కళ్ళు తిరిగిపోనాయి.

"ఓరీ ఎరకయ్యా....నీ బొట్టిని మావోడికి మనవుస్తే ఎట్టాగుంటదంటావ్?"

పుణుకులు పచ్చడిల నంజుకుంటూ అడిగినాడు నాగన్న.

"నాకేటి తెల్దు....నా ఆడదాయినడిగి సూడు!"

"అశనాయాల్ని అడిగేదేట్రా సన్నాసీ....ఏదీ పట్టాయిడు బాంవూ, రెండు టీయలు....బొట్టిడి మనువుకి మూడొందలు జాగర్త సేసినాను....అది నీకిప్పుడిచ్చే మంటావేటి?"

ఎరకయ్య ఆలోచనలో పడ్డాడు.

"ఏట్రా టన గుండిపోనావు?"

"ఒద్దునే ...రేపు గజపతినారం ఎల్లి...."

"మీ ఆడదాయితో...."

ఎరకయ్యకి ఏదో ఆలోసెనొచ్చినాది.

"నా బొట్టి ఆటసూసినావా?"

"మన గూటి పచ్చికి ఆటరాకేటిసేస్త దెహ!"

ఎరకయ్యగోడికి మనసు నాగుతోంది. మూడొందలకి బొట్టినిచ్చేస్తే మరి ఆడు ...

నాగన్న ఎరకమ్మ తల్లికాడ కెల్లినాడు.

"రాయమ్మ సెల్లెమ్మ....నీ బొట్టిని నా బొట్టిడికి మన వియ్యాలి ఇవిగో మూడొందలు...."

"అదేట్రలగంటవూ ....గజపతినారంల ఆడు ఎనిమిదొందలిస్తామన్నడు....ఇంతకీ దాని మనువుకేటి తొందర...." ఎరకయ్య మనసులోని ఆలోసెన కక్కేసినాడు.

"ఎవుడ్రాడు....నామీద పోటీ....రాయే బంతిపువ్వా మావోడ్ని సూసినావుగందా....అది ఆటాసూద్దువు" ...

పిత్త పరిగెలొట్టుకుని నాగులోడొచ్చేసినాడు.

"ఉరేయ్ నాగులయ్యా... డండెం వేసి....దీనికి నీ ఆట సూపించు."

–యిద్దెం....యిద్దెం....డువ్వెండువ్వెం డువ్వెంట

సోగ్గా గడెక్కితాడుమీద నడుస్తా కిందికిసూస్తన్నాడు నాగులయ్యా.

"వాలెహ! కుస్తీకిరాయేస్! ఎరకయ్యరిసినాడు. ఒక్కసిటంలో సెబాస్ అనీసి కూకుండిపోనాడు.

"ఏట్రా ఎరకా....ఇప్పుడేటంటవు?"

"ఒలేయ్ బొట్టీ....నువ్వా గడెక్కవే...." ఎరకయ్య కూకేసినాడు.

సిటంల గడెక్కి పోనాదెరకమ్మ.

నాగులయ్యకి కళ్ళు కిందకు దిగనేదు. నోట్లో రెండు వేళ్ళెట్టుకుని 'ష్యయ్! ష్యయ్' అని ఈల వేసినాడు.

ఒకపాలి ఇటూ అటూ తిరిగి సేతులున్న గడ కింది కిసిలీసినాది ఎరకమ్మ.

"ఓసినీ!" నాగులయ్య నీసెనాడు.

నిబ్బరంగా పైటతీసి నడుంకి సుట్టేసినాది తాడుమీదే.

కిందకి సూసినాడు నాగులయ్యా.

అడినేసూస్తన్న ఎరకయ్య కిసిక్కున నవ్వేసినాడు.

"కాలం మారిపోతంది ఎర్రిబాగులోడా .... ఒరేయ్ నాగన్నా .... ఇప్పుడేటంటవ్.... ఆళ్ళెనిమిదొందలిస్తదంటే నమ్ముతావా నేవా?"

ఇదేదీ పట్టనట్టు బొట్టి కాలిబొటకన వేలంత కైవారం తాడుమీద ఒయ్యారంగా వొల్లిరుసుకుంటంది.

"మనువాడితే దీన్నే మనువాడాల ...." నాగులోడనుకున్నాడు.

"ఓలమ్మ ఒందలకేటి....బొట్టి పిక్కనాగుంది...."నాగులోడి కళ్ళనోకి నికార్సుగాసూస్తన్న అడి తల్లి గట్టిగానేసినాది. "ఇక సాలు దిగిరాయమ్మ"....

"ఓరి సన్నాసీ....ముందెకెళ్ళు... గెంతెహ్" నాగన్న చెప్పినాడు. నాగులోడు ముందుకెళ్ళినాడు....అడి సేతుల్లోకి గెంతీసినాది ఎరకమ్మ.

"ఓరయ్య....నా యజమాని మాటకేటిగాని .... ఆరొందలు తీస్కో...." నాగులోడి తల్లి అనీసింది.

"అదేటోలమ్మ... నీ బొట్టిడికియ్యాలనే గంద ఇన్నాల బట్టి దానికి మనవుసూడకుండున్నాం...." ఠపీమనీ ఎరకమ్మ తల్లి ఒప్పేసుకుంది.

–డబ్బు సేతులు మారిపోనాది. బంతిపువ్వ మనువు కొచ్చేసినాది.

ఏడాది తిరక్కుంట బొట్టి బిడ్డ నెత్తుకుంది.

-ఎరకమ్మ గాడొట్టుకుని తాటిమీద నడుస్తుంటే కళ్ళప్ప గించి సూస్తండు నాగులయ్య. ముగ్గురు బిడ్డల తల్లయినా ఎరకమ్మ వాడిపోని బంతిపువ్వు నాగుంది.

"ఇదేటినగ!" ఎరకమ్మ కెవాగో ఉంది.

సేతిల గడ రెండో సేతిలోకి మారుసుకుంది....గేసిటం అగి గడ ఇసిరేసినాది

కిందనుంచి ఖంయ్ ఖంయ్‌మని ఈలలు.

పెద్దోడు డప్పు బేగేసేస్తన్నాడు.

నాగులోడి మనసు మనువాడినదాయికానించి ఇన్నోడి కాడికి దిగిపోనాది.

ఈడేటినగ డప్పు కొట్టుకోని - గజం మీనించి దూకి తాడుమీద నడిసి ఉంగరంల దూరడమేనేటి....మూడు పొద్దు లయి వంతులెవుడో గూడేని కొచ్చి నూరిపోస్తన్నడు.

నాగులోనన్నావ్ కదూ నీ పేరు. నీ గుంటడ్ని బర్లేసి రెండు ముక్కలు సెప్పించుకో-పబుత్వం నాలాంటోళ్ళ కోసంవే కోట్లు కరుసెడతంది....నువ్వూ అచ్చరాలు దిద్దుకో. రేత్తిరి బడికిరా .... దేసం ముందుకుపోతంది.... మీరూ ముందుకెల్లాల మరి.

నాగులోడి కిదేటీ బోదయినాది గాదు ముందు.

-ఏటి మాంవా? ఎవురీయ్న?" ఎరకమ్మడిగినాది.

"ఎవురేటే....మనంవూ మన బతుకలూ సూడు....మన బొట్టిడు సదూకుంటే సదూకోడానికి డబ్బులిస్తరంట....మనో డికీ సదువుగావాల కదే...."

"మనకేలయ్యవన్నీ ....మనయిద్దె మనకుండాది ... ఆ బగవంతుడిచ్చింది సేన....మనకాలూసెయ్యీ గట్టిగుండాల గాని మనకేల ఈ సదూలు.... అయునా గవుర్నమెంటోడు మననేల ఇయన్నీ ఉబ్బరనియ్యాల?"

"అదేటే ఊరూరా తిరగకన్నా ఈడనే ఉంటున్నాం గందా.... మొన్న ఓట్లెక్సన్‌కి పడేసి రూపాలిచ్చినారు గందా...మన ఓటు...."

-"అదేమిటి నాగులయ్యా....విశాలభారతంలోనువ్ ఓ పౌరుడివి ఓమనరాజ్యాంగసూత్రాలప్రకారంఅందరంసమాను లమే అందరికీచదువూ, ఆరోగ్యమూ, ఉద్యోగమూ దొరకాల"

"అయ్యోఓరండయ్యగోరూ! నాకు తెలీదుగుతానూ గవుర్నమెంటోడికి డబ్బెలా వస్తంది? మనకివ్వరి నిచ్చిస్తా డేటి?

-"అవన్నీ నీకేలే ఎర్రి మొగంవా....అయ్యాఓరయ్యా మీ కాళ్ళట్టుకుంటా....బొట్టిడికి అచ్చరాలు సెప్పయ్యా. నాకు సేతయిందిచ్చుకుంటా!"

—రొంటిలో పదికాయితం ఎట్టుకుని నాగులోడు బయలదేరతంటే ఎరకమ్మ అడ్డగించినాది.

"మనకేలయ్య సదూలు....మా యయ్యా,మీయయ్యా సమాకోనేమగిందా....ఇప్పుడేటయి పోనాది....మనం బాగో నేవా....మనకేటి నోటు సెప్పు."

"మన్నాగ బొట్టిడు ఆడక్కర్నేదెహ! ఉజ్జోగం సేసు కుంటడు"

ఎరకమ్మేటన్లేదు.

-"ఇయ్యాల పలకా పుస్తకము యిచ్చినారు... ఒచ్చే సెల్ల గుడ్డ లిస్తరంట...." బొట్టిడు సెప్పినాడు. అది మొగం అంతా ఎలుగే ...ఎరకమ్మ ముందుకొచ్చి సటుక్కున అదిని గుండెల కదుంముకుంది

-బాగా సదూకో రానూకాలూ నేను పొద్దుగూక్కుండ పారొస్తా... సట్టులచారున్నం ఎట్టినాను....బర్నించి రాంగానే రెండు ముద్దలు తిను.

-సిన్నదాయిడప్పేస్తంది... సంటిదాయికిపాలు గుడు పుతూ కూకుంది ఎరకమ్మ సెట్టునీడ్న.

నాగులోడు ఇద్దెం సేస్తన్నాడు.

అయివోరయ్య నా గుంటడికి బాగసదూసెప్పయ్య... తాడుమీద ఇద్దెంసేస్తన్న నాగులోడికి నాలికి పిడసకట్టుక పోతంది

"ఎండ నావుగుంది....ఇయ్యాలేటో....మాంవ అదో నాగయిపోతండు....ఈసంటిది పాలొదలకున్నది!

-ఎరకమ్మ సంటిదాయిని పెద్దదాయికిచ్చి డప్పందు కుంది.

డప్పు ఏగం తగ్గిపోనాది. ఆట కడంబటి కొచ్చేసినాది

సుట్టూ మూగినజనం సిలవరి పళ్ళెంల డబ్బు వేస్త న్నారు....ఎరకమ్మ పళ్ళెం జనంల తిప్పుతంది.

-"ఇలా రాయే !"

మైకంలో ఓ గొంతు. ఎనక్కి తిరిగిసూసిందెరకమ్మ. సేతల రూపాయి చిల్లరట్టుకుని "సిల్లరియ్యే !" అంటండు మడిసి.

జనం పలచబడి పోతన్నారు.

ఎర మ్మకి సటుక్కున యాద స్తొచ్చినాది.

"ఏటే గుంటా ! .... మరిసిపోనావేటే.., ఇయ్యాల్టికి తగిల్నావ్ ..."

జనం ఎంత బేగిపోగయినారు అంత బేగి సెల్లాసెద రయిపోనారు.

'ఈడెక్కడ్నుంచొచ్చినాడూ!' ఎరకమ్మ సిటం తెల్ల బోనాది.

"రాయే రూపాయిచిల్లరందుకో...."

ఎనక్కి తిరగబోనాది ఎరకమ్మ. పరుక్కున రైక సించేసినాడు. కూడికుండ తిన్నిసి "మాఁవా! "అని అరిసేసి నాదెరకమ్మ.

నాగులయ్య బద్దకంగా సూసినాడు.

రొమ్ముజారి కిందడిపోయేట్టు ముందుకొస్తంది రోజు టుంటూ.

ఎనకాలే....

"ఓరా గురా ! దాని ఎజఁవాన్ని నే బతికున్నా[నా." నాగినాలుగిచ్చుకున్నాడు. "తాగుబోతు నాయాల... నీ కే[లాడది... బొరిగిల్ల తొంగోరాదూ."

బూమ్మీదడిపోయిన మడిసి మట్టి కరుసుక పోనాడు.

"ఎవుడీడు?"

"నా మనువుకి ముందు ఈడికిద్దాఁవనుకున్నారు. జులాయెదవ... జట్టొదిలి పారిపోనాడు. ఇయ్యాలిక్క డగోరించినాడు. నువ్వేటిమావాఅలగున్నవే?"

"కాసింతసలపరంగుందే..."

"ఎలిపోదాం మాఁవా.. ఈడితో మనకేం.. కల్లు తాగేసి శతం నేకుండొచ్చినాడు.."

ఎరకమ్మ మనసు గిజగిజ లాడిపోతంది.

నాగులయ్యకే ఒంటి మీద శతం నేదు.

"మాఁవా! మాఁవా" కుదిపి నేపినా దెరకమ్మ.

'తొంగోనీయే .."

నడిరేత్తిరి పేలాడ నొట్టుకుంది. "ఏ[టా నీ కెంత దయిర్యం... ఆడదాయిని... ఒట్టుకుంటె నీ దేటి తప్పు నే. అదీ నువ్వు ఆ నాడు కులక్కపోతే ఇయ్యాల ఇంత మందిల దానిసెయ్యెట్టుకుంటవు..."

"మాఁవా.., మాఁవా! ఏటిమావా అలగంతవు.. నేనేటిజేసినాను?... అడెవుడో.. మా యయ్యకి డబ్బు ఆశ సూపి... సచ్చినోడు.. మనంవూ...మన ఆటా ఒదిలేసి జులా యోడై పోనాడు..."

ఎరకమ్మ నాగులయ్య నుదర్న సెయ్యేసిసూసినాది.. పొగర్లొస్తందొళ్ళు.

'వయిజ్జుడికోడి కెలదాంనెగు"

"ఉండెహె! వయిజ్జుడేటి సేస్తడు..."గసిలిసినాడు.

పొద్దు పొడిచేవరకూ జాగారం సేసినాది ఎరకమ్మ.

.—తెల్లారి బడికెలి పోతానాని కంగాళిసేస్తండు బొట్టిడు.

"ఉండ్రయ్యా! నీయయ్యకేటి బాగోనేదు. పొయ్యి వీడికేటి నేదు... లగెత్తుకెల్లి ఓ అటేసుకునొస్తే.. ఇయ్యాల నచ్చివోరం... సంతదోవనేద్దాం నెగు.."

"అయివోరు గుడ్డలిస్తానన్నడు... ఇయ్యాలెల్లక పోతెనెట్టా?"

"గుడ్డలొద్దు వేటొద్దు... నువ్వద..."

"ఆడిసేత ఆడించకే...ఆడుఆటమర్సిపోనాడేటో"

"ఆడూ ఆడక నువ్వు ఆడక నేనెట్టాడతాను.... ఇయ్యాలాడ నేను....నాకుసలపరం పుట్టుకొస్తంది. నేనొంటరి నెల్లలేను...."

"ఓసినీ సిగదరగ ! ఆడేటిసేత్తడే... నిన్ననే బొమిక లేరిసినాను గందా .... ఏదో పనూ సూపించబోనాడు ఎ[రి మొగం...."

"అలగినుకుమాంవా. ఆ రేత్తిరి సలపరంలేటన్నవో తెనుసా....నాకు గుండె మండిపోతంది...."

"నేనేటి, నిన్నేటి, అనకంవేటి..."

నాగులోడి పెదీమీద సిందులాడతన్న నవ్వుసూసి అదిసెయ్యి తీసి గుండె మీదెట్టుకుందెరకమ్మ.

"పదెహ, మలిపూదెళ్దవులే....

— .... డుంవిం డుంవిం డుంవింట — డప్పే స్తం దెరకమ్మ.

సంతకెళ్లిదోవ జనం పోగవతన్నారు.

బెదురు బయటొడని కళ్ళుసెక్రాల్లాసేసుకు సూ స్తందెర కమ్మ సుట్టూ.

సంటి దేడుపునంకించుకుంది. డప్పొదలడానికిల్లేదు. డప్పువాయిజ్జం ఇంకానగెత్తుకుపోతంది....కూన ఏడ్పినపడ కుండోయించె స్తంది. సెవులు గింగుర్లాడిపోతన్నాయి.

కన్ను మూసి తెరిసేనోగా బొట్టిడు కిందొడిపోనాడు.

"అమ్మో !" అని కేక డప్పు మోతలినబడ్నేదు.

"ఓలమ్మ, ఓలమ్మో! నా బొట్టిడో !"

సిటంల సెతంవొచ్చి వొళ్ళు తడిమిసూసింది...."నెగు రయ్య నెగు...."

"మరేటినెగుస్తాడే....దొంగనంజకానా....ఆడికి సదూ కావాల.... నీకు మొగుడు కావాల....ఆళ్ళకి బుద్దినేదే...."

"ఏటి కూసినావ్రా నీ...."

రొప్పుకుంటూ ముందుకొచ్చినాడునాగులస్యు.

"నాయయ్య నూకాలూ .... దెబ్బ తగినిందేట్రా.... వొస్తందా....సూడనాయినా.... నాకానొకపాలిసూడ్రా...."

-డప్పు శబ్దం ఆగిపోయేసరికి జనం పలసనై పోత న్నారు ..

పాటొడిన బొట్టిడు నూకాలు కదలకుండ కళ్ళిప్పితూట్లు పొడిసే ఎలుగుసూసి మొగం సిట్లించుకు మూలిగినాడు "ఓయమ్మో !" యని.

••••••••••••

# మధ్యతరగతి మనిషి

## శ్రీ కె. అంజయ్య

వాకిళ్ళు ఊడుస్తున్న చప్పుడు
గుండెల్ని సానబడుతున్నట్లు
గూరాఫి బూట్ల చప్పుడులోనే
మగతగొన్న ఆలోచనలు
ఇప్పటికి తెప్పరిల్లాయి.
పశువులు పొలాని కెల్తున్నాయి
నాగళ్ళమోత రాపిడ్లు
శరీరాన్నంతా చెక్కుతున్నట్లు.
సున్నపురాళ్ళు కాలుతున్నట్లున్నాయి
పొగ. .పొగ...ఊపిరాడనీయకుండా.
ఇవన్నీ మంచంపై పొర్లుతున్నంతకాలమే
నాలోని నిశ్శబ్దప్రపంచం బద్దలు కొట్టబడగానే
దృశ్యాల్ని పునర్దర్శనం చేసుకోవాలనే తపన
జీవితాల్తో ఆ రకంగానైనా ఏకంకావాలనే కోరిక
ఓ సమిధగానైనామారి
ఆ జీవితాలకు వెలుగు పంచితే బావుండేది.
ఉప్పొంగుతున్న పరివర్తనను బూడిదచేస్తూ
రాబోతున్నానని కేకేసే నల్లా చప్పుడు
ఏమండీ....అనే పెళ్ళాం కేకలు
సాంసారిక రంగంలో
కల్వంలో మందులా నూరబడడం.

••••••••••••••••••••

# ఆంధ్ర మహా భారత నిఘంటువు

18 పర్వాలు, 63 ఆశ్వాసలలో పరిపూర్తి చెందిన ఆంధ్ర మహాభారతానికి ఈనాటికి సమగ్ర నిఘంటువు తయారై అందులోని అచ్చుల (అ. ఔ) సంపుటాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1979లో ప్రచురించారు. ఈ నిఘంటు నిర్మాణక్రతువుకి యజమాని, ఋత్విక్కు శ్రీ అబ్బరాజుసూర్యనారాయణగారు. ఉభయభాషా ప్రవీణ ఆయుర్వేద వైద్య విద్వాన్, ఆయుర్వేద విశారదపరీక్షలలో శ్రీ అబ్బరాజువారు ఉత్తీర్ణులై స్వగ్రామమైన ఆదిపూడిలో కొంతకాలం వైద్యవృత్తిలోను, పెరచోట ఆంధ్రోపాధ్యాయ వృత్తిలోను ఉండేవారు.

వీరి అన్నగారగు విజయరాఘవయ్యగారితో 1936లో ఒకనాడు సాహిత్యగోష్ఠి జరుపుతూ అబ్బరాజువారు "తిక్కన ప్రపంచ కవి" అని నిర్ధారణ చెయ్యటానికి ఈ నిఘంటు రచనకు ఉపక్రమించారు. ఆ తరువాయి కథ అబ్బరాజువారి పీఠిక వల్ల విదితమవుతుంది. 1954కి కొంత భాగం నడిచింది. 1955 లో అన్నదమ్ముల ఎడబాటు 1974కి ఒక రూపం వచ్చింది. అదే ఏట వేటపాలెం సారస్వత నికేతనంలో అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి దర్శనం చేసుకొని అబ్బరాజువారు మొత్తంమీద 1979 నాటికి ప్రథమ సంపుటాన్ని అకాడమీ ద్వారా ప్రకటించుకో గలిగారు. ఇది నిఘంటు అవతరణకు పూర్వరంగం.

"దుర్గమూర్ధజల గౌరవ భారత భారతీ సముద్రా"న్ని "బుద్ధిబాహు విక్రమంతో" అబ్బరాజువారు దీరియంగ ఈదడానికి పూనుకొన్న సాహసానికి ఆశ్చర్యం వేస్తుంది. భారతానువాదం పూర్తయ్యే సరికి మూడువందల ఏళ్ళు పట్టింది. ముగ్గురు మహాకవులు నడుం కట్టారు. దానికొక సంశోధిత ముద్రణ తయారు చెయ్యటానికి వందమంది సహాయం కావలసి వచ్చింది. నన్నయ, తిక్కనల పద ప్రయోగ సూచికల నిర్మాణానికి మరో వందమంది చిల్లర పండితులు పనిచేశారు. ఏ అంగబలం, అర్థబలం హడావిడి లేకుండా గుప్పు చప్పు కాకుండా మారుమూల గ్రామంలోనో కూర్చుని వాణి నా రాణి" అన్నట్టు అబ్బరాజువారు నిఘంటువు తయారుచేశారంటే ఈరోజుల్లో అద్భుత సంఘటనే.

1615 అచ్చు పుటలో కవిత్రయం వారు వాడిన సమస్త పదాలకు అర్థాలు ఇవ్వడం జరిగింది. ప్రయోగాలు చూపెట్టారు. పూర్వ జన్మ వృత్తాంతాలు తెలిపారు. పాఠాంతరాలు చర్చించారు. మూల భారత సంస్కృత ప్రతులతో పోల్చి చూపేరు. జాతీయాలకు, సంస్కృతాంధ్ర సూక్తులను కలుపు కొన్నారు.

ఉదా : అంగాదంగాత్సంభవసి

వ॥ పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి
గర్భమునఁ బుత్తుండై తాన యుద్భవిల్లుఁ
గావున 'యంగాదంగాత్సంభవసి' యనునది
యాదిగాఁగల వేదవచనంబుల యందును

(...ఆది 4 85)

అంగాదంగాత్సంభవసి హృదయాదధి జాయసే
ఆత్మావై పుత్రనామాసి సజీవ శరదశ్శతమ్
ఉపజిఘ్రన్తి పితరో మంత్రేణానేన మూర్ధని

(సం. భా. ఆది 98.56.)

"అంగాదంగాత్" అను పై మంత్రముచేఁ దండ్రి తనయుని మూర్ధము నాఘ్రాణించునని సంస్కృతభారతము నుండి తెలియుచున్నది."

నిఘంటు రచన సూని, శ. ర. ల ఆదర్శంగానడిచింది.

కవిత్రయంలో ఆద్యుడైన నన్నయ త్రోవనే తిక్కన, ఎర్రనలు తమ తమ రచనలు సాగించారని అప్పకవి చెప్పినా నన్నయకు చాలాకాలం తర్వాత కాని కడమ ఇద్దరు భారతం పూర్తి చెయ్యలేదు నన్నయ కాలానికి చెల్లుబాటు అయ్యే కావ్యభాషకూ, ఆతడేర్పరచుకొన్న నియమాలకు తరవాత వారి రచనకూ తేడా కనిపిస్తుంది. ఈ తేడాలను తెలుసుకోడానికి సమగ్ర నిఘంటురచనా సంకల్పం గొప్పదయినా ప్రథమతః నన్నయ భారత నిఘంటువు వెలువడితేనే కాని కవిత్రయనిఘంటువుకి ప్రామాణికత్వం ఉండదు.

"ఈ నిఘంటువులో నన్నయపదాలన్నీ వస్తాయికదా వేరే నన్నయకని ఒక కోశం ఎందుకు?" అని కొందరు అనుకోవచ్చు. కాని నన్నయభాషకు ఈ నిఘంటువులో ఇవ్వవలసినంత గౌరవం ఇవ్వలేదనే చెప్పాలి ఒక్క "అవలంబించు" అనే పదం తీసుకోండి. దానికింద ఇచ్చిన పర్వాలు ఈ విధంగా ఉన్నాయి. ఉద్యోగ, అశ్వమేధ, సౌప్తిక, ద్రోణ అది. గ్రంథంలో చాలాభాగం ఇదేవిధంగా నడచింది. నన్నయవాడిన పదానికి ఏ విధంగా అర్థం మారిందో చెప్పటం కష్టమవుతుంది. తిక్కన భారతం ప్రధానంగా దృష్టిలో పెట్టుకొని నిఘంటు రచన జరిగిందని చెప్పడానికి నన్నయ పదాలు ఎన్నో ఎగిరిపోయాయి. అంగ్యాజనులు 1-3-156, అండజశయ్య 2-2-118, అక్రోధనుడు 1-3-145, అక్షయలోకము (స్వర్గం) 1-5-70, అక్షయలోక సుఖము 3-2-30 అగలించు 3-2-342, అగునంతకు 1-6-112, అగ్గువులు 1-4-250, అగ్రహారము 1-1-7, అడుగులంటు 3-2-215, అటి మోది కాష్టగుణములు 1-1-92, అదృష్టశ్రుతపూర్వము 3-2-125, అద్రుచు 2-1-162, అధమలోకము 1-2-129, అధమాన్వయము 1-2-58, అధికుడు 1-3-145, అధిక్షేపించు 3-1-228

'అ' కారం కింద పదాలను అక్కడక్కడ పట్టి చూస్తేనే ఇన్ని దొరికేయి. ఇంక నన్నయ పదాలు ఎన్ని అదృశ్యమయ్యేయో !

అర్థాలు చాలామట్టుకు పూర్వనిఘంటువులలో ఇచ్చినవే. అయినా కొన్నిటికి పాఠాంతరాలలోపోల్చి సరియైన అర్థాలు ఇవ్వడానికి అబ్బిరాజువారు ప్రయత్నించారు. అయినా "ఆ న ం ద" అనేపదం కింద సంతోషం, సుఖం అని అందరికీ తెలిసిన అర్థాలు వ్రాసి తిక్కనకు "ఆనద" పదం ముద్రలాంఛనని, ప్రతిపర్వాంతంలో ఈ పదం ప్రయుక్తం అయిందని చూపించవలసి ఉండేది. "ఓడరేవు" లో రేవు శకటకాని సాధురేఫకాదు. నందంపూడి శాసనం లోనే "ఱేవ" అని నన్నయ ప్రయోగించాడు. ఓడ "ఉడు" శబ్దతద్భవం. పూర్వం చుక్కలను బట్టి దిక్కు కనుగొంటూ ప్రయాణం జేసేవారు. ఏ విధము ప్రయోగంలో ఆరోపంలేదు. అదే విధంగా "ఏర్పడు" ఆదిపర్వం యోగంలో కూడా. ఎవ్వరికంటె (ఆది 7.8) అంటే అందరికంటే అని అర్థం. అజప (అను 3.345) అంటే జపంకానిది కాదు. అది హంసనాదమంత్రం. దీనికే అజపామాత్రం అని పేరు.

నన్నయ పజ్యయతుల్లో కొత్తదనం చూపెట్టారు. ఆ లక్షణం చెడకుండా పదాలు ఎత్తి వ్రాసుకోవాలి. ఎరంగు. ఈ పదం నన్నయ ఈ కింది పద్యంలో వాడినట్లు నిఘంటు కర్తలు చూపెట్టారు.

ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు,
రరుగ దెంచునప్పు దధిక భక్తి
నెరంగి ప్రియము పలికి తెరువిత్తు రిట్టిద
ధరు వీవు దీని దలంప వెట్లు. (ఆది 7, 111)

పద్యంలో సర్వయతి నడుస్తోంది. మూడో పాదంలో లక్షణం చెడింది. పాఠంతరాలలో దివిరి, తెరలి, పదాలు దొరుకుతున్నాయి. కాబట్టి "ఎరంగు" నన్నయ పద్యలక్షణానికి విరుద్ధం.

నన్నయ అగ్గురు అని ఉత్వఘటితరూపం వాడేడనడానికి "చందనా, గురు కాష్ఠములు గప్పముల్ గొనియె." అని సభా 1. 261 లో ప్రయోగించినాడు. ఈ పదమే ఈ నిఘంటువులో లేదు.

నిఘంటు నిర్మాణం పదిమంది చేతులమీదుగా జరిగినప్పుడే తప్పులు దొరలుతూ ఉన్నప్పుడు కేవలం భాషాభిమానం పరమావధిగా పెట్టుకొని ఒకేవ్యక్తి బృహన్నిఘంటువు చేబటడంలో తప్పులుండక తప్పవు.

అబ్బరాజువారి రెండోసంపుటం ఎప్పుడొస్తుందో? ఫ్యత్తు ఎట్లుండునో అని నిర్వేదం ప్రకటించారు. అప్పుడే అకాడమీ కార్యదర్శి తొలిపలుకులో "త్వరలో" అన్నారు. రెండేళ్ళు దొర్లిపోయాయి. రెండో సంపుటంకోసం అకా 79 లో పీఠికవ్రాస్తూ సంపాదకుడు అబ్బరాజువారు తాము డమీ ప్రయత్నించకపోతే ప్రథమ సంపుట ప్రచురణకు పక్షపాత వ్యాధిగ్రస్తులై ఉన్నామని, ముందు గ్రంథ భవి ఖర్చుపెట్టింది అంతా వృథా.

[ఆంధ్ర మహాభారతనిఘంటువు ప్రథమ సంపుటం (అ. ఔ) రచన శ్రీ అబ్బరాజు సూర్యనారాయణ. ప్రకాశకులు: ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. పుట 1645. వెల. రు. 15]

శ్రీ నిడుదవోలు వేంకటరావు



# ఈ పక్షి...

## శ్రీ జనజ్వాల

ఈ
పక్షి....
పనికట్టుకొనిఎగరడంలేదు—
మరి
పనికోసం—
రక్తానికి....
రుచిమరిగిన గుంటనక్కలు
ఈమధ్య-
పొరుగు అడవినుంచి
వస్తూ.... .... .... ఈ
పొదల చాటున నక్కి
వుంటున్నాయని...., .... ఈ
అడవిగుంటనక్కలతో
నేస్తం కడుతున్నాయని—
స్వేచ్ఛ తుపాకిలో....
గుండ్లయినాయని తెలుసు
ఈ
పక్షికి—
అయినా.... ఈ
పక్షి
ఎగరడం మానుకొన్నదా....
అంటే లేదు—
అమ్మే ఆకాశమని
అమ్మను నమ్ముకొన్న...
ఈ
పక్షి
సూర్యునితో.... ...
నేస్తం మానుకుంటుందా—
సముద్రాలపై
ఎగరడం నేర్చుకున్న
ఈ
పక్షి
శబ్దాలకు భయపడుతూందా
బ్రతుకుతెరువుకోసం....
ఎగరడం మానుకొంటుందా— !



# ఆ గుడిసె ముందు దీపం

విరిగిపోయిన ఆ మనస్సు
ఎల్లవేళలా మొద్దునిద్రపోతుంది
మిగిలిన శరీరంమాత్రం
చీకటింలో అవసరంగా; అలవాటుగా
మేల్కొంటుంది.

ఆ పెదవిమీదినవ్వు!—
కళ్ళలో ముల్లుదిగినపువ్వు!
బ్రతుకు బ్రతుకంతా
ఆకుపచ్చదనాన్ని కోల్పోయినతరువు!

మర్యాదను నశిస్తున్న వెలుతురులోకానికి;
మాలిన్యాన్ని భరిస్తున్న చీకటికూపానికి
సరిహద్దుల్ని నిర్ణయిస్తూ—రాత్రివేళ
ఆ గుడిసెముందొక దీపం వెలుగతుంది.

అది—కబళాన్ని వెతుక్కుంటున్న ఆకలికన్నులా;
మర్యాదలవస్త్రాలను రహస్యంగావిప్పేసిన
తీవ్రకాంక్షానలంలా,
రెండుముఖాలుగా గోచరిస్తుంది!

# కృష్ణ బాంధవి

నీలాకాశంలో నక్షత్రలిపిలో
నా ఆత్మవ్రాసుకున్న
లలిత భావగీతానివి నువ్వు!

"కాల"కాళిందీ సలిలంలో
కార్తీకదీపంలా వెలిగే
ధవళ శతపత్రానివి నువ్వు!

చీకటిపడిందని అందరూమొద్దునిద్రలోమునిగినా
కృష్ణసౌందర్యాన్ని చూచేందుకు
మెత్తగా అడుగులు వేస్తూవచ్చేదీపకాంతివి నువ్వు!

వగరుమేసినగుండెకోయిల
ఏకాంతంగా—అపరిచితభాషలో
తనకోసం తానుపాడుకునే పాటవు నువ్వు!

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి



## శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

# విశ్వబ్రాహ్మణ కవులు

ఆంధ్ర వాఙ్మయములో నన్నయ మొదలు నారాయణ రెడ్డిగారి వరకు (నేటి) అన్ని వర్ణములవారును, అన్ని కులాలవారును, కవితాశిల్పములో తమతమ సామర్థ్యము లను ప్రదర్శించినారు. ఎక్కువమంది నియోగిబ్రాహ్మణులు, రాజమంత్రులుండినను, బ్రాహ్మణేతరులలో రాజకవులను గురించియు, ఇతరవర్ణములకుచెందినకవులను గురించియు, విస్తారముగా పేర్కొనుటజరిగినది. ఆయా సందర్భములలో "ఈ కవిది ఫలాని కులము" అని మాత్రమే నిర్దేశము కన బడుచున్నదిగాని, ఒక కులమునకో, వర్ణమునకో చెందిన కవుల పారంపర్య విజ్ఞాన విశేషములను గురించి ఎవరును ప్రత్యేక పరిశోధనకు పూనుకొనలేదు. స్త్రీలలో ప్రజ్ఞావంతు లను గురించి కొంత జరిగినది. కాని శిల్పాచార్యులై మహోన్నత నిర్మాణములు చేసిన మహనీయుల కవితాశిల్ప మును గురించి చక్కని ప్రత్యేకరచన ఏదియుకానరాదు.

విశ్వబ్రాహ్మణుల శిలా శిల్పములు ఒక్క ఆంధ్రదేశ మందే కాదు భారతదేశమందు నలుమూలలలో నిలిచి వారి నైపుణ్యమునకు అచంద్రార్కమైన కీర్తి పతాకలుగా నున్నవి. అవి వారి విజయ ధ్వజములు, ఎంతెంతవేసి దేవా లయములు, గోపురములు, కొండ గుహలు, ఏకైక శిలా బృహన్నిర్మాణములు, మొదలు అతి సూక్ష్మములైన విగ్రహ ములు, ఆభరణములు భారత భాగవతరామాయణ చిత్ర ములు మొదలైన శిల్ప కళాఖండములను అఖండముగా నిర్మించియు, ఎచ్చటను తమ పేర్లను ప్రకటించుకొనలేదు. ఎక్కడనో ఒక్క జాకణాచార్యులవంటి వారి నామధేయ ములు దక్కినవి. ఏ రాజులో, ప్రభువులో, మంత్రులో పోషించగా తమ పనులను, భగవత్సేవగా నెఱవేర్చినారు. కీర్తికాముత్వములేని జాతి ఎవరిదనగా వీరొక్కరిదే.

మళయాంధ్రదేశములో ఈ శిల్పాచార్యులు కవులుగా కూడ దేశసేవ చేసినారు. ఒక విధముగా చూచిన అక్షర జ్ఞానము వీరి సొమ్ము. తెనుగు శాసనములను చక్కని వర్ణ క్రమమున శిలలమీదను, తామ్రపట్టికలమీదను ఈ కులము వారొక్కరే చెక్కుచుండిరి చూడగా మనకవీశ్వరులు కవిత చెప్పినవారేగాని వ్రాసినవారు కారు. వ్యాసమహర్షికి వినాయ కుడు, తిక్కన సోమయాజికి కుమ్మరగురునాథుడు, వ్రాయస గాండ్రుగా నుండవలసి వచ్చినది. పండితులు, కవులు, మహర్షులు, మహామంత్రులుకూడ వ్రాతలో బొత్తిగా ప్రవే శములేని వారుగా కనబడుచున్నారు "కవితచెప్పి యుభయ కవిమిత్రుమెప్పించి"నాడు కేతన. తమిళములో 'కంబర్ కవి పాడినార్' రాజాస్థానములలోను, సంఘములలోను వ్రాయస గాండ్రకు ఒక ప్రత్యేక స్థానముండెడిది. వీరిని లిపికారు లనెడివారు. అల్లసాని పెద్దనకూడ వ్రాసియెఱుగడు. తనకు తగిన వ్రాయసగాడు లేడేయని అంగలార్చినాడు. అంత గొప్ప కృష్ణదేవరాయలు కృతులువ్రాయుమని కోరగా ఇట్లు బదులిచ్చినాడు.

"నిరుపహతి స్థలంబు రమ
ణీప్రియ దూతిక తెచ్చి యిచ్చుక
ప్పురవిడె, మాత్మకింపయిన
భోజన, మయ్యెలమంచ, మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహతెలి
యంగల లేఖక, పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృ
తుల్ రచియింప మటన్న శక్యమే."

ఊహ తెలియంగల లేఖకులు కావలెనన్నాడు. అట్టి వారెక్కువగా ఈ శిల్పాచార్యులే. వీరు శిల్ప శాస్త్రమునకు కావలసిన గణితశాస్త్రమందును ప్రవీణులుగా నుండిరి. పావు లూరి మల్లన, వీరాచార్యులు మున్నగు వారివలె విశ్వ బ్రాహ్మణుడుగా నుండుగా యని నాకొక యనుమానము కలదు. శాసనములలో చివర మామూలుగా నిట్లుండును.

"కర్తా శాసనకార్యస్యభీమ సూరి శిరోమణిః
ఆజ్ఞప్తిః కటకాధీశో, గోకాచార్యో విలేఖకః"

ఆ కాలములో విలేఖకులు వీరే. వీరినే విశ్వబ్రాహ్మణులని, విశ్వకర్మ మతస్థులని, స్థపతులని, పంచాహణము వారని, ఆచార్యులని, బత్తులని, కమసాలులని ఆంధ్రదేశములో వివిధములుగా చెప్పుట కలదు. సంస్కృతములోని "కర్మచార" శబ్దమే కమ్మారయనికన్నడమందును, కమ్మాళియని తమిళమందును, కమ+సాలి యని తెనుగునందును మారినది. వీరు ప్రధానముగా శిల్పులు. బంగారు పని, లోహపుపని, కొయ్యపని, రాతిపని, గృహనిర్మాణము, వాస్తువిద్య, వీనిలో వీరు సమర్థులు. వీరికి వేదాధికారము, అందులో ఏ వేదమున అధికారముండినదో తెలియదు. అధర్వ వేదమునకు చెందిన వారోకారో తెలియదు. వీరిని పంచాహణంవారు, పంచాననంవారు అనుట కలదు. (పంచాహణంవారు: వడ్రంగి, కమ్మరి, కంచరి, కంసాలి, కాసె అను ఐదుగురు) వీరు దేవాలయ సేవకులుగాకూడ నుండిరి. (చూ. శాసన శబ్దకోశము-కుందూరి ఈశ్వరదత్తు) (ఓజు-శిల్పి. శిల్పుల పేర్లతుదినివచ్చు బిరుదాంకము-కుందూరి; (ఆచార్యులు-విశ్వకర్మ కులపురుష పట్టపుపేరు....లిఖితం పెద్దనాచార్య-లిఖితం బేతనాచార్య....వీరరాజేంద్ర ఆసరి....కుందూరి) బ్రాహ్మణులవలెనే వీరికి యజ్ఞోపవీతమును, శర్మ శబ్దమును కలవు విశ్వకర్మ యొక్క ఐదుగురు కుమారుల యొక్క సంతతి వారట. వీరిలో నాడు భేదములును ఉండెడివి. గుంటూరుజిల్లాలోని పలనాడు తాలూకా, అయ్యగారి పాలెములో, నొక శాసనములో (7 వ శతాబ్దము) జల్పేశ్వర దేవాలయమును, మయిందరామ, అనగా మహేంద్రరామ, ఉరఫ్ కల్గరాభరణాచార్యులను కమ్మకుల విశ్వబ్రాహ్మణుడు కట్టెనట.

పండ్రెండవ శతాబ్దపు శాసనము, గుంటూరు జిల్లా, మాచెర్లలో దొరికిన దానిలో ఈ ఆచార్యులు శివలింగములు నిర్మించుటలోను, విగ్రహములు చెక్కుటలోను, నాలుగు విధములైన ప్రాసాదములు కట్టుటలోను, క్షేత్రగణిత వాస్తు శాస్త్రములలోను, పనితనమందును, చాల నేర్పరులనికలదు. అభరణములు చేయుటలోను మహా రాజుల సింహాసనములు నిర్మించుటలోను సిద్ధహస్తులు. అవచి తిప్పయసెట్టియొక్క పెద్దలలో నొకడు.

"బాలార్కమనియెడి పద్మరాగము దాచె
నొక తాత కంచినాయకుని నాభి"

వీణలు, బల్లలు, చేతికఱ్ఱలు, పెట్టెలు మొదలు ఎంతో చక్కని నాజూకు శిల్పవస్తువులు, బంగారుముత్యాలు పొదివి చేసెడివారు. పట్టెమంచములు, సకినెల మంచములు, దోమతెర మంచములు, ఉయ్యాల మంచములు-ఇట్టివెన్నియో. నాడు గాజు రాలేదు గనను, వచ్చినచోట, మట్టిది కాబట్టి అసవిత్రమని కంచులోనే నిలువుటద్దముల తయారుచేయువారు. ఏనుగు దంతపుపనులొక విశేషము. విదేశ వర్తకులు వీరినెంతో విశేషముగా వర్ణించియున్నారు.

వీరి విషయము విశ్వకర్మ పురాణము లేక విశ్వబ్రాహ్మణ పురాణము అను సంస్కృత గ్రంథమున కలదు. దీనినే కాబోలు మూలస్తంభపురాణము అని నామాంతరము. ఆలయ నిర్మాణములు చేయుటచేత వీరిని స్థపతులనుటయు కలదు. శివువాలపథలో నారదుడు శ్రీకృష్ణుని ఈ మూడు లోకములకు స్థపతియనియు, అందు చేతనే ఈ భూలోకమును ఆదిశేషునిన్నెత్తిన ఎత్తి పెట్టగలిగినాడు అనియు చెప్పును.

"జగత్త్రయైక స్థపతిస్త్వముచ్చకైః
అహీశ్వర స్తంభ శిరస్సు భూతలమ్"

పాపరేని స్తంభముఒంటి, శిరస్సుమీద, శిల్పములో గోళమునుంచినట్లు భూమినిపెట్టినాడట. చక్కని శిల్పమువంటి చిత్రణము.

వీరందఱును శివభక్తులైనందు వలన కాబోలు భక్తులనబడి, కాలక్రమమున ఆ పదము బత్తులైనది. తమిళదేశములో ఒక చమత్కారమున్నది. ఒక బ్రాహ్మణుడు,

అయ్యరు ఒక కమసాలిని 'ఎన్న బత్తరే" అని సంబోధించిరా డట. అనగా, బత్తరే అనియు తమిళములో ప, బ, లకు భేదములేదు (అక్షరదారిద్ర్యము) కాన, పత్తరే = పదింటిలో సామి = ఐదు అని ధ్వనిచేత హేళనము. అందులకు ఆ కమసాలి నీవు నాలో సగమేనయ్యా అని ధ్వనించునట్లు "ఎన్న అయ్యరే" అన్నాడట. అనగా ఐ + అరె = ఐదు అర్ధలు = (2 1/2.) రెండున్నర, ఐదింటిలో సగమే గదా అనగా కమసాలి తానే గొప్పయని నిరూపించుకొన్నాడు.

వీరు రాజకీయములలో ఏ స్థానము వహించి యుండిరో గాని ఒక కాలములో ఆంధ్రదేశమందు గ్రామ కరణీకము పూర్తిగ వీరి కులస్థుల చేతియందే యుండినది. దానిని గోపరాజు రామ ప్రధాని యనుమంత్రి, విజయనగర రాజుల కాలములో, విశ్వబ్రాహ్మణుల నుండి తప్పించి, ఆరు వేల నియోగుల కిప్పించినాడట. అప్పటినుండియు నియోగి బ్రాహ్మణులకును విశ్వకర్మలకును స్నేహము తప్పి పోయి నది. అనంతామాత్యుని భోజరాజీయములోని విశ్వబ్రాహ్మణ దూషణకు ఈ రాజకీయమే కారణమైయుండును.

ఇటువంటి విశిష్ట విద్వత్సంస్కారము గల కులము వారు ఆంధ్ర కవిత్వములో కూడ ప్రవేశించి అల్లసాని పెద్ద నాదులతో సమాన స్థానమునందు కొన్నారనుటలో ఆశ్చర్యము లేదు. అట్టి కవిశేఖరుడు, నిరంకుశోపాఖ్యాన కార్యకర్త, కం దుకూరి రుద్రకవి. ఇతనిని కొందఱు అష్టదిగ్గజ కవులలో నొకడనియు, శ్రీకృష్ణ దేవరాయల యాస్థానమందుండిన వాడనియు చెప్పుదురు. ఈతడు చక్కని కవియై రాయల దర్శనమునకు రాగా, మంత్రులో, అమాత్యులైన రాజకీ యోద్యోగులో రాజదర్శనము కానీయక ఆటంక పరచు చుండిరట. అంతట నాతడు రాయలమంగలి కొండోజు అను మంగళ్ళ పెద్దయొక్క చెలిమి సంపాదించుకొని, ఈ పద్యము చెప్పినాడట.

"ఎంగిలి ముచ్చుగులాముల
సంగతిగా గులము చెఱుప జనుదెంచిరయా
యింగిత మెఱిగిన ఘనుడీ
మంగల కొండోజు మేలు మంత్రుల కన్నన్."

అని ఆ తర్వాత నతని పద్యమునుండి "ఉన్నతుల మధ్య పేదలకుండదరమె" అన్న భాగము రాయల చెవిలో ఆయన చదరంగ మాడునప్పుడు ఆయన కుమార్తె వలన పడగా క్షణమే ఆయన విచారణ చేసి దర్శన మిప్పించి నాడట రుద్రయ్యకు. ఆ తర్వాత రాయల గురువుపైన తాతాచార్యులను వాదములో గెలిచి అష్టదిగ్గజ కవులలో ఈశాన్య సింహాసనమును అధిష్టించెనట. రుద్రుడు గదా. రాయలవారియాస్థానములోపంద్రెండేండ్లుండెనట. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, మాదయగారి మల్లన, పుత్తేటి రామభద్రుడు, పింగళి సూరన, తెనాలి రామలింగయ్య, బట్టుమూర్తి యను మహా కవులతో వాదములు చేసెనట. అటు వెనుక క్రీ. శ. 1558, జయసంవత్సరమున గోల కొండకు పోయి మాలిక్ ఇబ్రహీంసుల్తాను వలన రెంట చింతల పాళెమును అగ్రహారముగా పొందెనట. నేటికిని అతనివంశమువారు దానిని అనుభవించు చున్నారట.

రాయల వారితని గౌరవించిన విధము ఈ పద్యము చేత తెలియుచున్నది.

"హరియౌస్కందపురీ జనార్దను వరం
జందెన్ మహాసత్కవీ
శ్వరులౌ రాయలవారి సన్నిధిని హ
ర్షంబందె బట్టంబు గ
టిరి యాందోళికలున్ జవోగ్రతరఘో
టగ్రహారంబు లం
దరు చూడం బహుమానమందె గవి రు
ద్రాఖ్యుండు తాముఖ్యుడై"

తానే యిట్లు చెప్పుకొన్నాడని యొకచాటువు-

"పాటీర గంధ హృద్ఘోటీ సమంచిత
ధాటీతిరస్కారి ఘోటకములు,
కోటీందు వరకళా పోటీడ దంభోళి
దంభోళినీసిత శంఖ వ్రజంబు
చేటీ విటాళీక వాటీ ఘనారామ

వాటీ శుభ గ్రామ వారములును
.... .... ....
... పృథుల సత్కృండలములు

ప్రౌఢిగై కొంటి గీర్వాణ పదసమృద్ధి
శతక హనుమజ్జయాది పశస్త కావ్య
ప్రీతి శ్రీకృష్ణ రాయధ్యాత్రీశు వలన
మనుకు లుండను రు దాఖ్య ఘన సుకవిని."

ఆంధ్ర వాఙ్మయములో అష్టదిగ్గజ కవులు రాయల వారి ఆస్థానమున తప్ప మఱియొకచోట కానరారు కాబట్టి ఇది నిజమైన యెడల, ఇతడు రాయలవారి సమకాలికుడే, పై వారందరును చారిత్రక పురుషులుగా నుండినది. వాస్తవమే గదా. మంగలి కొండోజు ఒక అసాధారణ వ్యక్తిగా నుండి రాయలవారికి ప్రీతిపాత్రుడై, మంగళ్ళమీదిను. డి పన్నులను తీసివేయించెనని కథలున్నవి. రాయల వారి నిర్యాణానంతరమీతడు గోల కొండకు పోయి యుండ వచ్చును. ఏలయనగా అష్టదిగ్గజ కవులలో ఇద్దరు అల్లసాని పెద్దనముక్కు తిమ్మన తప్ప మఱియెవరును రాయలవారికి కృతి సమర్పణలు చేయలేదు. అచ్యుత దేవరాయలు ప్రతి సంవత్సరము తిరుపతి దేవునికి ఒక కావ్యోపహారము నిచ్చు చుండినాడట గాని ఆ కావ్యములేవో, రచయితలెవరో అవి ఏమైనవో తెలియదు. ధూర్జటి, తెనాలి రామలింగాది కవులు తమ కృతులను, సామంతరాజులకును, మంత్రులకును, అంకితమిచ్చినవారే గదా. కాబట్టి, రాయలతర్వాత, రుద్ర కవి విజయనగరమును వదలి గోల కొండకుపోయి యుండ వచ్చును. చింతలపల్లెను దానమిచ్చిన తారీఖు మాత్రము తప్పుగా కనబడుచున్నది. ఇతడు 1620 నాటి గుంటుపల్లి భాస్కరుని సమకాలికుడని అప్పకవి వ్రాయుట నిజమైన యెడల రాయల సమకాలికత్వము కుదరదు.

ఇదంతయు ఎట్లున్నను –

ఈ రుద్రకవి కాళికాదేవి భక్తుడు పెదలింగన కుమారుడు, గురువరాచార్యుని శిష్యుడు, నెల్లూరుజిల్లా కందుకూరు వాస్తవ్యుడు. కందుకూరి చరిత్ర పరిశోధింపదగినది. ప్రాచీన కాలమున యుద్ధమల్లుడు, పండరంగడు మొదలైనవారు వెలసిన కాలమునుండియు ప్రసిద్ధ రాజధానీ నగరము. పురాతత్వ శాఖవారు త్రవ్వి పరిశోధింపదగినస్థలము.

రుద్రకవి యుక్క నిరంకుశోపాఖ్యానము నాల్గాశ్వాసముల ప్రబంధము. నిరంకుశుడను వేశ్యాలోలుని వృత్తాంతము కందుకూరులోని సోమేశ్వరస్వామికి అంకితము. ఈ నిరంకుశుడు తెనాలి రామలింగయ్య యొక్క నిగమశర్మకు అన్నయో తమ్ముడో. ఇరువురును సమకాలికులే గదా, ఇతని శైలి సరళముగా హృదయాకర్షకముగా నున్నది.

జనార్దనాష్టకమని, కందుకూరి జనార్దనస్వామి కంకితముగా ఎనిమిది పద్యములు వ్రాసెను. ఇతడొక శతకమును శ్రీహరిమీద "బలవదరిదరి కుహర భాస్వదరియదరీ దరీహరీ" యను మకుటముతో వ్రాసెనటగాని – అది దొరకదు.

అన్నిటికన్నను మిన్న ఈతని సుగ్రీవవిజయము. ఆంధ్ర వాఙ్మయములోనే కాదు, భారతీయ వాఙ్మయమందే ఇది మొట్ట మొదటి యక్షగానము. ప్రసిద్ధమైన కథను గ్రహించి రసవంతముగా వ్రాసినాడు మహాకవి. సీతా వియోగముననున్న శ్రీరామునియెదుట శాశ్వతభర్తృవియోగమునందిన తారయొక్క ఆవేదన వీరశృంగార కరుణ రస భరితముగా, ఒక అపూర్వసన్నివేశమును కవి సృష్టించుకొని ఒక చక్కని కళాఖండమును నిర్మించినాడు. దీనికి ప్రదర్శన యోగ్యముగా, త్రిపుట, జంపె, కురుచజంపె, అటతాళ, ఏక తాళాదులు మొదలైన గీతిభేదములతో వ్రాసి, యక్షగాన ప్రబంధమని పేర్కొని నూతన మార్గదర్శకుడైనాడు. ఈ విధమైన నాటకీయ ప్రజ్ఞ సమకాలికులైన పెద్దలలో కానరాదు. నిజముగా అల్లసాని పెద్దన ఆంధ్రకవితా పితామహుడైనచో, రుద్రకవి, ఆంధ్ర యక్షగాన పితామహుడు

ఇతని తర్వాత, ఎందరో కవులుండి యుండురుగాని మనకు తెలియవచ్చినవాడు బాడాల శంభుదాసుడు. బాడాల కోట కందుకూరు ప్రాంతమున కలదు. ఇతడు పెద్దాడ గ్రామ నివాసియని చెప్పుకొన్నాడు. సారంగధర ద్విపదలో –

శ్రీశైలనాథుని చెలువొప్పఁ దలచి
వాసిగా వైకుంఠవాసు భజించి,
వాలాయముగ బెద్దవాడ నివాసి
నీలకంఠునిసేవ నిరతంబు జేసి,
శాశ్వతంబుగను భూ చక్రంబునందు
విశ్వకర్మ సమాన విజ్ఞానమూర్తి
తలఁపగా మేటి గౌతమగోత్ర భవుఁడు
వలనొప్ప బాణాలవంశాబ్ధి చంద్రు
....  ....  ....
శంభుని వరమున జన్మించినాడ
శంభుఁడ బుధకవిజన మనోహరుడ,
పరమాత్ముఁడగు కొండపల్లి గోపాలు
వరమున వీరి కవిత్వ ప్రౌఢి మెరసి
తగుభంగి సారంగధరుని చరిత్ర
జగతిని ద్విపదగా సమకూర్తు వినుఁడు."

ఇది, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానముతో ఇంచు మించుగా, తులతూగునట్టి రసోత్తర ప్రబంధము, పూర్తిగా ద్విపద, పాడుకొనుట కనుకూలముగా రాగములు కూడ సూచింపబడియున్నవి. ఇందులో సారంగధరుడు సిద్ధుని ప్రసాదమున బ్రదికి, తల్లిదండ్రులను దర్శించి, చిత్రాంగిని బ్రదికించి, బుద్ధులు నేర్పి తాను సర్వము త్యజించి గురువు కడకు పోయి సిద్ధుడగును. దీనిని మా తాతగారు సం॥ ముద్రించినారు.

ఇతని బంధువేగాని, బంధుత్వము తెలియదు. బాణాల వీర శరభేంద్రకవి, శతకకర్త కనబడుచున్నాడు. ఈతడు ధూర్జటియొక్క కాళహస్తీశ్వరశతకమును అనుకరించుచు "సాంబశివా మహాప్రభూ" యనుమకుటముతో, ఐదు పాదముల ఉత్పలమాలికా వృత్తములతో ఒక మహాప్రభు శతకమును వ్రాసినాడు. శంభుదాసుని వంటి రసవత్తర రచయితగా కానరాడు. నెల్లూరుజిల్లా శాసనసంపుటములో III భా.లో ఒంగోలు 83, 1415 లో ముక్తి నూతలపాటి శాసనములో ఒక బాణాల లింగన భూదానము చేసియున్నాడు. చూడగా "బాణాల" అంటి పేరుగల కుటుంబముల వారు ప్రఖ్యాతులుండినట్లు తెలియుచున్నది.

ఈ బాణాల ఇంటిపేరునకును ప్రాచీన రాజవంశజులైన బృహద్బాణులకును ఏమి సంబంధమో పరిశోధింపవలెను.

తరువాత ప్రబంధ కవులు, విశ్వబ్రాహ్మణులుండి యుందురుగాని దొరకలేదు. వెదకిన వారి రచనలు దొరకవచ్చును. కాని యక్షగాన రచయితలు చాలామంది కనబడుచున్నారు. జాతి చేత శిల్పాచార్యులుగాన, యక్షగాన రంగమున వట్టి పద్య రచనకే గాక, ప్రదర్శన శిల్పమున కవకాశములు ఎక్కువ కాబట్టి, కావ్యనిర్మాణ చాతుర్యముతో సంగీత ప్రదర్శన విశేషములను జోడించి చక్కని యక్షగానములు రచించినారు "నాటకాన్తం హిసాహిత్యమ్."

నరుకూరి నారాయణకవి యనునతడు, కొండూరి వెంకటాచార్యుని శిష్యుడు, వెంకటగిరి ప్రభువైన వెలుగోటి కుమార యాచమనాయకుని కంకితముగా (క్రీ. శ. 1777-1805 నడుమ) పారిజాత నాటకమును వ్రాసి ఆడించెను. ముక్కుతిమ్మన గ్రంథముచేత తానుద్బోధితుడైనట్లు చెప్పుకొన్నాడుగాని పుణ్యకవ్రతమును మాని, సవతికయ్యమును ప్రధానీకరించి, రాధపాత్రను ప్రవేశపెట్టి, భామకలాపమును కలిపి దరువులు తాళములు మొదలైన రచనా విశేషములతో, హాస్యమును జోడించి నాటకీయత ప్రస్ఫుటమగునట్లు చక్కగా వ్రాసినాడు. దీనిని "ఆటభాగవత" మనెడివారట.

కురిచేటి సుబ్బరాయ కవి గౌరీశంకర విలాసమును 1889 ప్రాంతమున వ్రాసి ముద్రించినాడు. శివుని దారుకావన విహార విషయము నారదుని వలన గ్రహించి పార్వతి అలిగి, తలుపుకడ శివునితో సంవాదము సలిపి చివరకు సమాధానపడుట-ఇందలికథ. దోషములుండినను జనరంజకము. ఇతనితండ్రి నాగలింగయ్య, గురువు అమలగిరిశివరామయ్య. ఇందు హిందుస్తానీ సంగీతముకూడ కలదు. ఇతని పోషకుడు మినగంటి బండిమల వీరరాఘవరెడ్డి.

కడియాల వీహూరి ఆచారి, పోతులూరి వీరబ్రహ్మ నాటకమును వ్రాసెను. కొండశంకర కవియు ఇతనితో కలసి రెండవ కవికి దీనికి. ఇరువురి రచన, పరిమి వీరాచార్యులు వీరిని ప్రోత్సహించినవారు. ఇతనిది వినుకొండ సీమలో పోట్లూరు. ఈ యక్షగానములో దూదేకుల సిద్దయ

ప్రధానుడు. ఇది నాటకాలంకార సాహిత్యమట. ఇతని కాలము 1890 ప్రాంతము.

ఓగిరాల పాపయ్య, ఉప్పవేలూరు నివాసి, భాస్కర రామాయణమును అనుసరించి ఆఱుకాండలును యక్షగానముగా వ్రాసి 1852 లో ఆడించినాడు.

గొన్నాబత్తుల అప్పనార్యుడు. విశాఖపట్టణ పురవాసి బిల్హణీయ నాటకమును వ్రాసి 1834 లో గానుగుల పెద్దయార్యునకు కృతి సమర్పించెను. ఆయూరిలోనే కృతిపతి చేత 1901 లో నిది ముద్రింపబడెను. యక్షగానమైనను సూత్రధార నాందీ ప్రస్తావనాదులు గలవు. కవి మంచి పండితుడు.

మండూరి సుబ్బరాయ కవి, కర్నూలుజిల్లా నంది కొట్కూరు దుద్యాలగ్రామస్థుడు సత్యభామా కల్యాణమును వ్రాసి 1907లో మదరాసులో ముద్రించి "యక్షగాన కంపెనీ డ్రామా" యని ప్రచురించెను దీనిని రెండు రాత్రులు వీధి నాటకముగా ఆడించెనట.

వినుకొండ కాశీకవి, ఆధునికుడిగా కనబడుచున్నాడు మార్కండేయ విలాస యక్షగానమును రచించి చోళపుర నరసింహుని కంకిత మిచ్చినాడు. "లైసెన్సు" వంటి ఆంగ్ల భాషా పదములను ప్రయోగించినాడు.

కొండముది బంగారయ్య గుంటూరుజిల్లా నరసారావు పేట తాలూకా, కొణిదెన దగ్గరి రాజుపాళెము నివాసి, వృత్రాసుర మహారాజనాటకము (1908 మద్రాసులో ముద్రితము) శశిరేఖా పరిణయము (1920 మద్రాసులో ముద్రితము) కందుకూరి రుద్రకవిని పూర్వకవిగా స్తుతించి ఇప్పటి కవులలో వెల్లటూరుశేషావధానులు, వడ్డెపాటి నిరంజనకవి, యలవర్తి ఆంజనేయశాస్త్రి, సిరికొండ దశరథరామశాస్త్రి, కడియాల వీహూరియాఖ్యుడు, కలగాని వీరయాచార్యుడు, అడ్డాడ వీరభద్రుడు అను విశ్వబ్రాహ్మణ కవులను స్తుతించెను. వృత్రాసుర నాటకము మూడు రాత్రులు ఆడబడెనట. పై యలవర్తి ఆంజనేయశాస్త్రియే ఈ నాటకమును పరిష్కరించెను. కవియు నితడును సమకాలికులు.

గోనుగుంట వీరబ్రహ్మము గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా పెదపాలెం గ్రామనివాసి, శివరామ నాటకమును విశ్వకర్మకులమందు జనించిన శివరామ బ్రహ్మేంద్రస్వామి చరిత్రమును యక్షగాన నాటకముగా వ్రాసెను. ఈ స్వామి క్రీ. శ. 1811 ప్రాంతమున నెల్లూరు మండలమున నారదుని యవతారముగా జనించి అనుముల కొండయందు సమాధినందెను. ఈ నాటకమున అంక విభాగము, సూత్రధారుడు ప్రశ్నింపగా నొక భటుడు కథను ప్రారంభించుట, దరువులు, ద్విపదలు, మామూలు సంగీతము కలదు. పూర్వ కవుల స్తుతిలో బాణాల శరభేంద్రుని, కంమకూరి రుద్రకవిని వేమనను, పోతులూరి వీరబ్రహ్మమును ఇంకను చాలా మందిని ఆధునికులలోకూడ ఎందరినో ప్రశంసించెను. దీనిని 1911 లో దుగ్గిరాల వడ్డెపాటి నిరంజనశాస్త్రి ముద్రించెను. కొండముది బంగారయ్య పరిష్కరించెను. దీని రచన మాత్రము చాల నికృష్టముగా నున్నది.

ఈ యిరువదియవ శతాబ్దిలో కన్నెకంటి ప్రభులింగాచారి, తక్కెళ్ళపాడు నివాసి, అష్టావధాని జయప్రద నాటకము, తారాచంద్రము, పాంచాలీ స్వయంవరము, గయోపాఖ్యానము మొదలైనవి వ్రాసెను. మల్లెం సుబ్రహ్మణ్యాచారి సావిత్రీ నాటకమును, కొండభవానీ శంకరాచార్యులు వీరబ్రహ్మయోగి నాటకమును, కొండరాజు మల్లయాచారి నలనాటకమును, వ్రాసిరి. మద్దాల కాశీపతి, సికింద్రాబాదు సంగమేశ్వరభక్తుడు 19 వ శతాబ్దము చివరనుండినవాడు శతకంఠ రామాయణము, మైరావణ లేక హనుమద్విజయము, గయనాటకము, మున్నగునవి రచించెను. కందుకూరు రుద్రకవిని స్తుతించినాడు.

కాసాల బలరామయ్య, మెదకుజిల్లా చూచనపల్లి నివాసి 1928 లో నళినీదేవి ప్రభావము అను పతివ్రతా మాహాత్మ్యమును వ్రాసెను.

వాసిలి సుబ్బయ్య రాజయోగసార నాటకమును వ్రాసెను. 1910 లో ప్రచురింపబడినది. భాగవతము నుండి గ్రహింపబడిన కపిలదేవహూతీ సంవాదము, వేదాంతము.

ఈ విధముగా ఎందరో విశ్వకర్మకులజులు కవులుండిరి. కాని వారు ఎక్కువగా యక్షగానములనే ఆదరించిరి గాని కావ్యరచనకు పూనుకొనలేదు. వీరిలో, అట్టి మహా ప్రబంధకవి, మొదటివాడు రుద్రకవి యొక్కడే. బాణాల శంభుదాసుడు ద్విపదలో రసోత్తరమైన కావ్యమును వ్రాసెను. వీరందరు పూర్వకవిస్తుతిలో విశ్వబ్రాహ్మణులనే పేర్కొనిరి గాని నన్నయాదుల పేరెత్తలేదు. కొందరు వేమనయును పేరును చెప్పుట వింతగా నున్నది. తను విశ్వబ్రాహ్మణుడని పేర్కొనిరా, లేక అతని వేదాంతము తమకు నచ్చినందున పేర్కొనిరా లేక ఈ వేమన మఱియొకడా? ఇది పరిశోధింపదగిన విషయము. వీరందరు శిల్పాచార్యులె నందు చేతకాబోలు ఎక్కువగా సంగీత సాహిత్యముల మేళనమును, ప్రదర్శన శిల్పముమీదనే ఆధారపడిన యక్షగాన రచనలనే చేసిరి.

ఆధునికులలో ప్రసిద్ధులు శ్రీ కందుకూరి మల్లికార్జునాచారిగారు యక్షగాన రచయితకారుగాని ఆంగ్ల విద్యాధికులై, విమర్శకులుగా, వచనరచనాధురీణులుగా ఆంగ్ల గ్రంథానువాదకులుగా ప్రసిద్ధినందిరి. వీరిరచనలు పెక్కులు. మద్రాసు శ్రీరామకృష్ణ మఠమువారిచె ప్రచురింపబడినవి. వీరి మేనల్లుడుగారు కాబోలు కీ. శే. శ్రీ జలదంకి కృష్ణస్వామి శర్మగారు క్రొక్కారు మున్నగు ఖండ కావ్యములు రచించినారు. వీరిది ఒంగోలు. వీరిరువురును మా తాతగారి భక్తులు. తాతగారిని ఆదర్శముగా గ్రహించినవారు. మఱి సుప్రసిద్ధులు శ్రీరాంవీరబ్రహ్మంగారు. బందరు నివాసిరచనలలో నానారాజన్య విఖ్యాత జన చరిత్రము ప్రసిద్ధము ఆధునికులలో పలువురు సహృదయ రచయితలు కలరు.

ఇట్టి యీ కవుల సంప్రదాయమును చరిత్రాత్మకముగా ప్రాచీనకాలమునుండి నేటివరకు చక్కగా పరిశోధించి వ్రాయుట ఎంతయు ఆవశ్యకము. చాతుర్వర్ణ్యమునకు బొత్తుగా తెలియని లిపిశాస్త్రమును గృహాలయాది వాస్తు శాస్త్రమును చక్కగా ఎరిగినవారు ఈ కులమువారు గానే కనబడుచున్నారు. ఈ విద్యలో వీరే భారతీయులకు గురువులు కాబట్టి ఆచార్యనామము వీరియందు సార్థకమగుచున్నది.



# ఆహ్వానం

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

గీ॥ క్షటిక చీకటితెరలను కత్తిరించి
కాలమేఘ జాలమ్ములన్ తూలగొట్టి
లోకమునకెల్ల నూతనాలోకమొసగ
రమ్ము మిత్రుడ! సుస్వాగతమ్ము నీకు

గీ॥ ఉరవుగా తరుణారుణకరము సాచి
కసటు తొలగించి భూదేవినొసటియందు
దీపిమద్వహ్ని కుంకుమ తిలకరేఖ
దిద్దగా రమ్ము! వెచ్చన దీటుకొనగ

గీ॥ నిచిత నీరసభావసంకుచితమైన
సకల జన గణ మాన సాబ్జాతములకు
వికసనమ్ము, సుమాళపు విలసనమ్ము
నవదరింపు ముత్తేజమ్ము చవుకళింప

గీ॥ పుడమిగాసిల్ల బలు మంచుజడులుకురిసి
జడత మడతలు మడతలై కడలుకొనిన
మ్లాన మానవజీవన ప్రాంగణముల
గెలుకొల్పుము చేతనా కేతనములు

గీ॥ క్రొత్త వెలుగుల పొలపమ్ము గుస్తరించి
పసిమి పచ్చనివన్నెలు ప్రస్తరించి
మేలుకొలుపుల పాటలు మేళవించి
వితతముగ సర్వజగతి జాగృతివహింప
రమ్ము మిత్రుడ! ఉదయశైలమ్ముగడచి.

శ్రీ సోమసుందర్

# ఆగామి శతాబ్దానికి సాహిత్య పురోగమనం

మనఆధునికసాహిత్యం ఇరవయ్యోశతాబ్దపు చరమసంధ్యకు చేరుకుంది. గురజాడ మహాకవిపితృపాదులుగా, పరిఢవిల్లిన ఆధునిక సాహిత్యం రెండు శతాబ్దాలలోపుగా ఇరవై ఒకటో శతాబ్దానికి చేరుకోబోతోంది. ఆధునిక శబ్దార్థాలైన ఇప్పటి సాహితీపరుల తరం ఒక విశిష్ట సంధియుగంలో జీవిస్తోందని అర్థం. డబ్బయ్యేళ్ళ వారసత్వాన్ని రక్తనిష్టం చేసుకొని ఆగామి తరాలకు వినూత్న సత్సంప్రదాయాలను అందించే బాధ్యతకు గురైవుంది.

ప్రస్తుత మీయుగసంధిలో అలజడీ అసంతృప్తీ ప్రధాన లక్షణాలుగా ద్యోతక మవుతున్నాయి. ఆవేశమూ ఆందోళనా వి.రీతంగా పేట్రేగుతున్నాయి. ప్రశాంతీ పరితృప్తీ మృగ్యమవుతున్నాయి. అందువల్లనే సామాజిక జీవితంలో వలెనే సాహిత్య జీవితంలో కూడ ప్రయోగశాలిత జీవలక్షణంగా మారింది. గతానుగతిక సంప్రదాయ అవలంబకుల వల్ల అస్తిత్వంలో గల వ్యవస్థ భద్రత పొందుతూ ఉంటుంది. ప్రయోగశాలురవల్లనే వ్యవస్థ సర్వతోముఖ పురోగమనం అందుకుంటుంది. ఈ సత్యమే సాహిత్యరంగంలోనూ స్థిరపడింది.

ఇలాంటి విలక్షణాలన్నిటినీ చాలామంది మేధావులు చాలకాలంగా పోల్చుకుంటూనే ఉన్నారు. తమకు తోచిన పరిష్కారమార్గాలను ప్రయోగిస్తూనే ఉన్నారు. కొత్తగా విచిత్రంగా ఉండడమే ధ్యేయమనుకొనే కొందరు రచయితలు వైయక్తికరీతుల నారాధిస్తున్నారు బాధ్యతా రహితమైన వింతరీతులు పైపై మెరుగులుగాతాత్కాలికంగా మోజు కలిగిస్తూనూ ఉన్నాయి. గతానుగతికంగా సాగిపోతున్న వ్యవస్థ తాలూకు పుట్టకిట్లుమార్పని పై మెరుగులు అసలు సమస్య నెలా పరిష్కరించగలవు!

పూర్వం ఎన్నడూ ఎరగనంత తీవ్రతతో మనకాలం ఉప్పెన వరదలా పొటెత్తిపోతోంది. సామాజికంగానూ, వైయక్తికంగానూ మన కళ్ళముందే ఎంతో వేగంగా నిరంతర పరిణామాలు జరిగి పోతున్నాయి. అనిశ్చితస్థితీ అవ్యవస్థా సర్వరంగాలను ఊపివేస్తోంది. విలువలన్నీ తారుమారవుతున్నాయి. నిశ్చల గమ్యాలు మసక బారుతున్నాయి. సనాతన ప్రమాణాలు వీగిపోయాయి. నూత్న ప్రమాణాలు స్థిరపడలేదు. ఇలాంటి సంధిగ్ధావస్థలో కవులూ రతయితలూ నిర్దిష్ట పథగాములు కాలేరు. నిశ్చల గమ్యాలను ఎన్నుకోలేరు. ప్రతి సాహితీ వరుడూ ఎవడి లక్ష్యాన్ని వాడే ఎన్నుకోక తప్పడం లేదు. ఉదీయమాన జలరాశులలో ఏకాకి ప్రయాణం సాగించక తప్పడంలేదు.

కనుకనే ఆధునిక కవి-వర్తులాకాశచాపంలో పల్లటీలు కొట్టే పావురాయి వలె ఒంటరిగా వెదుకులాడు తున్నాడు. అతను చిత్తశుద్ధి గలవాడైతే ఇంకా ఒక గమ్యంచేరకలేదని అంగీకరిస్తాడు. దిగిరావడానికీ కాలూనడానికీ పట్టి పాడినేల కనిపించలేదని లారెన్సు చెప్పిన భావం వర్తమాన మేధావుల సంధిగ్ధావస్థను సరిగ్గానే పట్టి చూపుతుంది. సాహితీ వేత్తలలో నిజాయితీ పరులు అన్నపుడే సమస్య ఎదురవుతోంది. ప్రతీ కవీ, రచయితా తన విశ్వాసాల ననుసరించీ, తన ప్రవర్తన ననుసరించీ తాను చిత్తశుద్ధి గలవాడిననే విశ్వసిస్తాడు. విశ్వజనీనమైన చుట్టుచూపు తనకే ఉన్నట్టూ

నమ్ముతాడు. సామాజిక సద్వ్యగ్రనా, సమ్యగవగాహనా తన కొక్కడికే ఉన్నట్లు కుండబద్దలు కొడతాడు.

కాని ఈ కాలంలో బ్రతుకుతున్న ప్రతి కవీ, ప్రతి రచయితా సమగ్రంగా ఆధునిక చేతన అలవర్చుకున్న వాడేనా? ఆధునిక శాస్త్రీయ దర్శనం కలవాడేనా? అని ప్రశ్నించుకున్నపుడు సమాధానం సంతృప్తి కలిగించదు. ప్రతివాడూ తన విశ్వాసాలను తన దర్శనాల తలమీదనే మోపుతున్నాడు. వ్యక్తిగత ఊహాపోహల పరిధిలోనే ఆలోచిస్తున్నాడు. తాత్త్వికసిద్ధాంతాలనే అగ్రపీఠిలో నిలుపుకుంటున్నాడు. అనుభవాన్ని మించిన ఆశయాలతో ఊగిపోతున్నాడు సామాజిక జీవిగా తన అనుభూతులను ఫలప్రదం చేసుకోవడం మాని వ్యక్తిగత స్వేచ్ఛా వాదాన్ని ఆరాధిస్తున్నాడు. పాశ్చాత్య దేశాలలో నిన్ననే కాలదోషం పట్టిన సిద్ధాంతాలను నేడు తనకు వేగుచుక్కలనుకొని భ్రమిస్తున్నాడు. వైజ్ఞానికశాస్త్ర, అభాసల్ని వాదోషుగా పిల్చుకుంటున్నాడు. దెయ్యాల భూతాలకాకమ్మ కథలకు కొత్తశాస్త్రీయ దృక్పథంతో వ్యాఖ్యానిస్తున్నట్లు వంచనా శిల్పాన్ని ఆరాధిస్తున్నాడు. అందుకే ఈ యుగం సకల కల్లోలాలకూ ఆకరమవుతోంది.

మక్సీమ్‌గోర్కీ, రోమెరోలా, జాక్‌లండన్, థామస్ మేన్, ప్రేమ్‌చంద్‌వంటి మహారచయితలు ఈ శతాబ్దపు తొలి అర్ధభాగం లోపలేవెళ్ళిపోయారు. వారు తమ తొలినాళ్ళలో నమ్మిన మానవతా సిద్ధాంతాలనే జీవితాంతం పరిపోషించుకున్నారు. ప్రయోగం కోసమని నేల విడిచిన సాము చెయ్యలేదు. రాజకీయంగాగాని, సాంఘికంగా గాని ఆమహా రచయితలు ఆదినుంచీ నిశ్చల పతాకలుగానే భాసించారు. సృజనాత్మక కళాకారులుగా వారెంతో జీవన వైవిధ్యాన్ని ప్రదర్శించారు. మహత్తర విశ్వరూపాన్ని సాక్షాత్కరింపచేసుకున్నారు. గభీర మానవహృదయజలధిని మథించారు.

గోర్కీనే ఉదాహరణగా తీసుకుంటే-మొట్టమొదటి కథ చెల్కాష్ వ్రాసిన చేత్తోనే ఒక మానవుని జననం రచించాడు; మకార్‌ఛుధా రచించిన చేత్తోనే ఇరవైఆరుగురు మగాళ్ళూ ఒక అమ్మాయి అనేవివాదాస్పద కథానిక రచించాడు. మాల్వా వంటి శృంగార ప్రేమకథ రచించిన గోర్కీయే అమ్మ అనే మహత్తర విప్లవాత్మక నవలనూ రచించాడు. ఈరచనలలో ఏ ఒరిశీలించినా ప్రధానఆరాధ్య దేవత మానవత్వాన్ని విస్మరించలేదని స్పష్టమే. మానవుని సృజనాత్మక ఆత్మవిశ్వాసాల తలలపై -దైవమాహాత్మ్యాలనో మంత్రతంత్రాది అతీంద్రియ శక్తులనో, భూత ప్రేతాది విషయాల లనో బీభత్సఖారాలుగా మోపలేము.

బాధామయ వర్తమాన జీవితం పట్ల విరక్తినికాక అనురక్తినీ, మూఢకర్మ సిద్ధాంతాల పలాయన వాదాలను కాక కర్తవ్యపాలననీ పురుషాకారాన్నీ, మానవకూటాల మధ్య వేర్పాటును కాక సంలీనతనే సాధించడానికే యావత్తు సాహిత్యాన్నీ గోర్కీ అంకితం చేశాడు. పెట్టుబడి దారుల వాంఛితార్థాలను నెరవేర్చడం ద్వారా తన వ్యక్తిగత దారిద్ర్యాన్ని బాపుకుందు కెన్నడూ ప్రయత్నించలేదు. గోర్కీ వంటి మహనీయుల సాహిత్యం అవకాశవాదఛత్రంగా ఎన్నడూ వినియోగింపబడలేదు కుహనాసిద్ధాంతాల కుక్షింభరత్వానికి దిగజారలేదు. రచయితగా, మేధావిగా, యోచనాశీలిగా మక్సీం గోర్కీ పరిపూర్ణ మానవతా వాదిగా శాశ్వత యశస్సు లందుకో గలిగాడు. అతను స్వీకరించిన ఇతివృత్తాలు శృంగార పరమైనవైనా, విప్లవాత్మకాలైనా- అట్టడుగు అధిష్ఠానం మానవీయ దర్శనమే!

కాని మన దేశంలోని రచయితలలో కొందరు పాశ్చాత్య దేశాల ఉన్నత కాంతి రేఖలను ఆదర్శంగా స్వీకరించడంమాని, నిమ్న తిమిరరేఖల ప్రభావంలో కొట్టుకు పోతున్నారు. పాఠకుల నీచాభిరుచులను ప్రోదిచేయడం ద్వారా తమ పబ్బం గడుపుకుందుకే ప్రయత్నిస్తున్నారు. పాఠకులు సైతం రచయితపై ఎన్నో విధినిషేధాలను కేంద్రీకరిస్తున్నారు.

ముప్పయ్యేళ్ళ క్రితం కొడవటిగంటి కుటుంబరావు వచ్చ కాగితం అనే ఒక కథ రచించారు. మధ్య తరగతి యువతి ఆర్థికంగా నిస్సహాయ స్థితిలో ఉంటుంది. తన మనోభావాలనూ, శృంగార పిపాసనూ అరికట్టుకోలేక ఊగిపోతూ ఉంటుంది. ఆ బలహీనతను ఆసరాగా తీసుకున్న యువకుడు ఆమెను మోహించి అవకాశం చిక్కగానే ఆమెని అనుభవిస్తాడు. ఒక నూరు రూపాయల కాగితం ఆమె చేతిలో పెట్టి వెళ్ళిపోతాడు. ఆమె తొట్రుపాటునుంచి తేరుకోక ముందే ఇదంతా జరుగుతుంది. చేతిలోకాగితం కొంతలో కొంత ఆమెని సంతోషపరచకపోదు.

ఈ కథను చదివిన కొందరు వీరాభ్యుదయ వాదులు కుటుంబరావుపై ఏమర్శల సాయుధ దాడి ప్రారంభించారు. మధ్యతరగతి నీతుల ఊగిసలాటలో యథార్థ పరిస్థితుల నా బుద్ధిమంతులు అవగాహన చేసుకోలేరు. అభ్యుదయ సాహిత్యంలో శృంగారమూ రతీ వంటివన్నీ నిషిద్ధ వస్తువులని పాపం. వారికి తిరుగులేని విశ్వాసం ! ఒక యువతి తీరని కోరికలను పచ్చకాగితం ద్వారా కుటుంబరావు పరిష్కరింప పూనుకున్నారని వారి ఆరోపణ. అంటే ఇతివృత్తం పట్లనే కొన్ని విధినిషేధాలలో ఈ దాడి ప్రారంభమైనట్లు అర్థమవుతుంది. మానవీయ దర్శన చిత్రింపబడిన రీతి ఈ అసమగ్ర దర్శనులచే విస్మరింపబడింది. ప్రధానంగా పరిగణన కెక్క వలసిన రచయిత ప్రతిభ నిర్లక్ష్యం చేయబడింది. కథనంలో ప్రదర్శితమైన ప్రజ్ఞ తిరస్కరింపబడింది.

అభ్యుదయ సాహిత్యకారుడికి ఫలానా యితివృత్తమే స్వీకారయోగ్యం అనే క్రొండ గుర్తు లింకా చెరిగిపోలేదు. ఆధునిక శ్రోత్రియ విమర్శకుల బండబాదుళ్ళూ వెలసిపోలేదు. ఇలాంటి అభిప్రాయాల్లు ఇప్పటికే మన సాహిత్యంలో ఒరిగొయ్యి ఏర్పడింది. ఇతివృత్తానికి అతివేల ప్రాముఖ్యత యివ్వబడింది. ఎంత ఉత్తమ ఇతివృత్తమైనా అప్రతిభుడి చేతిలో పడిందంటే నిముషంలో విషతుల్యమైపోతుంది. కనక ఇతివృత్తమొక్కటే సర్వసమగ్రం కాబోదు. అభ్యుదయ కథా రచనకు కొన్ని ఇతివృత్తాలు మాత్రమే పనికివస్తాయని చెప్పే శాస్త్రకారులు కళామర్మజ్ఞులు కారు. ఏ ఇతివృత్తం స్వీకరించి రచన చేసినా జీవితం పట్ల గాఢతర మమతాభిమానాలు ప్రదర్శించగలవాడే ఉత్తమ రచయిత. కర్మణ్యత్వం పట్ల ఆశాపూరిత అనురక్తిని పాఠక హృదయంలో ప్రోది చేయగలవాడే ఉత్తమ దార్శనికుడు.

జీవితంలోనూ సాహిత్యంలోనూ సనాతన ఛాందసత్వాలను వైదొలగించుకున్నామని గర్విస్తున్న మనతరం నవీన ఛాందసాల్ని, నేత్రకుసుమాల్ని ఆరాధిస్తూ మురిసిపోతున్నామా అనే సంశయం కలుగుతూ ఉంటుంది. చేయి చాపితే అందేటంత చేరువలో ఇరవై ఒకటో శతాబ్దం విడిది చేసివుంది. ఇట్టి పరీక్షా సమయంలో కూడ మూఢ విశ్వాసాలు శేష ప్రశ్నలుగా మిగిలిపోవడం మిక్కిలి శోచనీయమే కాగలదు !

డబ్బయ్యేళ్ళ క్రితమే ఆధునిక కవితాచేతనకు పితృపాదులైన గురజాడ మహాకవి ప్రభాత గీతాలకు శ్రీకారం చుట్టారు. యుగవాణి వినిపించారు. జాతి జాగృతికి దోహదం చేశారు. ఐతే తదాదిగా జాతి అందుకొన్న జాగృతి సమగ్రతరమే అయివుంటే ఈ శతాబ్దం సర్వతో ముఖంగా పురోగమించి వుండవలసిందే. అలా జరగలేదు. రెండడుగులు ముందుకి మూడు బారలు వెనక్కి తచ్చాడింది. ఎందుకింత గుడిసుళ్ళు పొందిందో-పరిశీలించుకోవలసిన యథార్థ స్థితి మనకనులముందుంది.

మయెకొవిస్కి, గర్షియాలోర్కా ప్రభృతి ఆధునిక పాశ్చాత్య కవులతో పోల్చదగిన, ఆధునిక కవులెందరో తెలుగు భాషలో ఉద్భవించారు. కాని గోర్కీరోమారోలా వంటి సమగ్రదర్శనులగు రచయిత లింకాపుట్టవలసే ఉంది. రెండు దశాబ్దాలలోపుగా ముగిసిపోతున్న ఈ శతాబ్దపు చరమ సంధ్యలో అలాంటి మహా రచయితలు అవతరించగలరనే ఆశ అరోగ్యకరమే ! ఎంతవరకూ సాధ్యమో వేచి చూడవలసిందే !

ఈ శతాబ్దపు ఆంగ్లసాహిత్యాన్ని ప్రభావితం చేసిన వారిలో డి. హెచ్. లారెన్సు ఒకడు. అతనొక సందర్భంలో యిలా అన్నాడు: "ఉదీయ మానమవుతున్న ప్రభాత కంఠంలో ఒక వినూత్న గీతాన్ని నింపగలిగే కలికి పాటల కోయిల ఒక్కటీ కనిపించడంలేదు" అని అతను నిరాశాహృదయుడే, సందేహం లేదు. కాని అతని నైరాశ్యం బొత్తిగా కొట్టి పారవేయవలసింది కాదు. ఉషస్సుందర కవితా పవమానాలెన్ని వీచినా మనజాతి గృహోపవనంలో జీవత్ చలనం కదలబారవలసే వుంది. సుషుప్తి పూర్తిగా వైదొలగవలసే వుంది జీవన సమస్యలను మంత్రతంత్రాల అంధ విశ్వాసాలతో గాక శాస్త్రీయ అవగాహనతో పరిష్కరించుకుంటూ పురోగమించవలసే వుంది !

ఆగామి నవ శతాబ్దారంభానికైనా ఏదో ఒక కలకూజితం అమృతవిహంగమై సాక్షాత్కరించవలసేవుంది. అగమించే సుందరోజ్జ్వల ఉషస్సునికి స్వాగతగీత మందించవలసిన సమయం ఆసన్నమవుతోంది. కలకూజితాలు సంసిద్ధం కావాలేగాని-చప్పున ఆస్వాదించడానికి రసపిపాస సిద్ధంగానే ఉంటుంది. అందుకే మనకాలం వేగిర పడుతోంది.

# నిరీక్షణ!

గాలీస్తంభించింది!
వెలుతురూ రాలేదు!
నీలి ఆకాశంలో,
నీడల్లా మబ్బులు!
అక్కడో పిట్టా,
యిక్కడో పిట్టా,
తోకకూడాకదల్చకుండా!
చెట్లు,
ఆకుకూడాకదలిచంక,
అటెన్షన్‌లోవున్న సిపాయిల్లా!
ప్రకృతి అంతా,
అద్భుత ఉత్కంఠతో,
ఊపిరి బిగబట్టి,
ఎవరి రాకకో
నిరీక్షిస్తున్నట్టు!

# కదలనిది!

తలమీద పంకా వేగంగా తిరుగుతోంది,
తలలోని ఆలోచనల్లాగే!
ఆకుపచ్చని అశోకాలు తలలూపుతున్నాయి,
ప్రకృతి చెప్పింది వింటున్నట్టు!
ఎర్ర క్రోటన్సు, తెల్లలిల్లీలు మెల్లిగా కదులుతున్నాయి
అందమైన ఆడపిల్లల్లాగ!
కదిలే యీప్రపంచంలో
కదలనిది, ఆస్పత్రిమంచంమీది నేనొక్కణ్ణే!

శ్రీ పి. యస్. శాస్త్రి



# క ళా గూ ర గ ం ప

## కావ్యాలాపము

("నేటి కవిత్వం ఒక పరిశీలన")

I

"నియతికృత నియమ రహితాంహ్లాదై కమయీ మనన్య
పరతం(త్రామ్
నవరస రుచిరాం నిర్మితి మాదధతి భారతీకవేర్జయతి"

పూర్వాలంకారికులు చెప్పిన కవిత్వ నిర్వచనాల్లో కెల్లా విశాలమైందీ, కవిత్వానికి కాస్త దగ్గఱగా ఉందని పించేదీ ఈ పైన చెప్పిన కావ్యప్రకాశికా కారుని శ్లోకం. అయితే కవిత్వాన్ని నిర్వచించ బూనడం అసాధ్యమైన ప్రయత్నం అనిఅంటూనే అందఱు ఆలంకారికులు దానిపైన గొడవలు పడుతూనే వచ్చారు. దోషరహితమూ, సుగుణా లంకార భూయిష్టమూ అయిన శబ్దార్థజాలమే కవిత్వమని కొందఱు తలిస్తే మరికొందఱు ధ్వనిప్రధానమైన వాగ్జాలమే కవిత్వమని భావించారు. "వాక్యం రసాత్మకం కావ్యమ్" అనీ, "చమత్కారజనకభావనా విషయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అనీ, అనేక విధములైన కవితా నిర్వచనాలు స్వల్పభేదంతో దర్శన మిస్తూంటాయ్.

వ్యంగ్యముచేత ఉద్దీపింపబడి చమత్కారము వల్ల ఆనందాన్ని కల్గచేసే శబ్దార్థదాంపత్యమే కావ్యమని చాల మంది భావించారు. శబ్ద చమత్కారము మెఱుపువంటిది కాగా అర్థ చమత్కారము స్థిరమైన కాంతిగా పేర్కొనవచ్చు. ఎన్ని లక్షణాలు చెప్పినప్పటికీ శబ్దార్థములు రసప్రసర నిర్భరములు కాపోతే అది ఉత్తమ కావ్యమని చెప్పడానికి వీల్లేదు. అందు చేత మొట్టమొదట పేర్కొన్నట్లు "నిశ్చయముగా చేయ బడిన నియమములతో, శూన్యమైనట్టిదియు. కేవలానందమై నట్టిదియు, ఇతరా ధీనము కానట్టిదియు, నవరసములచేత మనోహరమైనట్టిదియు, అయిన కవి వాక్యము సర్వోత్కృష్ట మగుచున్నది" అన్న నిర్వచనం మనకు నచ్చవచ్చు.

పై నిర్వచనంలో కవిత్వము నియమరహితమైనదని ఆ శ్లోకంయొక్క మొదటి రళము మనకు బోధించుచున్నది. "కావ్యం ఇట్లా ఉండాలి" అని ఎవ్వడూ నిర్దేశింపలేదు. నియమరహితమైనది అంటే సర్వతోముఖమైనది అని అర్థం. ఈ నియమ రాహిత్యము కావ్యంయొక్క ప్రక్రియాపర మైనా కావచ్చు, లేదా కవియొక్క ఉక్తివైచిత్ర్యము పర మైనా కావచ్చును. గద్య, పద్య, చంపూభేదాలతో కావ్యం విలసిల్లుతోంది. ప్రాచీనకావ్యాల్లోని గద్యానికి, ప్రస్తుత కాలంలో విజృంభిస్తున్న వచనానికి లాక్షణికంగా తేడా ఉన్నప్పటికి దాన్ని ఎవరూ గణించడంలేదు. వచన కవితల పేరుతో నేడు పత్రికల్లోను, సభలలోను, కన, విన, వచ్చే "కవిత్వం" ప్రాచీనోక్తి అయిన ఆ నియమ రాహిత్యాన్ని బాగా వంట బట్టించుకొంది. అయితే మిగిలిన లక్షణాలైన హ్లాదైకమయత, అనన్యపారతంత్ర్యత, నవరసరుచిరత్వము అను ఈ రకపు కవిత్వం కలిగి ఉందా అంటే కాస్త ఆలో చించవలసిందే."

II

శబ్దార్థ దాంపత్యమునుండి నిష్పన్నమైన తాత్పర్యా ర్థంకన్నా విలక్షణమై సహృదయ పాఠకుని ఆనందింప చేసే "కాసమెఱుపు"ను చమత్కారంగా భావించవచ్చు. కవిత్వము నందు ఈ చమత్కృతి సాధింపబడవలెనని కొందఱు అలం కారికులు తలంచారు. అయితే కావ్యం అజరామరస్థితినంద డానికి ఈ చమత్కృతియే ప్రధాన లక్షణం కాదు. "పురాణ కవి" కథా కథనమందేదృష్టినిల్పగా, ప్రబంధకవి పైన అను కొన్న చమత్కారమును సాధించుటకు ఎక్కువ ప్రయత్నిం చాడు. భారత, భాగవత, రామాయణాలు కథాబలం, ఉక్తి వైచిత్ర్యము మీదా నిలబడగా, మిగిలిన ప్రాబంధిక కవి త్వము చమత్కృతియ సంధించి సరసుల్ని ఆకర్షించుకొన్నది. కొందఱు కవులు. వ్రాసిన ప్రతిపద్యంలోనూ చమత్కృతియ చూపి శెభాష్ అనిపించుకోగా, మఱికొందరు చమత్కారాన్ని పాండితీప్రకర్షకు బలిచేసి "ప్చ్" అనిపించుకొన్నారు.

కవిత్వము వచనమైనా, పద్యమైనా చమత్కారము లోపిస్తే అది గజు న్నువంటిదే. అది ఎవరినీ ఆనందింప జేయలేదు. చమత్కృతి మాత్రం ప్రజల్ని అందర్నీ అల రింపగలదా? లలితకళల్లో మిగిలిన వాటి మాట ఎట్లా ఉన్నా కవిత్వాన్ని చదివి ఆనందింపగలిగేందుకు ఒక "అర్హత" ఉండాలి ! ఆ "అర్హత" నిరంతర కావ్యానుశీలన ముపల్ల పఠిత తెచ్చుకోవలసిందే కాని ఎవ్వరూ దాన్ని పట్టకొచ్చి నోట్లో పోసేది కాదుగదా ! ఏకవిత్వం అయినా సమాజంలో (విద్యాపరంగా) అన్ని తరహాల ప్రజల్ని సంతోషపెట్టలేదు. ప్రజా కవిత్వం అనే పేరుతో చెలామణి అవుతున్న ఒక రకపు కవిత్వంకూడా కావ్యానందం పొందగలిగే విద్యావంతు లైన ప్రజల్ని కొందర్ని మాత్రమే ఆనందింపచేస్తోందన్న విషయం మనం మర్చిపోకూడదు ! సామాన్య ప్రజా జీవ నాన్ని ప్రతిబింబించడం ద్వారాన ఆ కవిత్వం "ప్రజా కవిత్వం" అని పిలవబడితే అట్లా పిలుచుకోడానికి అభ్యంత రం లేదు.

పూర్వ మహాకవులు కావ్యాన్ని శివేతరక్షయమునకు, పరనిర్వృతికి సాధనంగా భావించారు. కావ్యసృజనయే కాకుండా కావ్యాను శీలనముకూడా ఆయా ఫలితాల్ని ఇస్తుం దని పూర్వులు తలంచారు. భాగవతాన్ని ఆంధ్రీకరిస్తూ "జననబున్ సఫలంబుఁజేసెద పునర్జన్మంబు లేకుండగన్' అన్న మహాకవి పోతన భావన ఈ విషయాన్నే దృఢీకరి స్తోంది. భారత భాగవత, రామాయణాలు, పురాణాలు, భీమ ఖండము, కాశీఖండము, కాళహస్తీశ్వరమాహాత్మ్యం, మొద లైన గ్రంథాలు తీర్థయాత్రా భాగ్యంకలగని పూర్వులపాలిట జంగమదైవ క్షేత్రాలుగా భాసించి వారిని తరింపజేసాయన డంలో విప్రతిపత్తి ఏమీలేదు. రసవిషయికంగా కూడా ఆ ప్రాచీన కావ్యాలు శుక్లపక్షంలోని తేనె పట్లే !!

III

ఈనాడు కావ్యోదయం మహా ఆడంబరంగా జరుగు తోంది. ముఖ్యంగా కావ్యానికి సమకాలీన పండితాభి ప్రాయాలు వ్రాయించడం ఒక అలవాటైపోయింది. ఈ అభిప్రాయాలు తగిలించుకొనకుండా సారస్వత వీధిలో ఎగిరే కావ్యాలు బహుస్వల్పం! నేడు ఒక 'శతకం' వెలువడిందంటే దానిపైన నాల్గు అయిదు పండితాభిప్రాయాలు ఉంటు న్నాయ్. ఈ 'ఇఫారస్సులను' అన్నిం ని ముందు పెట్టుకని 'ఓధి డ్డ' ఆ కావ్యం ఒక్కసారికూడా చివరిదాకా చదివేలా ఉండదు. ఒక్కొక్కప్పుడు కవి యొక్క రచనకన్నా పండి తాభిప్రాయాలే ఎక్కువ పుటలు ఆక్రమించిన పుస్తకాలనుకూ చూస్తున్నాము. అర్ధశతాబ్దినుండి మొదలైన ఈ సంప్ర దాయం ఇటీవల "వేలంవెర్రి"అయింది ఏ కావ్యగౌరవాన్నీ వర్తమానం తేల్చలేదు. భవభూతి చెప్పినట్లుగా నిరవధియైన కాలమూ, విశాలమైన భూమియే నిజమైన కావ్యానికి గీటు రాళ్లు !

తలుచుగా ఈనాడు సారస్వత వేదికలపైనా, సాహితీ విమర్శలయందూ మనం గురజాడ, కందుకూరి, ఈ యుగంలో సాహిత్య ప్రయోజనాన్ని మార్చారనే మాట వింటున్నాం. రాచరిక వ్యవస్థలో కవిత్వము వైయక్తిక ప్రయోజనం కోసం ఉపయోగించబడిందని, నేటి యుగంలో కవిత్వం సంఘప్రక్షాళనకు, దురాచార ఖండన మునకు సాధనమైందని,ఈమార్పుకు గురజాడ, కందుకూరి మొదలైన సంస్కర్తలు కారణభూతులయ్యారని నేడు పలువురు భావిస్తున్నారు. కవిత్వం కేవలమూ ఆనంద సంధాయకమైనది. కవియొక్క సాంఘిక వాతావరణము అతని వాక్కులో ప్రతిబింబించవచ్చు కాని కవిత్వంవల్ల సాంఘిక అస్తవ్యస్థ స్థితి గతులు ఎన్నడూమారవు. సంఘ ప్రక్షాళనము మొదలైన కార్యక్రమాలకు అది ఉపయోగ పడే సాధనంకాదు. కవిత్వాన్ని ఆ విధంగా భావించడం, తామరరేకుతో సమిధలు కోయాలని భావించినట్లే.

కావ్యం విశ్వశ్రేయస్సును ఆకాంక్షించేదే. అయితే అది సత్కావ్యము యొక్క ఒక లక్షణం మాత్రమే. కావ్య ప్రపంచానికి శ్రేయస్సును కోరవలె. కావ్యం బోధించిన పరమార్థం ప్రపంచానికి "మంచి"ని చూపవలె నన్నమాట. అంత మాత్రంచేత కావ్యం జగత్తును మార్చగలిగేదని అర్థం కాదు అసలు కావ్యంయొక్క ప్రధాన ప్రయోజనం ఆనంద సంధాయకంమాత్రమే. "ఆంధ్రావళి మోదముం బొరయ" అన్న తిక్కనగారి మాటల్లో కవిత్వంపాఠకునికి ఏమిఇవ్వదింప గలదో తెలుస్తున్నది. ఈనాడు మనం సంఘంలో చూస్తున్న

అసమాన ´లు, దురాచారాలు, మనకు కొత్తవికావు. ఎన్నోవందల యేండ్లనుండి దేశంలో ఉన్నట్లు మనం చరిత్రలో చూస్తున్నాం అయితే వాల్మీకి నుండి లేదా నన్నయ్య నుండి ఈసాహిత్యాన్ని సంఘప్రక్షాళనకు ఉపయోగించాలనే ఆలోచన పూర్వకవులకు, మేధావులకు ఒక్కరికి కలగకుండా కందుకూరి గురజాడలకే కలిగిందా? సాహిత్యం ద్వారా దురాచారఖండనము, సంఘప్రక్షాళన, ఉద్యమ నిర్మాణం, మొదలైనవి కేవలం నినాదాలు మాత్రమే. సాంఘిక అధర్మాన్ని, దురాచారాల్ని అంత మొందించడం సమర్థమైన ప్రభుత్వమునల్ల సాధ్యమయ్యేవి కానీ ఆ కార్యక్రమం సాహిత్యం చేయలేదు. అయితే ఆ వాతావరణాన్ని ప్రతిబింబించునట్లుగా కావ్యనిర్మాణం జరిపి, దానికి కవి తనకు తోచిన పరిష్కారాన్ని సూచించవచ్చు! అంతే!

IV

నేటి కవిత్వంలో శాశ్వతమైన విలువలు మృగ్యం అవుతున్నాయన్నది నిర్వివాదాంశం. "సప్తసంతానముల లోన ప్రశస్తిగాంచి ఖిలముగాకుండు" కావ్యాలు నేడుమఖలో పుట్టి పుబ్బలో మాడిపోతుండడం మనం చూస్తూనే ఉన్నాం. నేటి కవిత్వం ఉద్యమాలలో పుట్టడమే దానికి కారణం కావచ్చు కవిత్వానికి అనేకమైన వైయక్తిక సాంఘిక నిబంధనలు అడ్డుపెట్టుకొని కవి తన వాక్కుకు తానే ఒక గిరి గీసు కొంటున్నాడు. కొంతవరకు కవిసంఘాలు దానికి (కవిత్వమునకు అశాశ్వతత్వమునకు) దోహదం చేస్తున్నవి.

పూర్వ కావ్యాలు ఎన్నిమార్లు పఠించినా తనివి తీరనంత హృద్యములై నిత్యపారాయణగ్రంథాలై నిరంతరం మననం చేసుకోదగిన ఉత్తమ స్థాయిలో ఉన్నవి. అవి శతాబ్దాల తరబడి వెలుగులు చిందిస్తున్న చిరత్నరత్నాలు. ఆ కావ్యాలు తమను సేవించిన వారినికూడా తరింప జేస్తున్నవి. మఱి నేడు పుంఖాను పుంఖంగా ఉదయిస్తున్న కావ్యాల మాట ఎత్తనక్కరలేదు. వాటిస్థితి ఎట్లా ఉందో అందరికీ తెలుసు. ఉన్న మాటంటే ఉలుకు పడనవసరం లేదు! అయితే ఆధునిక యుగంలో కూడా ప్రాచీన కావ్యాలయొక్క ప్రమాణాల్ని నిలబెట్టుకొన్న కృతులు ఒకటో రెండో లేకపోలేదు. బహుస్వల్పం!

ఉన్నత ప్రమాణాలతో భాసించి, పూర్వకావ్యాలతో పోటీకి నిలబడి పఠితలకు ఆనందాగ్ని పంచిపెట్టే రసవత్ కావ్యాలు జనింపక, పోతే వర్తమానయుగాన్ని, ఆగామి యుగం మఱొక క్షీణయుగంగా గుర్తించవచ్చు. ఆ స్థితి ఈ యుగానికి రాకుండా ఉండాలని ఆశిద్దాం. కవికి, పాఠకునికి అనుద్వేగకరమైన ఆత్మానందాన్ని పంచిపెట్టె నిజమైన "కవిత్వపుసొళ్ళు" గలిగిన కావ్యోదయాలకై ప్రార్థిదాం!

"పరివర్తతే విజ్ఞానం సంభావ్యతే యశో విసర్పంతి
గుణాః
శ్రూయతేసు పురుష చరితం కింతద్యేన నహరంతి
కావ్యాలాపాః"

శ్రీ బులుసు వెంకటేశ్వర్లు

# మినీ కవిత

శర్మగారు 'భారతి' జనవరి 81 సంచికలో ఊహించినట్లే మినీ కవితకు 'ఒకోలైనులో సామాన్యంగా మూడు, నాలుగు పదాలు మించకుండా' ఉండాలనటముతోపాటు మరికొన్ని నియమాలను కూడా చేర్చి రావి రంగారావుగారు "భారతి" ఫిబ్రవరి 81 సంచికలోనే ప్రకటించారు. అందులోనే "బహుళార్థ సాధక కవిత" అని "ఆధునిక కవిత్వంలో ఒక కొత్తరకాన్ని"గురించి వివరించారు. దానికి వారే రచించిన "గుడ్‌మార్నింగ్" అనే కవితని ఉదాహరణగా ఇచ్చారు.

ఏప్రిల్ 80 'భారతి'లో రంగారావుగారే కొన్ని మినీ కవితలలో "బహుళార్థ సాధన" కై కృషి చేశారు. అందులో ఒకకవితనురచించినవిహారిగారు తామా కవితను "స్థూలమైన అర్థస్ఫురణ" కోసమే వ్రాసినట్లు "భారతి"

(డిసెంబరు 80) ముఖంగానే ప్రకటించారు. బహుళార్థసాధన నుద్దేశించి వ్రాయని కవితలకు కూడా అందులోని "గంభీర భావాల" కోసం విపరీతార్థాలు వ్రాయబూనటం శోచనీయము.

శబ్దశ్లేషగాని, అర్థశ్లేషగాని లేకుండా కవితలో బహుళార్థసాధనకై తలబద్దలు కొట్టుకోవటము సాధారణపాఠకుడు చేయలేని పని. హ్యూమనిజం, అలా, గుడ్‌మార్నింగ్ కవితలలో రంగారావుగారు వివరించిన బహుళార్థాలు ఆ కవితలను చదివినప్పుడు నాకు స్ఫురించలేదు. పది పంక్తుల మినీ కవితను పూర్తిగా అర్థము చేసికొనాలంటే పాతిక పంక్తుల వ్యాఖ్యానం కావలసి వస్తున్నది.

ఫిబ్రవరి 81 'భారతి'లో రంగారావుగారు చెప్పిన మినీ కవితా లక్షణాలు వారే అందులో వ్రాసిన గుడ్ మార్నింగ్ కవితలో ఎంతవరకు పాటించారో పరిశీలిద్దాం.

వారు చెప్పిన తొమ్మిది లక్షణాలలో మొదటి రెండూ కవిత ఒడ్డూ పొడుగుకు సంబంధించినవి. 3, 4 లక్షణాలు : కవితలో "అతి తక్కువ సంఖ్యలో పదాలు తూచి తూచి వాడబడటం, ఒక పదాన్ని తీసేసి మరింకో పదంతో పూరించటానికి వీలుకాని కూర్పును కలిగి ఉండటం."

గుడ్‌మార్నింగ్ కవితలోని ఇచ్చింది, తెచ్చింది, కలిపింది క్రియాపదాలను రచయిత ఆకాశం, చీకటి, వెన్నెలకు క్రమంగా అన్వయించారు. కాని వారు చెప్పినట్లు కాకుండా "ఆకాశం తెచ్చింది, వెన్నెల ఇచ్చింది" అని పదాలను మార్చి వ్రాసినా భావంలో మార్పురాదు. ఈ కవితలో పదాలు తూచితూచి వాడబడలేదు సరికదా పదాల కూర్పులో కూడా బిగిలేదు.

5వ లక్షణం శీర్షికకు సంబంధించినది.

6వ లక్షణం "ఆద్యక్షరమైత్రి, అంత్య ప్రాసాదులతో పాటు, వచన కవితకు అవసరమనుకొనే లయకూడా నిర్బంధంగా వుండకపోవటం" ఒకవేళ వుంటే ఏ మాత్రమూ కృతకంగా వుండకూడదు.)

గుడ్‌మార్నింగ్ కవితలో మొదటి రెండు పంక్తులకి ఆద్యక్షరమైత్రి ఉన్నది. 1-3, 4-6 పంక్తులలో ప్రాస ఉన్నది. 1,3,5,7, పంక్తులలోను, 2-4, 10-12 పంక్తుల లోను అంత్యాక్షరమైత్రి ఉన్నది ఇన్ని ఉన్న కవిత్వంలో లయ లేకుండా ఎలా ఉంటుంది. లయకూడా ఉంది. అయితే ఇవన్నీ యీ చిన్ని కవితలో సహజంగా చోటు చేసుకున్నాయో కృతకంగా ఏర్పరచబడినాయో తేల్చి చెప్పటం కష్టం

ఏడవ లక్షణం - "తక్కువ జ్ఞానం (మినీ కవిత) లో నుండి సాధ్యమైనంత ఎక్కువ అవగాహన (లోతైన భావాలు)ను ఆవిష్కరించుకొన గలిగే శక్తుల్ని పాఠకులలో పెంపొంద జేసేటట్లు వుండటం."

ఈ లక్షణాన్ని బట్టి ప్రతి మినీకవిత ఒక బహుళార్థ సాధక కవితయై తీరాలి. గుడ్ మార్నింగ్ కవితలోని "లోతైన భావాలు"రచయితే వివరించారుకాబట్టి తెలిశాయి. కాని ఆ కవిత చదవగానే నాకు స్ఫురించినది మొదటి భావమే. "మినీ కవితలన్నీ .... ఈ రకమైనవేనని నా ఉద్దేశం ఎంత మాత్రమూ కాదు" అంటూనే మినీ కవితకు పై లక్షణాన్ని చెప్పటం చిత్రంగా ఉన్నది. మినీ కవిత వ్రాసిన ప్రతి రచయితా అది బహుళార్థ సాధక కవిత అవునో కాదో తెలిపితే పాఠకునికి ప్రతి కవితలోనూ "లోతైన భావాలు" వెతికే శ్రమ తప్పుతుంది.

ఎనిమిదవ లక్షణం కవిత ఎంగిలి కాని భావాలను కలిగి ఉండటం.

రంగారావుగారి "గుడ్ మార్నింగ్" చదవగానే

మాదయ్యగారి మల్లన రాజశేఖరచరిత్ర లోని యీ క్రింది పద్యపాదాలు నాకు స్ఫురించాయి.

"ప్రాచి యుమిసిన తాంబూల రసమనంగ
నుదయ రాగము మెల్లన నుప్పతిల్లె"

"తాంబూలం వల్ల కలిగిన అరుణిమగా సముద్రంలో పడిన ఉదయకాంతి భావింపబడింది"అని గుడ్ మార్నింగ్ కవితపై మొదటి వ్యాఖ్యాత వివరణ.

9వ లక్షణం : 'హృదయానందానుభూతి ద్వారా పాఠకులలో స్పందన కలిగించే చమత్కారం కలిగివుండటం'

గుడ్‌మార్నింగ్ కవితలో "స్పందన కలిగించే చమత్కారం' లేదుగాని ఆ కవితా దృశ్యం ఒక ఆనందానుభూతిని కలిగిస్తున్నది.

కనుక, లక్షణనిర్దేశకులే ఆయా లక్షణాలను తమ కవితలో పూర్తిగా పాటించనప్పుడు మినీకవితకు లక్షణాలు నిర్దేశించటం సమంజసం కాదు.

ఇక, గుడ్‌మార్నింగ్ కవితా రచనను గురించి రెండు మాటలు.

ఆకులు, వక్కలు, సున్నం చేరితేనే తాంబూలమౌతుంది. నోరు పండినప్పుడు ఆ మూడిటిలో ఏవీ వాటి మొదటి రూపములో కనిపించవు. ఈ కవితలో ఆకాశమిచ్చిన ఆకులు, చీకటి తెచ్చిన వక్కలు, వెన్నెల కలిపిన సున్నంతో సముద్రం తాంబూలం వేసుకొని నోరు పండించుకొనిన దని చెప్పబడింది. సముద్రం నోరు పండినప్పుడు– అంటే సూర్యోదయమైనప్పుడు– సముద్రానికి వక్కలు, సున్నము ఇచ్చిన చీకటి, వెన్నెల రూపుమాసిపోతాయి. కాని ఆకులనందించిన ఆకాశం రూపు చెడదు. కనుక సముద్రం వేసుకొనే తాంబూలానికి ఆకాశం చేత ఆకులను ఇప్పించటం ఎంతవరకు సమంజసమో రచయిత విచారించ ప్రార్థన.

శ్రీ సూర్యదేవర రవికుమార్

## గమనిక :

ఫిబ్రవరి, 1982 భారతిలో "వేదులవారి దీపావళి" రచయిత శ్రీ జానకీజాని పేరు పొరపాటున అచ్చుకాలేదు. ఇలాగ జరిగినందుకు చింతిస్తున్నాము.

-సం.



# గ్రంథ విమర్శలు

## శ్రీ మద్భాగవత మణిహారము

[ప్రథమ సంపుటము.సంకలనకర్తలు: సంపాదకులు, ప్రకాశకులు శ్రీ దర్భా వెంకటరమణ నటరాజ ప్రభాకర్, శ్రీ దర్భా సూర్యనారాయణ, శ్రీమతి దర్భా సుబ్బలక్ష్మి. డెమ్మీసైజు 78+472 పుటలు. వెల తెలియదు. ప్రతులకు- ప్రొఫెసర్ దర్భా సూర్యనారాయణ, ఎఫ్ ఐ ఇ, శ్రీనివాస నిలయము,14/159-గాంధిపురము-2,రాజమండ్రి-533 103]

మనకు అత్యంతపవిత్రాలై ప్రఖ్యాతాలైన గ్రంథాలలో భారతభాగవత రామాయణాలు ముఖ్యమైనవి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సంస్కృత భాగవతం కంటె పోతన్నగారి తెలుగు మహాభాగవతానికే ప్రచారం ఎక్కువ. తెలుగులోని మరే గ్రంథాలలోని ఏ పద్యాలు నోటికి వచ్చినా, రాకపోయినా పోతనగారి పద్యాలలో కొన్ని అయినా రాని ఆంధ్రులు ఉండరే ఉండరని చెప్పవలసి వున్నది తమిళ సంగీత విద్వాంసులు రుక్మిణీ కల్యాణం, గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరిత్ర మొదలైన హరికథా కాలక్షేపాలు చేసేటప్పుడు నడుమ నడుమ పోతనగారి భాగవత పద్యాలను ఉదాహరిస్తూ ఉంటారు. దీనిని బట్టి సహజ పాండిత్య విలసితుడైన ఆ కవిసార్వభౌముని రచనా వైశిష్ట్యం వ్యక్తమవుతూ ఉన్నది.

పోతనామాత్యుడు భాగవతాన్ని ఆంధ్రీకరించినా, యథామూలంగా అనువదించలేదు. సంస్కృతపురాణాలలో చర్వితచర్వణాలు, పునరుక్తులు కానవస్తూఉంటాయి. ఆంధ్రీకర్తలు బాగా ఆలోచించి ఔచిత్యాన్ని పాటించి రచనను సాగించడంవల్ల మూలగ్రంథంకంటె ఆంధ్రీకృతి కొంత చిన్నదిగానే ఉంటుంది. పోతనగారు కూడా ఆ పద్ధతినే అనుసరించారు. కొన్నిచోట్ల స్వాతంత్ర్యం కూడా అవలంబించారు. సంస్కృత భాగవతంలో - నరకాసురవధ సందర్భంలో-సత్యభామ శ్రీకృష్ణునితో కూడా వెళ్ళినట్లు మాత్రం ఉన్నదే కాని, ఆ రాక్షసునితో యుద్ధం చేసినట్లు లేదు. పోతనగారు మాత్రం ఔచిత్యాన్ని పాటించి రసవంతంగా ఆమె యుద్ధాన్ని వర్ణించారు. ఇలాంటి ఘట్టాలు ఇంకా చాలా కానవస్తాయి

తెలుగు భాగవతాన్ని అందరూ చూచి ఉంటారు. కాని, సంస్కృత భాగవతాన్ని చూచినవారు ఎక్కువమంది ఉండరు. ఈ సంస్కృతాంధ్ర గ్రంథాలను రెండింటినీ తులనాత్మకంగా పరిశీలించదలచినవారికి ఇప్పుడు సంస్కృత భాగవతం దొరకడం దుర్లభం. ఒకవేళ శ్రమపడి ప్రయత్నించినా దేవనాగరి లిపిలోనిదే లభ్యమవుతుంది. ఈ రెండింటిని ఎదురెదురుగా ఉంచుకొని పరిశీలించడం శ్రమసాధ్యం. ఈ విషయాన్ని గ్రహించిన సంపాదక ప్రకాశకులు వ్యాసమహర్షి శ్లోకాలకు సరియైన పోతనామాత్యుని పద్యాలను ప్రధానమైన వాటిని - మణులవంటి వాటిని ఏర్చికూర్చి "శ్రీ మద్భాగవత మణిహార"మనే యీ అమూల్య గ్రంథాన్ని ప్రకటిస్తున్నారు.

ప్రధాన సంపాదకులగు శ్రీ సూర్యనారాయణగారు భగవద్భక్తులు. ఆస్తిక విషయాలలో అభినివేశం కలవారు. ఆయన ఏభై యేళ్ళ క్రిందట సుసర్ల శ్రీనివాసరావుగారు ప్రకటించిన "The heart of Bhagavatham" అనే ఆంగ్ల గ్రంథాన్ని చదివి, శ్రీ భాష్యం అప్పలాచార్యులుగారి భాగవతోపన్యాసాలను విని ప్రభావితులై ఏతద్గ్రంథ ప్రకటనకు పూనుకున్నారు. 'వ్యాస, పోతనల భాగవతములలోని మణులనెంచి భాగవతసారమంతయు తీసి 'శ్రీ మద్భాగవత మణిహారము'నుమార్చి శ్రీకృష్ణ పరమాత్మకు సమర్పించవలె నన్నదే మా సంకల్పము. తన్మూలమున భాగవతధర్మములను, భగవత్తత్త్వమును, భక్తిమార్గమును, భాగవత కథలలోని విశిష్టతను, సుభాషితములను, నేటి విద్యార్థులకు, యువకులకు నందజేయవలెనన్న యాశయము, ఆసక్తి నాలో నుదయించినవి." అని విజ్ఞప్తిలో చెప్పిన దానిని బట్టి దీని ప్రకటనలో వీరి ప్రధానోద్దేశము తెలుస్తూ ఉన్నది. సంస్కృతాంధ్ర భాగవతాలు రెండింటినీ చదివే ఓపిక, సమయం ఈ యంత్రయుగంలో నివసించేవారికి ఉండడం చాలా దుర్లభం. ఈ పద్ధతిలో భాగవత ద్వయం సమగ్రంగానూ,

ప్రసంగపంగానూ గ్రహించే అవకాశం కలగుతూ ఉన్నది. సంపాదకుల యీ ప్రయత్నం ఎంతో ప్రశంసనీయమైనది.

ఈ ప్రథమ సంపుటంలో ప్రథమ స్కంధం మొదలు కొని సప్తమస్కంధం చివరి వరకూ ఉన్నది. మిగతస్కంధాలు ద్వితీయ సంపుటంలో ఉంటాయి. గ్రంథారంభానికి ముందు సమర్పణ, మహాకవి యుగళ వందనం, శృంగేరి జగద్గురువుల శ్రీముఖం, పండితాభిప్రాయాలు, ఆశీస్సులు, విజ్ఞప్తి, కృతజ్ఞతలు, ద్రవ్యదాతల వివరణ, ఇష్టదేవతా ప్రార్థన, చతుః శ్లోకి భాగవతం, భాగవత మహిమ, ప్రధాన దేవతా వందనం మొదలైనవి ఉన్నవి.

సంస్కృతాంధ్ర భాగవతాలనుంచి శ్లోకాలనూ, అనువాదాలనూ ఎంపిక చెయ్యడంలో సంపాదకులు ఎంతో శ్రద్ధ వహించి, తగినవాటినే స్వీకరించారు. ఒక్క ఉదాహరణ—

సంస్కృతమూలం

యథా తరోర్మూల నిషేచనేన
  తృప్యంతి తత్ స్కంధ భుజోపశాఖాః,
ప్రాణోప హారాచ్చ యథేంద్రియాణా
  తథైవ సర్వార్హణ మచ్యుతేజ్యా.
(వ్యాస-4-31-14)

పోతన్నగారి ఆంధ్రానువాదం—

"కమలాధీశ్వరుఁబూజసేయుట సమ
  గ్రప్రీతిఁ బ్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తి హేతువును స
  ర్వక్ష్మాజ మూలాభిషే
కము శాఖాభుజ పుష్టిదంబు నగు రే
  ఖన్ సర్వదేవార్హణ
క్రమమై యొప్పు ధరావరేణ్యసుతలా
  రా ! బుద్ధినూహించినన్"

(4-31-952)

శ్రీసూర్యనారాయణగారి సంకలనసంకల్పం పెక్కురు విద్వాంసుల ప్రశంసలను అందుకొన్నది. వదాన్యులతో పాటు విద్వాంసులుకూడా దీని ముద్రణానికి విరాళాలు అందజేశారు. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారూ, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ శివలెంక శంభు ప్రసాద్ ధర్మనిధివారూ, ఇతర సంస్థలవారి ఆర్థికసహాయం కూడా దీనికి లభించింది. చిత్రాలతో కూడా గ్రంథం చక్కగా తయారయింది. దీని ద్వితీయ సంపుటం కూడా త్వరలోనే రాగలదని ఆశిస్తున్నాను. అది వస్తే సంస్కృతాంధ్ర భాగవతాల సమగ్ర స్వరూపం సంగ్రహంగా ఆంధ్రులకు లభించగలదు. ఈ గ్రంథానికి తగిన ప్రచారం లభించగలదని భావిస్తున్నాను.

శ్రీ బులుసు వేంకటరమణయ్య

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం

[ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం. రచన స్వర్గీయ కుందూరి ఈశ్వరదత్తు. ద్వితీయ ముద్రణ 1979 ప్రథమ ముద్రణ 1963. ప్రచురణ : ఆం. ప్ర. సాహిత్య అకాడమీ హైదరాబాదు. వెల. రూ. 12.]

ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు కుందూరి ఈశ్వరదత్తుగారి ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళాన్ని 1963 లో ప్రచురించారు. దానిపై చక్కని సమీక్షా వ్యాసంకూడా వచ్చింది. ప్రచురించిన వెంటనే గ్రంథం ప్రచారంలోకి వచ్చింది. తెలుగులో అంతవరకు చారిత్రక భూగోళంపై పుస్తకాలు లేవు. శాసనాలు పరిశోధిస్తూ ప్రచురించినవారు కొన్ని ప్రదేశాలు గుర్తిస్తూ వచ్చారు. అయితే సమగ్రంగా ఏరి కూర్చినవారు లేరు. దత్తుగారు ఏ కళాశాలలోను హిస్టరీ లెక్చరరు కాదు. ఆయనకున్న బి. ఏ. వల్ల యూనివర్సిటీ మెట్లుకూడా ఎక్కలేదు. ప్రభుత్వంవారి ఆడిట్ అండ్ అకౌంట్సు డిపార్టుమెంటులో ఆఫీసరుగా పనిచేస్తూ మేనమామ చిలుకూరి వీరభద్రరావు గారివల్ల ఉత్తేజితులై చరిత్ర పరిశోధనలలోకి దిగారు. ఉత్తమ గ్రంథాలు వ్రాయటానికి యూనివర్సిటీలే అక్కరలేదు. పూర్వతరం పరిశోధకుల కెంతమందికి డాక్టరేట్లు ఉన్నాయి ?

ఈ గ్రంథం ప్రతి విద్యార్థి, విద్వాంసుడు చదివితే మనరాష్ట్ర పూర్వ భూగోళం గురించి తెలుస్తుంది. గ్రామాలు నదులు, పర్వతాలు, మొదలైన వాటి పుట్టు పూర్వోత్తరా లిందులో ఉన్నాయి. రెండో ముద్రణ మొదటి ముద్రణకి పునర్ముద్రణ కావటంవల్ల మొదటి ముద్రణ విమర్శ వెలువడటంవల్ల ఇంతకంటే ఎక్కువగా వ్రాయనక్కర లేదని పించింది.

శ్రీ నిడుదవోలు వేంకటరావు

## సాహిత్యంలో స్త్రీ
(వ్యాస సంకలనం)

[సంకలన కర్త–జాతశ్రీ ; వెల–రు 6–00 ప్రచురణ–ఖమ్మం జిల్లా అభ్యుదయరచయితల సంఘం.]

"సాహిత్యంలో స్త్రీ" అనే అంశం చాలా విస్తృతమైనది–క్లిష్టమైనది. 153 పుటల పుస్తకమే కాదు కొన్ని వందల పేజీల పుస్తకాలు వ్రాయవచ్చు. ఒక వ్యాసంలో చర్చించదగినంత చిన్న అంశం కాదిది. అయితే విశ్లేషణా పద్ధతి అధికంగా అమలులో ఉన్న యీ రోజులలో సాహితీపరులు, రాజకీయ వాదులూ, సాంఘిక సంస్కర్తలూ శక్తికొద్దీ పరిజ్ఞానాన్ని బట్టి యీఅంశాన్ని చర్చిస్తున్నారు. కాని గమనించవలసిన అంశం యేమిటంటే ఏ "అంశం గురించి, సమగ్రమైన వ్యాసం వ్రాయాలన్నా నిష్పాక్షిక దృష్టి, విషయ ప్రధానంగా పరిశీలించే దృష్టి అవసరం. మనసులో యేదో ఒక అభిప్రాయం పెట్టుకుని, ఏ అంశం గురించి వ్రాసినా అది ఒక వ్రాత అవుతుందేగానీ, వ్యాసం కాజాలదు అన్న హితవు. ఈ సంకలనంలో ధర్మశాస్త్రాల్లో స్త్రీ, ప్రబంధ సాహిత్యంలో స్త్రీ, మత గ్రంథాల్లో స్త్రీ, శిల్పకళలో స్త్రీవంటి 16 వ్యాసాలున్నాయి.

అసలు స్త్రీనిగురించి ఇంత చర్చదేనికి? మనదేశంలో–ఇతర దేశాలలో కూడా – వెనుకబడిన జనాభాలో స్త్రీలుకూడా వున్నారు కనుక అని ఒక సమాధానం. అయితే ఇలా వ్యాసాలు వ్రాస్తే స్త్రీల వెనుకబడిన తనం పోయి, అభ్యుదయ పథంలో వారు పురోగమిస్తారా? అని మరొక ప్రశ్న ఒక్కరోజులో, ఒక్క తరంలో వారి వెనుకబడిన తనం పోక పోవచ్చు. కాని ఇలా స్త్రీల సమస్యలను వెలుగులోకి కొని రాగా, కొన్ని తరాల తర్వాతనైనా వారి సమస్యలు పరిష్కారం కావచ్చు. చాలా దేశాలలో ఇలాజరిగిందని చరిత్ర చెబుతుంది అని కొందరి వాదన. నిజమే కావచ్చు. కానీ, సాహిత్యం కాల్పనిక మైనప్పుడు, అందులోని పాత్ర వూహాజనితాలయినప్పుడు వాటన్నింటిని వాస్తవాలుగ పరిగణించడం తర్క పద్ధతి అవుతుందా. ఒక చెంప వాస్తవికత, సమాజస్పృహ వంటి పదజాలాన్ని కుప్పిస్తూ మరొక చెంప ప్రబంధాలలోని స్త్రీలను గురించి, ధర్మశాస్త్రాలలోని స్త్రీని గురించే, శిల్పకళలో స్త్రీ గురించి – ఇంకా చాలా శీర్షికలనుదహరించవచ్చు– చర్చించడం వాస్తవికత అవుతుందా ? ఏమో ఎవరి అభిప్రాయాలు వారివి. వ్రాసిన వ్యాసాల గుణగణాలను చర్చించితే సరిపోదా ?

"ప్రాప్తేతు ద్వాదశే వర్షేయః కన్యాం నప్రయచ్ఛతి
.... .... .... .... ....
త్రయస్తే నరకం యాంతి దృష్ట్యా కన్యాం రజస్వలామ్.

ఈనాడు వార్తాపత్రికలలో స్త్రీలపై అఘాయిత్యాలను గురించి ఎన్నెన్ని వార్తలు వస్తున్నాయి ? పన్నెండేండ్ల పిల్ల కాదండి బాబూ – ఆరేండ్ల పసికందు పై అఘాయిత్యం జరిగినట్టు పత్రికలలో చదవడం లేదా ! ఇదంతా ఎందుకు ప్రస్తావించవలసి వచ్చిందంటే మానవాళి ఈనాడు మానసిక సంక్షోభంలో, భావ దారిద్ర్యంలో చిక్కుకున్నది. దాని ఫలితాలే యిలాంటి దుస్సంఘటనలు. ఈ సంక్షోభానికి కారణం ఏమిటి అని విశ్లేషిస్తేపాతపద్ధతులు అంతరించడం. కొత్త పద్ధతులూ, విలువలూ సమగ్ర దృష్టి అలవడక పోవడం. కేవలం కసిగా వ్రాతలు వ్రాసినంతమాత్రాన యీ సమస్య పరిష్కారం కాదు. కేవలం స్త్రీలకు మాత్రమే పరిమితమైనది కాదు ఈ సమస్య. మరొక రూపంలో పురుషులనుకూడా వేధిస్తున్నది. ఆ మాటకొస్తే ఒక రూపంలో కాదు– నిరుద్యోగం– చాలీచాలని జీతం వచ్చే వుద్యోగం వంటి పెక్కురూపాలలో ఈ సమస్య పురుషులను వేధిస్తున్నది. కాని యీ పుస్తకంలోని అంశం అందుకు సంబంధించినది కాదు గదా.

గురకులాలలో వ్యభిచారం సంగతిని ప్రస్తావించారు ఒక వ్యాసంలో. అసలు వ్యభిచారం అంటే ఏమిటి : పురుషుడికి లేని న్యూనతలను స్త్రీకి అంటకట్టడం సమదృష్టి అవుతుందా ? ఇలాంటి అంశాలను చర్చించేటప్పుడు దేశకాలావసరాల పరిగణన అవసరం లేదా ? స్త్రీకి అన్యాయం జరుగుతున్నదని చర్చించబోయి మరికొంత న్యూనతను స్త్రీకి అంటకట్టడం, ఆమెకు సంబంధించిన సమస్యలను బహిరంగంగా చర్చించటం సబబా ?

ఈ పుస్తకం 37వ పుటలో డాక్టర్ రావి భారతిగారు సూచించిన అంశాలు మహిళా లోకమంతా చర్చించదగినవి. కానీ ఒక విషయం గమనించాలని మనవి- స్త్రీ- అనుమతి, అంగీకారం లేకుండా ఎవరూ ఆమెమీద అమాయిత్యం చెయ్యలేరు అడ్వర్‌టైజ్‌మెంట్‌లలో మోడల్స్‌గా నిలబడడానికి స్త్రీలు ఎందుకని అంగీకరిస్తున్నారూ' సినిమాలలో రేప్ సీన్లుంటే వాటిని మహిళాలోకం ఎందుకని బహిష్కరించడం లేదూ?

ఈ సంకలనంలోని శిల్పకళలో స్త్రీ అనే వ్యాసం యీ పుస్తకం పరిధిలోకి రాదనుకుంటాను. సావిత్రిగారు వ్రాసిన "తరతరాల సాహిత్యంలో స్త్రీ"అనే వ్యాసం చాలా బాగున్నది. సహేతుకంగా, ఔచిత్యంగా వున్నది. 57వ పుటలో "నిశితంగా చూసే శక్తే మనకి వుండాలిగానీ ప్రపంచ సాహిత్యంలో 80 శాతం, హీరోమీద రచయితకున్న అర్థరహితమైన ...." అనే పేరా నుంచి "ప్రతి రచన ఈ విధంగా చూస్తే సాహితీ వేత్తలలో స్త్రీ ద్వేషుల పాలు ఎంతఎక్కువో తెలుస్తుంది" వరకూ వున్న అంశాలను మహిళలందరూ శ్రద్ధగా పరిశీలించడమవసరం.

కోడూరి శ్రీరామమూర్తిగారు తెలుగు నవలా సాహిత్యంలో స్త్రీమనస్తత్వ చిత్రణ గురించి బాగా వ్రాశారు.... "స్త్రీని అణగదొక్కడానికి "సంప్రదాయం" అనే పేరు ఉపయోగపడిన సందర్భాలు చాలా కనపడతాయి. అయితే- దీనివల్ల స్త్రీ స్వేచ్ఛ కొంతవరకూ అణచబడిందేమోగాని- ఆమెలోని స్వేచ్ఛా ప్రియత్వాన్ని అణగదొక్కగల శక్తి సంప్రదాయానికి లేకపోయింది" (61వ పేజీ)- ఎంతబాగా వ్రాశారూ! ఇంతే కాదు ఆధునిక తెలుగు రచయితలు స్త్రీల హృదయాలలో చెలరేగే పాత్ర చిత్రణ గురించి కూడా యీ రచయిత చక్కగా విశ్లేషించారు. నాటకాలలో స్త్రీ గురించి వ్రాసిన వ్యాసంలో రచయిత్రులూ, రచయితలూ ఆలోచించవలసిన అంశాలు చాలా వున్నాయి చలం రచనలో స్త్రీ గురించి దిలావర్ వ్రాసిన వ్యాసం అసమగ్రం అనిపించింది. "సాహిత్యంలో స్త్రీ" అని యీ సంకలనం పేరయితే వరకాల పట్టాభిరామారావుగారు రాజకీయరంగంలో స్త్రీ గురించి చక్కటి వ్యాసం వ్రాశారు. "స్త్రీలు - మూఢ విశ్వాసాలు" అనే శీర్షికన హేమలతా లవణం వ్రాసిన వ్యాసాన్ని యీ సంకలనంలో ఎందుచేర్చారో అర్థం కాదు. సాహిత్యంలో స్త్రీ చిత్రణ గురించి గదా చర్చించవలసిన అంశం. ఉపాధ్యాయినిగా స్త్రీ పాత్ర చాలా గొప్పదే కాని సాహిత్యంలో ఎంతమంది ఉపాధ్యాయినుల చిత్రణ వున్నది ? ఒక ముక్కలో చెప్పాలంటే ఈ సంకలనంలోని వ్యాసాలు కలగా పులగంగా వున్నాయి. అందుకు ప్రచురణ కర్తలు కొంతవరకూ బాధ్యులు? ఆషామాషీగా ఇలాంటి సంకలనాలను ప్రచురించటం సబబు కాదనుకుంటాను. వ్యాసాలను ఎంచుకొనడంలో మరింతజాగ్రత్త అవసరం కదా!

# ధర్మపథం

[రచన-బులుసు వేంకటరమణయ్య. వెల-రు. 15-00 ప్రతులకు-బులుసు వేంకటరమణయ్య, 4, సెకండ్ స్ట్రీట్, పురుషోత్తం నగర్, క్రోమ్‌పేట, మద్రాసు 600 044]

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ద్రవ్య సహాయంతో ముద్రితమవుతున్న మంచి పుస్తకాలలో ఇదొకటి. గ్రంథకర్తగారన్నట్లు ఇవి అన్ని రకాలవారికీ ఆనందాన్ని కలిగించే విషయాలు. కథలు, గాథలు మాత్రమే కాదు ధర్మసూక్ష్మాల్ని సరళంగా పామరులందరకూ విదితం చేసే విషయాలు కూడా. ఒక విధంగా చూస్తే యీ సమాజవ్యవస్థ అంతటికీ మూలస్తంభం, ప్రాణం, వూపిరి-ధర్మం. ధర్మం అంటే యేమిటో యీ 270 పుటల పుస్తకాన్ని శ్రద్ధగా చదివితే తెలుస్తుంది. ధర్మస్వరూప స్వభావాలు అలాంటి . నిర్వచనంగా క్లుప్తంగానూ చెప్పవచ్చు. కానీ ఆ నిర్వచనం అంద

రకూ అర్థం కాకపోవచ్చు. అలా కాకుండా అంగరకూ అర్థం కావడానికే యిలాంటి కథలు మన ధర్మశాస్త్రానికే కాదు- అన్ని ధర్మశాస్త్రాలకూ అవసరమయ్యాయి. ఒకానొక మత సిద్ధాంతాన్ని ఆలంబనంగా జేసుకుని, ఆమతంలో ఇమిడివుండే ధర్మాన్ని విశదం చేయడానికి కథలూ, గాథలూ అవసరమయ్యాయి. మనకు సాహిత్య సంపదలేదు. నిర్దిష్టమైన ధర్మం లేదు అని యీ రోజుల్లో చాలామంది నోట వినిపిస్తుంది. అలాంటి వారు మాత్రమే కాకుండా ధర్మమంటే యేమిటో స్పష్టమైన అవగాహన లేని వారందరూ కూడా యీ పుస్తకం చదవడం అవసరం. సంస్కారాలకూ, ఆత్మ గుణాలకూ వున్న సంబంధాన్ని మన ప్రాచీన మహర్షులు చెప్పినంత స్పష్టంగా యీ కాలంలో ఎంతమందిచెప్పగలరు? సంస్కారాలు ఉండగానే ఉండగానే సరిపోదు. హృదయం కూడా వుండాలి. ఉత్తమ శీలం వుండాలి. భక్తులుగా చెలామణీ అవుతూ ద్రోహచింతలో వుండేవారి స్థానం యేమిటో వివిధ కాలాలలోనూ సమాజ వ్యవస్థ నిర్ణయిస్తూనే వున్నది. ఆ సంగతిని గ్రహించడానికి కూడా కొంత సంస్కారం వుండాలి. ఇక్కడ గమనించవలసిన అంశం సంస్కారాలకంటే ఉత్తమ గుణాలే ప్రధానమన్న అంశం. ఉత్తమ శీలం అంటే యేమిటో "నాహం జానామి కేయూరే .......నిత్యం పాదాభి వందనాత్" అనే చిన్న శ్లోకంలో చిత్రించిన ఆదికవి వాల్మీకి మహర్షి ప్రతిభను యీ రచయిత చక్కగా వివరించారు. ఇలాంటి సూక్ష్మాంశాలను గ్రహించగలుగడానికి కేవలం పాండిత్యం ఒక్కటే చాలదు. ఉత్తమ సంస్కారం, ఉత్తమ శీలంకూడా అవసరం. అవసర సందర్భాలలో పెద్దలకు పిన్నలే సుద్దులు చెప్పవలసి వస్తుంది. వాజశ్రవసుడు, నచికేతుల కథ యీ అంశాన్ని విశదం చేస్తుంది. ఇలాంటి కథలవల్లనే యీ పుస్తకానికి సార్వజనీనతవచ్చింది. ఇలాంటి అంశాలన్నీ కలసి మనధర్మం అయింది. ఈ ధర్మాన్ని ఇలా కథలుగా వివరించగలగడానికి పాండిత్యం మాత్రమే కాక ఎంతో ఉత్తమ శీలంకూడా అవసరం. సవితి తల్లిప్రేమ అనే నానుడి అన్ని సందర్భాలలోనూ చెల్లదని "సుమిత్ర సుస్వభావం"అనే కథ వివరించుతుంది. దేవుడెక్కడ ? అనే కథలోని

"యచ్చకించి జ్జగత్సర్వం.

........ ........ ........ ........

వ్యాప్యనారాయణ స్థితం" అనే శ్లోకాన్ని నిత్యం వల్లించే వారెందరో వుంటారు మనలో. కని యీ కథలో సూచితమైన దృష్టితో యీ శ్లోకాన్ని మననం చేసేవారు అరుదుగా వుంటారు. ఉపనిషత్తులూ, పురాణాలూ, ఇతిహాసాలూ చదవలేని వారూ, చదివినా అర్థంకాని వారందరూ తప్పక చదవవలసిన మంచి పుస్తకాలలో ఇదొకటి. మన మతం ఎంత ఉదారమైనదో, ఎంత వైవిధ్యం మన ధర్మంలో ద్యోతకమైనా అంతర్గతంగా ఆ వైవిధ్యంలో ఎంత గొప్ప మానవతా ధర్మం వున్నదో గ్రహించగలగడానికి దోహదపడే యీ పుస్తకాన్ని మన విద్యాసంస్థల్లోఉపవాచకంగా ఎందుకని అధికారులు నిర్ణయించరాదో !

## శాకాహారముపై వెలుగు వెల్లువలు

[రచన-వి. నిరాకరరావు, గౌ. కార్యదర్శి, ఇండియన్ వెజిటేరియన్ కాంగ్రెస్, విశాఖపట్టణంబ్రాంచి, వెల-రు.2-00 ప్రచురణ-ఇండియన్ వెజిటేరియన్ కాంగ్రెస్, 27-4-30 మెయిన్‌రోడ్డు, విశాఖపట్టణం.]

యుక్తాహారం మానవునికి అన్ని ఏ దృష్టితోచూచినా అవసరం ! అయితే ఏది యుక్తాహారం అంటే దేశకాల పరిస్థితులూ, వాతావరణం వంటి వాటిపై యీ ప్రశ్నకు సమాధానం ఆధారపడి వుంటుందని కొందరి వాదనగా వున్నది. కాయ కష్టం చేసే వారికొక రకం ఆహారం, మెదడుతో పని చేసే వారికొక రకం ఆహారం అవసరమని మరొక అభిప్రాయం. మనం భారతీయులం. భారతదేశంలో వున్నాం మనకు మాంసాహారం యుక్తమైనదా ? శాకాహారం యుక్తమైనదా ? అనే ప్రశ్న యీ దశాబ్దంలో చర్చకు రావడం విచిత్రమే. బ్రిటన్‌వంటి శీతలమండల దేశాలలోనే శాకాహారం ప్రాముఖ్యాన్ని గుర్తించి, ఆ పద్ధతిని ప్రచారం చేయడానికి కొందరు మేధావులొక సంఘాన్ని యేర్పాటుచేసి ఎన్నో సంవత్సరాలయింది. అలాంటి సందర్భంలో శాకాహారం ప్రయోజనాలను గురించి భారతదేశంలో ప్రచారం చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయంటే - ఏమనుకోవాలి? యీ దశ గురించి ఏమని అనుకున్నా ఆ పరిస్థితి వున్నది కనుకనే ఇలాంటిపుస్తకాలు అవసరమవుతున్నాయి. 40 పుటలలో యీ రచయిత చాలా ప్రయోజనకరమైన అంశాలనుపొందుపరచాడు. మానవుడుజన్మతః శాకాహారియే.

చరిత్ర ఇందుకు సాక్ష్యం అనాది కాలంలో కూడా మాంసాహారులు కొందరు లేకపోలేదు. ఋగ్వేదంలో మాంసాహారాన్ని నిషేధించలేదని వాదించడం యుక్తివాదం. దానికి బదులు ఎవరి పంటికిపడే ఆహారం వారు తింటారు. శాకాహారమే తినాలని బలవంతం చేయుటం మంచిదికాదనే వాదన అర్థం అవుతుంది. ఈ పుస్తకంలోని మాంసాహార పదార్థములు - వాటిలో కొలెస్టరాల్ పరిమాణము, సమీకృతాహారపట్టిక, ముఖ్యమైన విటమినుల పట్టిక అనే అధ్యాయాలు చాలా ముఖ్యమైనవి. శాకాహారం కూడా యీ రోజులలో పెక్కు కారణాలవల్ల లోపభూయిష్టంగా వుంటున్నది. ఆ లోపాలకు దోహదపడే కారణాలను నివారించేందుకు కూడా ఒక ఉద్యమం అవసరం కాదా? సాత్వికులు, మధ్యతరగతి వారు తప్పక చదవవలసిన మంచి పుస్తకం ఇది. చదివిన తర్వాత ఆచరించ గలిగిన విధానాలను ఆచరించవచ్చు. ఇంకనూ మనోబలం, సంకల్పబలం, దృఢనిశ్చయం అవసరం మంచి అలవాట్లను అలవరచుకొనడానికి.

# ఆంధ్ర మహాభ్యుదయము

(పద్య కావ్యం)

[రచన-మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యం. మూల్యము రు. 95. ప్రతులకు - మహాకవి బండ్ల సుబ్రహ్మణ్యము, రిటైర్డ్ తెలుగు పండితుడు. రావూరిపేట, వేటపాలెం 23187]

అమరజీవి పొట్టి శ్రీరాములు జీవితం, భారత స్వాతంత్ర్య సమరము, అల్లూరి సీతారామరాజు చరిత్ర, ఆంధ్రరాష్ట్రోద్యమం ఈ 97 పుటల మహా కావ్యంలో వున్నాయి. రసము, అలంకారము, ఛందస్సు, దండకము పురవర్ణన తదితర కావ్యలక్షణాలన్నీ వున్నందున ఇది నిజంగా మహాకావ్యం. ఈ గ్రంథకర్త మహాకవి యనడానికి ఎట్టి సందేహమూ లేదు. ఇన్నింటికి మించి ఈ కావ్య ఇతివృత్తం రాజకీయమైనదనిఅనిపించినా ఓపికగా, శ్రద్ధగా చదవగలిగినవారికి ఇందు మానవ కథ కనిపిస్తుంది. గురవయ్య నిర్యాణము అనే అధ్యాయంలో కవి యిలాఅంటాడు:

తే ॥ ఆరిపోనున్న తిల్లిక యందు వెల్గు
కొట్టుకొనునట్లు శ్వాసలు కొట్టి పైకి
చూచు చుండగ జీవుడు లేచిపోయె
గొల్లుమని యె జెడరలు జల్లుమనగ.

పొట్టి శ్రీరాములుగారి తండ్రి గురవయ్య మరణాన్ని చెప్పిన పద్యమిది. ఇందులో కవి మానవతా దృష్టి చక్కగా ద్యోతకమవుతుంది. అంతటితో నాగెనా లేదు-

సీ॥ ఇంక సంసారమ్ము నీమె యెట్లోదునో
యని కంట నీర్వెట్ట నబల యొకతె
తన చేతితో నొక్క తనయు పెండ్లియైన
నోమండను చేడె యొకతె
సతుల కీ స్థితికంటె నతి దుఃఖమేదని
సానుభూతిని జూపు చానయొకతె
పసుపుకుంకుమలన్న పడిచచ్చు నీ తల్లి
కఱవయ్యె నవి యను కాంత యొకతె

తే॥ పరుల మేల్జూచు ఘనుడను పడతి యొకతె
మంచి ఫలమేరు హరుడను- మగువ యొకతె
యిట్లు పొరుగిండ్ల యింతులు చుట్టుజేరి
చెప్పుకొనుచుండిరాత్మల జింత లెసగ

కవితయున్న నిట్లుండవలె. ఇందు సామాన్యునికి అర్థం కానంతటి పెద్ద పదములేదు. అనుభూతి సార్వజనీనము. పదగుంభన లేదు. అనవసర పదప్రయోగము లేదు. మంచి కవిత్వానికి ఏమేమి యవసరమో అవన్నీ ఇందుకలవు.

ప్రాతౌచిత్యమైన అనుభూతులను కవితగా వ్యక్తీకరించడం యీ కవి ప్రత్యేకత. అందునొక ఉదాహరణ:

తే ॥ గొంతి గొంతెమ్మ కోర్కెల పొంతబోక
సుతులు ఫలితులు గాకుండ జూచుకొనదె
ధర్మ విద్యా విచారులై తగిన పేరు
వారు నిల్పరె యాచంద్ర తారకముగ (49)

ఈ విధంగా నల్లేరుమీద నడకగా నడిచినది ఈ కవి కలము. లక్షణవిరుద్ధముగాకుండా- అలంకార ఉల్లంఘనము జరుగకుండా రస విరసము జరుగని పద్ధతిలో ఆధునిక కాలంలో ఇట్టి కవికలరు అనుట అతిశయోక్తి కాజాలదు. ఏలనన కావ్యగుణములనెరిగి సందర్భోచితంగా వచనము నుపయోగించు ఇక్కాలమందెంత మందికలరు ?

ద్వితీయ ప్రకరణములో ఏమైనా శతఘ్నులు ప్రేల్చుట (జర్మనులో మద్రపురిపై శతఘ్నులు ప్రేల్చుట, మద్రపుర్ బీభత్సము ఈ కవి రసవంతముగా వర్ణించినాడు. కావ్యలక్షణ పోషణ కనుగుణంగా 81వ పుటనుంచి వసంత ఋ వర్ణన యీ కవి హృద్యంగా చేసినాడు. సీతారాముల కళ్యాణ యత్నమను అధ్యాయము వచనంతో ప్రారంభించుట ఎంతయు సార్ధకంగా నున్నది.

ద్వితీయ భాగం ప్రారంభంలో విష్ణుప్రార్థన- నాగబంధము, పుష్పమాలికా బంధము- లక్ష్మీదేవి ప్రార్థన ఉన్నాయి. ఇవికాక సరస్వతీ ప్రార్థన వీణా బంధము కలవు. వీణా బంధము ఈ కవిగారి నూతనసృష్టి అయిననూ యీ ఉత్పలమాల పద్యం అందంగానూ, రసవంతంగానూ ఉన్నది. ఇంకను యీ కవి యీ కింది కవితా ప్రయోగాలు చేసినాడు రసవంతంగా. (1) రథబంధము-ఈశ్వరప్రార్థన (2) ద్వినాగబంధము-ఈశ్వరసృష్టి (కవిగారి సృష్టి) (3) గర్భకంద చంపకమాలానాగాభరణము- ఈశ్వర ప్రార్థన. (4) శ్వేతచ్ఛత్రబంధము (5) నాగబంధము. (6) దోధకము. (7) సుగంధి. ఇట్టి కవితా ప్రక్రియలు గారడీలుకావు ఔచిత్యం కలవి. అర్థవంతములైనవి సందర్భానుసారం ఉపయోగించినట్టివి.

శ్రీరాములు గార్హస్థ్యములో కవిఇట్లనుచున్నాడు.

కం॥ పిండీకృత శాటుల వెనఁ
జండాంశునకెదుట గట్టి-సతి తేనీటం
దండిగ నల్పాహార మొ
కండొసంగి నిజేశుదన్ని-కలకృతి కనుపున్ ॥

ఈ కంద పద్యంలో ఆధునికత ప్రాచీనతా కవితా రీతుల మేళవింపు వ్యక్తమవుతుంది.

కవి చమత్కారమునకు మరొక మచ్చు:

సీ॥ చనవమై- జనవుమై సంతరించి పరించి
యించు విల్మించుల-మంచి నెంచి
మా పైన మా పైన- నేపారున చూపు
మరుతూపు మధురిమ - మహిమజూపు
నేరైన నేరైన - శృంగార రసమీర
మీరఁ గందురు విధి - యోగమేద
నేలిన వేవిన - విహగరాగ వియోగ
యోగ రహస్యార్థ-మిగిసాగ

తే॥ ఐహికాముష్మికములకు-నంటగట్టి
యొంట రెంటిని సాధించి-మంటలోన
మణుల పెకలించి యానంద-మనుభవించి
మంచి దంపతులిహ కీర్తిని-మనుచునుండ్రు.

మధ్యతరగతికంటె కూడా హీనంగా వున్న స్థితిలో పొట్టి శ్రీరాములు దంపతులను ఇంత ఉదాత్తంగా కవి చిత్రించడానికి ప్రధాన హేతువు శ్రీరాములు తన రాష్ట్ర ప్రజల కోసం చేసిన ఆత్మబలిదానం. ఇది సాంఘిక ప్రయోజనం. ఇక పై పద్యంలోగల అలంకార చమత్కారములు సహృదయులకు సులభ గ్రాహ్యాలు.

182 వ పుటలో బొంబాయి వర్ణనకు వచనాన్ని కవి వినియోగించటం ఎంతేని సమంజసంగా వున్నది. కావ్య లక్షణాని కనుగుణంగా 199 వ పుటలో గ్రీష్మర్తువు వర్ణన రమ్యంగా జరిగినది.

ఈ కవి ప్రయోగించిన అచ్చతెనుగునకు ఒక ఉదాహరణ.

ఉ॥ మక్కువఁగూలినాలి పజ-మచ్చిక సేయుగఁదమ్ము నమ్మిబై
బ్రక్కన పెర్గి పెన్గుడిసె-వాకిట వచ్చని చెట్లు పొదఁలం
గుక్కలు కోళ్ళునోర్దెబచి-కుండల దగ్గరనేల ద్రవ్వుచున్
మిక్కిలిపీడికోడివడి-మేస్తడినొత్తుచుగమ్ము గూర్కెడిన్

ఇదే విధంగా సంస్కృత పద రహితంగా 201 వ పుటలో

సీ॥ పెల్లాకటిగబల్ల-తల్లిపై జేవైచి
పాగ్గోలి నుటు ప్రక్కన-బట్టి బట్ట

........................ ........................

గడిది నడిజాము ప్రొద్దు ము-క్కన్ను తెఱచ

సీసపద్యం వ్రాశారు యీ కవి. సంస్కృత పదం లేకుండా వ్రాయడమన్నది ప్రధానం కాదు. ఈ పద్యం ఎంత రమ్యంగా వున్నదనేదే ప్రధానం.

ఇదే విధంగా యీ కవి లౌక్యజ్ఞానాన్ని యీ కింది పద్యం సూచిస్తుంది.

తే॥ పుడమి గుండ్రని వంకాయ - బుద్ధి పుట్టి
కటికి వేసంగి యనెడి మం-గలమునందు
నునిచి దుమ్ముకారము ,జల్లు-చుండె సారె
సమయ మౌదనికుడు వేపు నలుపునే మొ॥

గుండ్రని వంకాయ యనుటలో నీ కవిచమత్కారము కాననగును (603)

ఉద్యోగంలో పొట్టి శ్రీరాములు పడిన బాధలను ఉద్యోగ బాధయను యధ్యాయమున చక్కగా వర్ణించినాడు ఈ కవి.

ఇట్లు ప్రతి అధ్యాయము నందలి గుణ దోషములను వివరించిన నీ వ్యాసమెంత వ్రాసిననూ పూర్తి కాదను భీతి కారణమున నింక సూక్ష్మముగా ఒకటి రెండు అంశములను పేర్కొందును.

పొట్టి శ్రీరాములుకు ఇంతవరకూ ఎవరూ చేయని గౌరవము యీ కవి అక్షర రూపాన చేసి చరిత్రలో ఆయనకు సుస్థిర స్థానం కల్పించినాడు.

ఆంధ్రులు స్వరాజ్యోద్యమం ప్రారంభం నుంచీ సంకుచిత స్వార్థదృష్టితో నంను పాల్గొనలేదు. తదనుగుణంగా ప్రాయికంగా పొట్టి శ్రీరాములు జీవితం, ఆత్మాహుతి ఇతివృత్తంగాగల యీ కావ్యమునంతా కవి ప్రపంచ స్థితిగతునూ, సత్యాగ్రహ సమర సందేశమునూ, సత్యము, మత సహనము, అస్పృశ్యతా నివారణ, జలియన్‌వాలా బాగ్ దురంతము, సాబర్మత్యాశ్రమము, రఘుపతి కీర్తన, శ్రీరాములు గాంధీని దర్శించుట, కన్నెగంటి హనుమంతు కథ, పెదనంది పాడుపన్నుసమ్మె, అల్లూరిసీతారామరాజుచరిత్ర, పరివర్తనము విప్లవ హేతువు, జాతీయ చైతన్యము, ఒంజేరిసంగ్రామము వంటి యీతరం యువతీయువకులకూ, రచయితులకూ తెలియని పెక్కు విషయాలను ఈ కావ్యంలో యీ కవి చేర్చినాడు. ఉప్పు సత్యాగ్రహము, పటేలు ప్రబోధము, నేతాజీ అంతర్హితుండగుట, తాత్కాలిక స్వరాజ్య స్థాపనము, నౌకాళీ ఘోరకృత్యములు, హరిజనోద్ధరణము, గాంధీ నిర్యాణము, వంటి అంశాలను ఈ కవి రమ్యంగా వర్ణించినాడు. అయితే ఈ కావ్యంలో అవి ఎంతవరకవసరమని కొంత మందికి అనిపించుతుంది. ఇక ఆంధ్రరాష్ట్ర యత్నము (602) యను అధ్యాయమునుంచి ప్రతి అధ్యాయమూ యీ కావ్యానికి ప్రాణాలు. ఆంధ్రకేసరి సర్వేపల్లి రాధాకృష్ణన్, రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, నెహ్రూ మహోపన్యాసము, పూర్ణచంద్ర వర్ణనములతో ఈ కావ్యం పూర్తయింది. ఇంత బృహత్ కావ్యం వ్రాయడానికి కవిలో ఎంత సత్తా, ఓపికా వున్నవో గదా! వెలఅధికముగుటచేత ఈకావ్యం సామాన్యులకు అందుబాటులో నుండదు. గ్రంథాలయాలు, విద్యాసంస్థలూ విరివిగా ఈ కావ్యాన్ని కొని బహుళ ప్రచారం చేయడ మవసరం.

శ్రీ వి. ఎస్. అవధాని



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247

80

